Largest Circulated Telugu Monthly

# చతుర

నవంబర్ 1997

రు. 7/-



## కాన్వెంట్

– కృష్ణజ

# చతురప్రపంచం

## తాజ్‌మహల్ ఎవరి స్మృతి

అమరప్రేమకు అద్దంపట్టే తాజ్‌మహల్ నిర్మాణ కాలానికి సంబంధించి వివాదాస్పద వాదనలు వెలువడ్డాయి. కొంతమంది దాన్ని షాహజహాన్ నిర్మించాడన్నది అబద్ధం అని తేల్చారు.

సెంట్రల్ ఏషియా స్టడీస్ అసోసియేషన్ సభ్యుడైన డాక్టర్ మార్విన్ మిల్జ్ పై విషయాన్ని నిర్ధారిస్తూ మహారాష్ట్రలోని థానేలోగల ఓరియంటల్ రీసెర్చి ఇన్‌స్టిట్యూట్‌కి ఓ రిపోర్ట్ పంపాడు. ఇది జరిగిన 25 సంవత్సరాలకి ప్రఖ్యాత చరిత్రకారుడు సర్‌ఓక్ కూడా అదే మాట చెబుతూ తాజ్‌మహల్ షాజహాన్ కాలానికి చాలాముందే మొగలుల చేత నిర్మింపబడిందని చెప్పాడు. అటుపైన కొన్నాళ్లపాటు ఆ మాట మళ్లీ మరుగున పడిపోయింది. ఈమధ్య కొంతమంది అమెరికన్ శాస్త్రవేత్తలు దానిమీద పరిశోధన చేసి సర్‌ఓక్ చెప్పింది నిజమంటున్నారు. అమెరికాలోని బ్రూక్లిన్ కాలేజీకి చెందిన కొంతమంది విద్యార్థులు దీనిపై విస్తృతంగా పరిశోధనలు జరిపి దాని నిర్మాణం షాజహాన్ కాలానికి 350 సంవత్సరాల పూర్వమే జరిగిందని తేల్చారు. అంటే దాదాపుగా క్రీ.శ. 1359లో ఇది నిర్మింపబడిందన్నారు.

న్యూయార్క్ యూనివర్సిటీకి చెందిన డేవిడ్‌కింగ్ కూడా దీనిని సమర్థించారు. ఎవరో హిందూ రాజుచేత కట్టబడిన కోటనే పడగొట్టి ఆ స్థలాన్ని మరింత విస్తృతపరిచి తాజ్‌మహల్ నిర్మించారని ఒక పరిశోధనలో తేలింది. ముఖ్యంగా తాజ్‌మహల్ ప్రాంగణంలోని మసీదుల ముఖ్యద్వారాలు సరిగ్గా మక్కా వైపుకు ముఖం పెట్టి లేకుండా కొద్దిగా ఒంపుగా వున్నాయి. అప్పటి శిల్పులు ప్రఖ్యాత కళాకారులు. అలాంటి చిన్నచిన్న తప్పులను చెయ్యరని అందరికీ తెలిసిందే. అయితే మరి... అది హిందూ శిల్పులచేత కట్టబడటంవల్ల అలా జరిగిందా? లేక ఇంకేమైనా కారణమున్నదా? అన్నది తేలలేదు.

హాలెండుకు చెందిన డా॥ బెక్‌డెన్ అనే ప్రఖ్యాత చరిత్రకారుడు కూడా చెప్పిందేమంటే, 'తాజ్‌మహల్ నిర్మాణాన్ని పరిశీలిస్తే ఎక్కువగా హిందూ కట్టడ పద్ధతి కనిపిస్తుంది' అని.




ఇంతకీ ఈ రీసెర్చి స్కాలర్లందరూ తాజ్‌మహల్ షాజహాన్‌కి పూర్వం కట్టారనో లేక

కవర్‌ఫోటో : శివసత్యమూర్తి

షాజహాన్ మాత్రం దానిని కట్టలేదనో తేలుస్తున్నారు.

ఇప్పటికీ దాన్ని ఎవరు కట్టారు? దాని కోసం ఎంత ఖర్చుపెట్టారు? దాన్ని నిర్మించిన శిల్పులెవరు? లాంటి ప్రశ్నలు ప్రశ్నలుగానే మిగిలిపోయాయి. నిజానికి భారతదేశ శిల్పకళలో మొగలుల పాత్ర ఎక్కువనే చెప్పొచ్చు. అక్బరు పరిపాలనాదక్షుడే కాక కట్టడ చిత్రణలో కూడా ఆరితేరిన కళాకారుడు. అతడు హిందూ, ముస్లిమ్ పద్ధతుల సమ్మిళిత శిల్పకళను ప్రవేశపెట్టాడు. హిందూ శిల్పకళకి షాహజహాన్ కాలం స్వర్ణ యుగమనే చెప్పాలి. అతని కాలంలో లాహెూర్, ఢిల్లీ, ఆగ్రా, అజ్మీర్, కాశ్మీర్, కాబూలు, అహమ్మదాబాద్ మొదలైన ప్రాంతాల్లో ఎన్నో భవనాలు, పార్కులు, మసీదులు, కోటలు నిర్మింపజేశాడు. మొదట్లో ఆగ్రా ఫోర్ట్‌ను అక్బరు ఎర్రరాతితో నిర్మిస్తే షాజహాన్ దాన్ని చలువరాతితో పునర్నిర్మించాడు. షాజహాన్‌చే నిర్మించబడిన కట్టడాల్లో రెడ్‌ఫోర్ట్, దివానీఖాస్, మోతీమసీదు, జామా మసీదు, ఆగ్రామసీదు ఇవన్నీ ముఖ్యమయినవి. కానీ చాలామంది హిందూ చరిత్రకారుల వాదన ఏమంటే, ఈ మసీదులన్నీ పూర్వపు హిందూ దేవాలయాలనీ వాటిని మసీదులుగా పునర్నిర్మించారనీను.

తాజ్‌మహల్ నిర్మాణ ప్రణాళికను ఎవరు తయారుచేశారనే విషయంపై కూడా భిన్నాభిప్రాయాలున్నాయి. మానుద్దీన్ అహమ్మద్ అనే చరిత్రకారుడు 'దాని ప్రణాళికను తయారుచేసింది ఉస్తాద్ ఇసాఖాన్' అంటున్నాడు. దివాన్-ఎ-అఫ్రిది అనే చరిత్రకారుడు 1632లో దీని నిర్మాణం మొదలై 1643లో ముగిసిందనీ, అమనాత్‌ఖాన్, ఉస్తాద్ ఇసాఖాన్, పీరాఖాన్లు దీని ప్రణాళికను తయారుచేశారనీ అంటున్నాడు.

మొత్తంమీద ఇరవై వేలమంది శిల్పులు కలిసి 1631 నుంచి 1653 మధ్యకాలంలో దీన్ని నిర్మించారని మరికొంతమంది వాదన. లాల్ శ్రీవాత్సవ అనే చరిత్రకారుడు దీనికి 4 ½ కోట్లు ఖర్చయిందని అంచనావేశాడు. యదునాథ్ సర్కార్ అనే మరో చరిత్రకారుడు దీనికి కేవలం 50 లక్షలు మాత్రమే ఖర్చయిందని చెప్పాడు.

ఈ వివాదాస్పద వాతావరణం ఎలా వున్నా తాజ్‌మహల్ మాత్రం రోజురోజుకీ తన అందాన్నీ, కీర్తినీ పెంచుకుంటూ వస్తోంది. దీనిలోని గోల్‌గుంబజ్ ప్రధాన ఆకర్షణ. మరో కథ ఏమంటే, షాజహాన్ ప్రియాతిప్రియమైన భార్య ముంతాజ్‌మహల్ ఎక్కడో బర్హాంపూర్‌లో సమాధి చేయబడిందనీ, అది జరిగిన చాలా కాలానికి తాజ్‌మహల్ నిర్మాణం జరిగిందనీ.

ఇవన్నీ ఇప్పటికీ ప్రశ్నల్లాగే వుండిపోవడం శోచనీయమే.

---

## సంగీతమే అతని భార్య

"భారతీయ చిత్రపరిశ్రమ ఓ అత్యుత్తమ కళాకారుణ్ణి, అత్యవసర సమయంలో కోల్పోయింది'' అని ఘోషించాయి పత్రికలు, మ్యూజిక్ డైరెక్టర్ జయదేవ్ చనిపోయినపుడు. మొదట సంగీత ప్రియులు, అతని అభిమానులు ఈ వార్తను నమ్మలేకపోయారు. ఆ తరువాత నమ్మినా జీర్ణం చేసుకోలేకపోయారు.

పంజాబ్‌లోని నైరోబీలో 1918, ఆగస్ట్ 3న పుట్టాడు జయదేవ్. 35 సంవత్సరాలు సంగీత ప్రపంచంలో గడిపినా అతను కంపోజ్ చేసిన పాటలు కేవలం 26 చిత్రాలకు మాత్రమే. మిగతా కళాకారులు సంవత్సరానికి 12 సినిమాలకి పనిచేసినా, ప్రజల హృదయాలలో గుర్తింపు పొందిన కళాకారు





డిగా అగ్రస్థానం జయదేవుడికే దక్కుతుంది. హిందీ సినీ సంగీత ప్రపంచంలో అతని పేరు చిరస్థాయిగా నిలిచిపోయింది. అతనికి ఏ విషయాన్నైనా సమర్థవంతంగా, నలుగురూ మెచ్చుకునేలా చెయ్యాలనే పట్టుదల స్వతహాగా వుండేది. రాశిలో తక్కువయినా వాసికే ప్రాధాన్యత ఇచ్చేవాడు జయదేవ్. అతని సంగీత జ్ఞానానికి ప్రేరణ అతని తల్లి. ఆవిడ పేరు పొందిన సంగీత కళాకారిణి కాకపోయినా ఆమె పాడుతుంటే విని ముగ్ధుడయ్యేవాడు జయదేవ్. అతని సంగీతం సామాన్య ప్రజలను కూడా ఆకర్షించి,




ఆనందాన్ని పంచాలనుకునేవాడు. సినీ దర్శకులుగానీ, ప్రొడ్యూసర్లుగానీ తన పనికి అడ్డు వచ్చి, మార్పులు చేర్పులు చేయబోతే ఆ పనిని సగంలోనే వదిలేసి బయటకు వచ్చేసేవాడు జయదేవ్. దానిమీద వచ్చే ఆదాయాన్ని ఎప్పుడూ అతను పట్టించుకునేవాడు కాదు. 'ఉమ్రావ్ జాన్' సినిమాలో అదే జరిగి, దాన్ని మధ్యలోనే వదిలేశాడు జయదేవ్.

పదధ్వనులు రాగానికి అనుకూలంగా వుంటూ స్పష్టంగా వినిపించేలా, తక్కువ వాయిద్యాలని ఉపయోగించేవాడు జయదేవ్. అతన్ని సినీ ప్రపంచానికి మొట్టమొదటిసారిగా పరిచయంచేసింది ఉస్తాద్ అలీ అక్బర్‌ఖాన్. ఈయన సరోద్ కళాకారుడు. మొట్టమొదట 1951లో 'జోరూకాభాయ్' అనే సినిమాకు పాటలను కంపోజ్ చేశాడు జయదేవ్. తరువాత అంజలి, హమ్ దోనో, కినారేకినారే మొదలైనవి చాలానే వున్నాయి. ఈ సినిమాలన్నీ కూడా ప్రజలకు నచ్చి, మంచి సినిమాలుగా ముద్ర వేయించుకున్నాయి. 'హమ్‌దోనో' సినిమా విజయవంతం కావడానికి కేవలం జయదేవ్ సంగీతమే కారణమంటారు చాలామంది.

గంధర్వ మహావిద్యాలయంలోని ప్రొఫెసర్ బరకత్‌రాయ్ వద్ద సంగీతాన్ని అభ్యసించాడు జయదేవ్. జయదేవుడు ఎక్కువగా జానపద గాన రీతులను ఉపయోగించేవాడు. తన పాటలలో ఆ పద్ధతి అతనికి 3 సార్లు అవార్డులను తెచ్చిపెట్టింది. మధ్యప్రదేశ్ గవర్నమెంటు అతనికి లతామంగేష్కర్ ప్రైయిజునిచ్చి సత్కరించింది.

అతడు బ్రహ్మచారిగానే జీవితం గడిపాడు. పెళ్ళి సంబంధాలన్నీ తిరస్కరించాడు. సంగీతమే ఆయన భార్య అంటారు సన్నిహితులు. ఎప్పుడూ నిరాడంబరంగా వుండే జయదేవ్ జీవితమంతా పేయింగ్ గెస్ట్‌గా గడిపాడు. సంగీతంద్వారా తాను సంపాదించినదంతా సంగీత కార్యక్రమాలకే వినియోగించేవాడు. ఎంతోమంది సాటి కళాకారులకు సహాయపడేవాడు.

చెవులు చిల్లులుపడే వాయిద్య ధ్వనులతో అర్థంపర్థంలేని పదాల కూర్పుతో మతులుపోతున్న సంగీత ప్రియులకు జయదేవుడు లేకపోవడం భరించలేని లోటు అనుకోక తప్పదు.



# చతురకతలు

## పట్టుపరిశ్రమ

అనంతం తన బాల్య స్నేహితుడయిన శివా ఇంటికి వెళ్లాడు.

"ఒరేయ్ శివా! ఇంత ఎండ్రినను తాగి చద్దామనుకుంటున్నారా?" అన్నాడు.

"ఆత్మహత్య దేనికిరా పిచ్చాడా?" శివా ప్రశ్నించేడు.




"అయిదేళ్లక్రితం బి.ఏ ప్యాసయ్యేడు కుర్రాడు, మూడేళ్ల క్రితం టైపూ, రెండేళ్లక్రితం షార్టుహేండూ పాసయ్యేడు. ఎంత ప్రయత్నించినా ఉద్యోగం దొరికి చావలేదు. ఇంట్లో యుద్ధాలయి పోతున్నాయి. మనశ్శాంతిలేదు''

"ఒరేయ్ బ్రదరూ ఈ కంప్యూటరు యుగంలో మీ వాడి చదువుకు ఏ ఉద్యోగం దొరకదురా.. ఎమ్.బి.ఎ గాని ఐసీడబ్ల్యుగాని అవాలి''

"చస్తుంటే సంధిమంత్రంలా ఉంది నీ బోడి సలహా! చదవమంటే మా కుర్రవెధవ దూర్వాసుడయి గిన్నెలు, ముంతలు మీదకు విసిరేస్తాడు'' అని మూలిగేడు అనంతం.

"బుద్ధిమంతుడే!" అని ఓ క్షణం ఆలోచించి "నా బావమరది ఎవడో మినిష్టరుకి పియ్యే అయ్యేట్ట'' అన్నాడు శివా.

"పియ్యే అయ్యేడా? ఒరేయ్ బాబూ అతనితో చెప్పి మా వెధవని ఎందులోనయినా తోయించేద్దూ. చచ్చి నీ కడుపున పుడతా''

"చాల్లే నోరు మూసుకోవోయ్. నా బావమరది కాలాంతకుడు. గజకర్ణగోకర్ణ టక్కుటమారి విద్యల్లో ఆరితేరిన ముండాకొడుకు. కోళ్ల పరిశ్రమ పెట్టి లక్షలు గడిస్తున్నాడు. పాడి పరిశ్రమ పెట్టి యమగా దోచేస్తున్నాడు. ఈమధ్యనే నా మేనల్లుడు వాణ్ణి కలిసేట్ట.




వాడి ఉచ్ఛ పెట్రోలయి వెలిగిపోతోంది. ఏదో దేవి ఉపాసన చేసి కొన్ని సిద్ధులు కూడా సంపాదించి మినిష్టర్ల అభీష్టాలు నెరవేరుస్తున్నాట్ట''

"అయితే తాంత్రిక చంద్రస్వామి అంత వాడన్నమాట!"

"ఛీఛీ వాడు మా వాడి కాలిగోరుకు కూడా సరిపోడు. ఇదివరకు పరిశ్రమల్లో సంపాదిస్తున్నది చాలక కోటికి పడగెత్తాలని కొత్తగా పట్టుపరిశ్రమ కూడా స్థాపించేట్ట. అది చాలా లాభసాటిగా ఉందట"

"అవుతే ఇంకేం మా వాడికోసం నువ్వు శ్రమపడక తప్పదు. మనిద్దరం బాల్య స్నేహితులంకదా. ఒకే కంచాన తిని ఒకే మంచాన పడుకునేవాళ్లం. ఖర్మకాలి నేను ఎలిమెంటరీ స్కూలు మేష్టర్నయ్యేను, నువ్వు పౌరోహితుడివి అయ్యేవ్''

"ఒరేయ్ అనంతం! మీ వాడికి ఉద్యోగం వేయించే పూచీ నాదిరా'' అన్నాడు శివా.

"చాలా సంతోషంరా..." అని చంకలు గుద్దుకొని "మీ వాడికి నైవేద్యం ఎంత పెట్టాలంటావ్. ఇప్పుడు నైవేద్యం పెట్టందే ఏ దేవుడూ పలకడుకదా'' అన్నాడు అనంతం.

"వాడిరేట్లు నాకు తెలియవుకాని నువ్వు పైసా కూడా పెట్టక్కర్లేదు. రైలు ఖర్చులు మాత్రం నువ్వే భరించాలి. రేపు బయలుదేరుదామా తిధివార నక్షత్రాలు బాగున్నాయి''

"నేను రెడీయేరా? నీకు పెళ్లిళ్లు అవీ లేవుకదా!" అన్నాడు అనంతం.

"ఆషాఢమాసంలో పెళ్ళిళ్ళేవిట్రా పిచ్చోడా! రేపు బయలుదేరుదాం" అన్నాడు శివా.

అనంతం, అతని కొడుకు, శివా ముగ్గురూ ఉరుకులు పరుగులు పెట్టి హైదరాబాదు చేరుకున్నారు.

శివా తన బావమరిదితో తను వచ్చిన పని చెప్పాడు. "ఉద్యోగం దొరక్క ఇంటిల్లిపాదీ మలమలమాడిపోతున్నారు. నువ్వు ఉద్యోగం ఇచ్చి వాళ్ల ప్రాణాలు నిలబెట్టి పుణ్యం కట్టుకోవాలిరా బావాజీ!" అన్నాడు శివా.

బావాజీ నవ్వి "ఇప్పుడు ఉద్యోగాలెక్కడ దొరుకుతున్నాయి? గోల్డెన్‌షేకేండ్లు ఇచ్చేసి పని చేస్తున్న వాళ్లనే ఇళ్లకు పంపేస్తున్నారు. పౌరోహిత్యం తప్ప దేశం ఎలా మండిపోతోందో నీకు అఖ్ఖర్లే..." అన్నాడు.

"కోళ్ల పరిశ్రమ, పాడి పరిశ్రమ, పట్టుపరిశ్రమ తప్ప నీకూ ఏం అఖ్ఖర్లేదు. పట్టుపరిశ్రమ పెట్టినట్లు ఒక్క మాటయినా చెప్పలేదే నువ్వు. అది చాలా బ్రహ్మాండంగా ఉందటగా! అందులో నా స్నేహితుడి కొడుకును స్టెనోగా వేసుకోరా బాబూ చస్తున్నారు'' పియ్యేకి శివా మాటలు అర్థం కాలేదు ముందు. ఒక్క క్షణం ఆలోచించాడు.

"నేను పట్టుపరిశ్రమ స్థాపించేనని ఎవడు చెప్పాడు?" అన్నాడు పళ్లు కొరుకుతూ.

"నా మేనల్లుడు జైసీతారాంగాడు. పరిశ్రమ అఖండ గోదావరిలా పరుగెడుతోందిట!"

''ఆ దొంగ రాస్కెల్ చెప్పాడూ! పట్టుపరిశ్రమ అంటే పట్టు పురుగుల పరిశ్రమ కాదు బావా! పలుకుబడి ఉన్నవాళ్ళకాళ్లు పట్టుకొని కాకా పట్టడం. కాకా పట్టే ఖర్మ నాకేం పట్టింది. నేను ఏ ఉద్యోగం వేయించలేను క్షమించు'' అన్నాడు పియ్యే. ముగ్గురూ రాతి బొమ్మలే అయ్యారు.

-ఖండవిల్లి సాంబశివరావు

---

## మొక్కుబడి

రాజారావు హృదయం పరవశించి, అమితానందంతో పరవళ్లు తొక్కుతోంది. తన్మయత్వంతో చేతులు జోడించి దేముని విగ్రహం ముందు వినమ్రుడై నిలుచున్నాడు.

"స్వామీ ఇన్నాళ్లకి నా మొక్కుబడి చెల్లించుకోగలుగుతున్నాను. నా ఆలస్యానికి మన్నించు. ఈ అధముడి మీద కోపగించుకోకు స్వామీ" అంటూ హుండీలో ఐదు వంద రూపాయల కాగితాలువేసి వెనుతిరి

గాడు.

ఇప్పుడు అతని మనస్సు తేలికగా ఉంది తలపైనుంచి ఏదో భారాన్ని దించుకొన్నట్టు అనిపిస్తోంది. తన ఇష్టదైవానికి ఆపదసమయంలో మొక్కిన మొక్కు ఇన్నేళ్లుగా చెల్లించలేకపోయినందుకు ఏదో తప్పుచేసిన వానిలా బాధపడేవాడు. "ఇప్పటికి ఆ స్వామి దయతో చూశాడు. మొక్కు తీర్చుకునే వీలు కల్పించాడు" అనుకుంటూ రాజారావు తిరుగు ప్రయాణం కట్టేడు.

రాజారావు మూడు పదుల జీవితంలో దేవునికి మొక్కుకోవటం ఇదే మొదటిసారి. అసలు అతనికి ఇలాంటివి అంటే నమ్మకం లేదు. కాని... నాలుగేళ్ల క్రితం అతని చెల్లెలి పెళ్లికని ఒక స్నేహితుని దగ్గర ఐదు వేలు అప్పుచేశాడు. తను అడగగానే మిత్రుడు లేదనకుండా అప్పు ఇచ్చినందుకు అతని మనసు ఆ స్నేహితునిపట్ల కృతజ్ఞతా భావంతో నిండిపోయింది. ఆ పైకం చూస్తుంటే కొండంత బలంవచ్చింది. మిత్రుని పుణ్యమా అని దొరికిన ఈ డబ్బు తండ్రి చేతుల్లో పెడితే నాన్న ఎంత సంతోషిస్తాడో! ఇంటికి రాగానే తన మిత్రుని గురించి భార్యకు సగర్వంగా చెప్తూ జేబులో చెయ్యి పెట్టాడు. మరుక్షణం అతని గుండె ఆగినంత పనయింది.

"పర్స్ పర్స్ ఎక్కడో జార్చేసాను" వెర్రికేక పెట్టేడు.

అతని అర్ధాంగి కూడా కంగారుపడింది.

"ఆఫీసులోనే మర్చిపోయారేమో వెళ్లి చూడండి" సలహా ఇచ్చింది.

రాజారావుకి కరచరణాలు ఆడటం లేదు. అతనికి ఆ డబ్బు దొరుకుతుందనే నమ్మకం ఏమాత్రం లేదు. దాదాపుగా బావురుమన్నాడు.



"మరీ అంత అధైర్యపడితే ఎలా? మన స్ఫూర్తిగా దేవునికి మొక్కుకోండి. మన డబ్బు మనకి తప్పక దొరుకుతుంది" రాణి భర్తకు ధైర్యం చెప్పింది.

ఆ మాటలమీద విశ్వాసం కలగలేదు రాజారావుకి. పోగొట్టుకున్న సొమ్ము తిరిగి పొందటమా? ఈపాటికి ఎవరి చేతుల్లోనో పడే ఉంటుంది. అయినా రాణి చెప్పినట్టు

మొక్కుకుంటే తన డబ్బు తనకు దొరికితే మంచిదేగదా అనుకుని ఆ గదిలో అమర్చి ఉన్న దేవుని పఠానికి నమస్కరించాడు. "పోగొట్టుకున్న నా సొమ్ము దొరికితే నీ హుండీలో ఐదు వందలు వేస్తా"నని మొక్కుకున్నాడు భార్య బట్టీ పెట్టించిన ప్రకారం.

అతను పూజా మందిరంలో నుంచి బైటకి వచ్చేసరికి సుధాకర్ ప్రత్యక్షం అయ్యాడు. సుధాకర్‌దీ రాజారావుదీ ఒకే ఆఫీసులో ఇద్దరివీ ఎదురెదురు సీట్లు.

"అరె రాజా! పర్సు మర్చిపోయావు. ఐదు వేలుంది. ఎవరైనా చూస్తే ఏమై ఉండేది? నీ అదృష్టవశాత్తు నా కళ్లబడింది" అని ఆ పర్సును రాజారావు చేతికి అందించాడు.

రాజారావు మనస్సు భక్తితో నిండిపోయింది. సుధాకర్‌కి థాంక్స్ చెప్పాలని కూడా తోచలేదు. అతనికి సుధాకర్ మంచితనం మీదకంటే భగవంతునిపట్ల విశ్వాసమే అధికమైపోయింది. తను భక్తితో మొక్కుకోగానే తన డబ్బు తన కళ్లపడింది. అంటే భగవంతుడే తనకి సహాయపడ్డాడు. అలా ఆలోచిస్తూ... సుధాకర్ ఉన్న సంగతే మరచిపోయాడు.

రాణిమాత్రం సుధాకర్‌లోని మానవత్వాన్ని మెచ్చుకుంది. అతని నిజాయితీని, స్నేహ హృదయాన్ని ప్రశంసించి కమ్మని కాఫీ ఫలహారాల్తో కృతజ్ఞతలు తెల్పుకుంది.

అతను వెళ్లిపోయాక, "సుధాకర్‌గారు చాలా మంచివారండీ, ఈ రోజుల్లో చేతికందిన డబ్బు ఎవరు తెచ్చి ఇస్తారు? అతని నిజాయితీ గొప్పది" అంది భర్తతో.

రాజారావు ఆమె మాటలు పట్టించుకోలేదు. "భగవంతునికి మొక్కాంగదా! అందుకే మన డబ్బు మనకొచ్చింది" అన్నాడు నిర్లిప్తంగా.

భర్త తీరు ఆశ్చర్యాన్ని కలిగించింది. దేవుణ్ణి విశ్వసించని భర్తకు ఈ ఒక్క సంఘటనతోనే భగవంతునిపట్ల ఎంత గురి కుదిరిందీ అనుకుంది.

రాజారావు తన ఆరాధ్యదైవాన్ని ఎప్పుడు చూడగల్గుతానా? ఎప్పుడెప్పుడు మొక్కుబడి తీర్చుకుంటానా! అని ఆరాటపడేవాడు కానీ ఆ స్వామిని చేరుకోవటానికీ తన మొక్కు చెల్లించుకోవటానికీ సరిపడా డబ్బు సమకూర్చుకొనేసరికి బాగా లేటయింది.

రాజారావు తన ఊరికి తిరిగి వచ్చినా కొండపై నిండుగా కొలువున్న ఆ స్వామి దివ్యసుందర రూపమే అతని కళ్లల్లో కదలాడుతూ ఉంది. ఆ స్వామి సన్నిధిలో పొందిన పారవశ్యంలోంచి ఇంకా తేరుకోలేకపోతున్నాడు. అంతగా అతని మనస్సు దైవంలో నిమగ్నమవటానికి కారణం తాను మొక్కుకోగానే పోగొట్టుకున్న పైకం దొరకటమే.

కానీ ఆ మరునాడు తెల్లవారుతూనే పేపర్లో చూసిన వార్త నమ్మలేకపోయాడు. ఆ వార్త మళ్లీమళ్లీ చదువుకున్నాడు. తను ముడుపు చెల్లించి వచ్చిన రాత్రే ఆ కోవెలలో స్వామి నగలు, భక్తులు హుండీలో వేసిన డబ్బు, వెండి, బంగారాలు అన్నీ దోచుకుపోయారుట ఆరితేరిన బందిపోట్లు... అనీ ఆ వార్త సారాంశం.

రాజారావు నిలువునా కంపించిపోయాడు. అతని మనస్సంతా అల్లకల్లోలమైపోయింది. "స్వామీ! పోగొట్టుకున్న నా డబ్బు నాకిప్పించి నా చేత మొక్కుబడి చెల్లించుకున్నారే! నిన్ను నిలువుదోపిడి చేస్తుంటే, వేలాది భక్తులు నీకు అర్పించుకున్న కానుకలు అపహరిస్తూంటే అలా చూస్తూ కూర్చున్నావా? మరిప్పుడు నీ మొక్కుబడి ఎవరికి?" కన్నార్పకుండా ఆ స్వామి వారి పఠం వంకే చూస్తూ అనుకున్నాడు రాజారావు.

–సత్యవాడ సోదరీమణులు



చతుర
సంపుటి: 20 సంచిక: 10 నవంబర్: 1997

విద్యాసంస్థలన్నీ వ్యాపార కేంద్రాలుగా మారిన ఈ ఆధునిక యుగంలో... మంచి చదువుకావాలంటే ఆ మాత్రం పెట్టుబడి పెట్టక తప్పదనుకుని... తమ సుఖాలను, సరదాలను చంపు కుని... ఒక్కగానొక్క కొడుకును అందని అందలాలెక్కించారా మధ్యతరగతి తల్లిదండ్రులు.

మరో బిడ్డనుకంటే ఈ కొడుకు పెంపకం తమ శక్తికి మించిన దవుతుందన్న హద్దులూ విధించుకున్నారు. అనుక్షణం హోంవర్కులూ, యూనిట్‌టెస్ట్‌లూ, ప్రోగ్రెస్ కార్డులు, ర్యాంకుల ప్రపంచం నుంచి తను బయటకి రావడానికిష్టపడని తల్లికి రోజుకో అబద్ధం చెబుతూ... "ఈ మమ్మీలందరూ ఛస్తే బావుండును" అనుకునే ఆ కుర్రాడు అనుకోకుండా చిక్కుకున్న భయంకర పరిస్థితులేమిటి?

బిజినెస్ మాగ్నెట్ పిల్లలనుంచి మినిష్టర్ల పిల్లలవరకూ చదివే కాన్వెంట్‌లోనే చదువుకున్న ఆ కుర్రాడు ఎందుకలా మారాడు? ఆ పైన తల్లితండ్రులు తెలుసుకున్న కఠోరసత్యాలు, వాటికి వారి ప్రతిస్పందన ఏమిటి? నైతిక విలువలు మృగ్యమౌతున్న ఈ ఆధునిక యుగంలో పెద్దల విపరీత పోకడలు... పిల్లల భవితవ్యంపై చెరగని ముద్రవేస్తున్న తీరును విశ్లేషిస్తూ కృష్ణజ రాసిన 'కాన్వెంట్' ఈ నెల 'చతుర' సమగ్ర నవల.



ఉదయం పదకొండు గంటల ప్రాంతంలో ఇంటర్వెల్ మ్రోగుతూనే క్లాస్ రూమ్‌లోని పిల్లలంతా బిలబిలలాడుతూ బయటికి వచ్చారు.

వాళ్ళ స్కూల్ జీవితానికి ఆ ఇంటర్వెల్ అనేది ఓ చిన్న బ్రేక్. ఆ అవకాశాన్ని వాళ్ళు పూర్తిగా సద్వినియోగం చేసుకుంటారు. దొరికిన ఆ కొద్ది సమయంలోనే ఆడతారు, పాడతారు, గంతులు వేస్తారు, యుద్ధాలు చేస్తారు, వాదులాడుతారు... పందేలు కాస్తారు.

అదంతా ఓ ప్రపంచం... బాలల ప్రపంచం...

"రాత్రి సినిమాలో చిరంజీవి యమ ఫైట్ చేశాడురా"

సుభాష్ తన మిత్రులతో బాతాఖానీ వేస్తున్నాడు.

"రియల్లీ...?"

"గాడ్ ప్రామిస్" ఒట్టు పెట్టుకొంటున్నట్లు అరచేయి తలమీద వుంచుకున్నాడు.

"అబ్బ... నాకు చిరంజీవి అంటే భలే ఇష్టంరా..." నవీన్ అన్నాడు.

"నాకు నాగార్జున అంటేనే ఇష్టం..." వేణు అన్నాడు.

"చిరంజీవి కంటే నాగార్జున గొప్పవాడేం కాదు..."

"నాగార్జున లేటెస్ట్ చూస్తే తెలుస్తుంది"

"ఏం కాదు..."

"ఏం కాదు..."

"ఏరా సుభాష్ చిరంజీవి గొప్పవాడు కదూ?" నవీన్ సుభాష్ మాట సాయం కోరాడు.

"నాగార్జునది ఎంతో బాగుంది కదరా?" వేణు రాజుసాయం అర్థించాడు. సుభాష్ రాజులు తలలు ఊపారే తప్ప ఏ సాయం చెయ్యలేదు.

"చిరంజీవి గ్రేట్"

"నాగార్జునే గ్రేట్"

"బెట్"

"బెట్"

పోటీలు పడ్డ రెండు కోడిపుంజుల్లా రోష పడుతూ వేణు, కుడిచేతి పిడికిలి బిగించి బొటనవ్రేలు ఎత్తిచూపుతూ నవీన్... ఒకరి నొకరు చూపులతోనే ఢీ కొట్టుకుంటున్నారు.

"ఎంతెంత...?" వేణు అడిగాడు.

"ఎంతెంత...?"

ఇద్దరికిద్దరూ అంతలోనే రెచ్చిపోయారు.

"నేను ముందు అడిగాను... నువ్వే చెప్పాలి..."

నవీన్‌కు ఈ లాజిక్ కరక్టే అనిపించినా, "ఏంకాదు... ముందు బెట్ కట్టింది నువ్వే... నువ్వే చెప్పాలి" అన్నాడు మొండిగా.

"నేను ఓడిపోతే మన ఫ్రెండ్స్ అందరికీ ఐస్‌క్రీం ఇప్పిస్తాను"

"నేనూ అంతే..."

ఇద్దరి బెట్స్‌నూ వినోదంగా చూస్తూ నించున్నారు మిగిలిన పిల్లలు. అప్పుడే వాళ్ళకు ఐస్ క్రీం నోరూరిస్తోంది.

"ఇంతకూ బెట్ ఎందుకు కడుతు న్నార్రా...?" సుభాష్ అడిగాడు.

ఇద్దరూ తెల్లమొహం వేశారు.

నిజానికి బెట్ ఎందుకు కడుతున్నారో ఇద్దరికీ తెలీదు.

"ఫూల్స్ బెట్ ఎందుకు కడుతున్నారో తెలీదుగానీ, బెట్ అట... బెట్ పదండ్రా... నేనిప్పిస్తాను. ఐస్‌క్రీం" అంటూ ముందుకు నడిచాడు.

అందరూ సుభాష్ వెనుకే ఐస్ క్రీం బండి దగ్గరకు నడిచారు.





వాళ్ళందరికీ రింగ్ లీడర్ "సుభాష్"

సుభాష్ వాళ్ళందరికంటే శారీరకంగా బలంగా వుండటంతో ఆ పదవి అతనికి అతి సహజంగా లభించింది. ఐస్‌క్రీం బండి వాడు సుభాష్‌ను చూసి చిరునవ్వు నవ్వాడు. సుభాష్ బండి దగ్గరకు వచ్చాడు అంటే వాడికి కావలసినంత బిజినెస్. వాడు సుభాష్ ఆంతర్యం గ్రహించినట్లే, అతని చుట్టూ వున్న అందరికీ తలో ఐస్‌క్రీం అందించాడు.

అందరూ ఐస్‌క్రీం ఆప్యాయంగా అందుకున్నారు.

అనిల్ సంకోచిస్తూనే ఐస్‌క్రీం తీసుకున్నాడు.

మొత్తం బిల్ పదిహేను రూపాయలు అయ్యింది.

నిక్కర్ జేబులోనుండి ఇరవై రూపాయల నోటు తీసి దర్జాగా అందిస్తోన్న సుభాష్ వంక ఆరాధనగా చూస్తుండిపోయాడు అనిల్.

ఐస్‌క్రీం తినడం పూర్తికాకుండానే 'ఇన్ బెల్' అయ్యింది. పిల్లలు హడావిడిగా ఐస్‌క్రీం నోట్లో కుక్కుకుని క్లాస్‌రూం వైపు పరుగుతీశారు.

మరో నిమిషం లేట్ చేస్తే హెడ్‌మిస్ట్రెస్ మేడం బెత్తం పుచ్చుకుని గ్రౌండ్ అంతా తిరుగుతుందనే భయంతో.

★ ★ ★

థర్డ్ పిరియడ్... సెవెంత్ క్లాస్ రూంలో...

భారతీ మేడం పిల్లల హోం వర్క్ చూస్తోంది.

సుభాష్ ప్రక్కనే కూర్చున్న అనిల్ "ఎక్కువ రన్స్ తీయగలడా? " "ఎక్కువ రన్స్ తీయగలడా? " అనే విషయాన్ని అడిగి తెలుసుకోవాలనే ఉత్కంఠను మనస్సులోనే అణుచుకుంటూ హోంవర్క్ సరిచూసుకుంటున్నాడు.

క్లాసంతా చాలా నిశ్శబ్దంగా వుంది.

భారతీదేవి మేడం అంటే పిల్లలకు భయంతోపాటు కాస్తో కూస్తో భక్తికూడా వుంది.

అయితే వాళ్ళలా నిశ్శబ్దంగా తమ పని తాము చేసుకునేందుకు కారణం భక్తికన్నా కూడా భయమే కారణం అనేది నిర్వివాదాంశం. ఆమెకు చాలా త్వరగా కోపం వచ్చేస్తుంది. కోపం వచ్చిందంటే ఇక ఇంతే సంగతులు. తమ వీపులు వాతలు తేలాల్సిందే.

"ఈ మేడం అంటే నాకు చచ్చేంతకోపం" కళ్ళల్లో నొసటి ముడుతల్లో కోపాన్నంతా వ్యక్తపరుస్తూ గుసగుసగా అన్నాడు సుభాష్ అనిల్ తో.

"ఎందుకు? " గుసగుసగానే అడిగాడు అనిల్ కూడా.

"హోంవర్క్ చెయ్యకపోతే వాతలు పడేలా కొడుతుంది"

"నిజమే..."

"పెద్ద... ఆమే గొప్ప అయినట్లు. ఈమె హెచ్.యమ్. మేడంకన్నా గొప్పా...? "

"భారతీదేవి మేడం లెక్కలు బాగా చెప్తారు..."

"భారతీదేవి మేడం అంటే నీకు ఇష్టమా...? " కొంచెం అయిష్టంగా అడిగాడు సుభాష్.

ఇష్టమే... అన్నట్లుగా తల ఊపాడు అనిల్.

"ఛీ... నాకేం ఇష్టంలేదు. నాకు వసంతా మేడం అంటే ఇష్టం"

"ఆ మేడం అసలు పాఠాలు చెప్పరుగా?"

నిశ్శబ్దంగా వున్న క్లాసురూంలో ఏదో గుస

గుస వినిపించినట్లయి చూస్తోన్న నోట్స్‌లోనుండి తల ఎత్తిచూసింది భారతీ దేవి మేడం.

అనిల్ చప్పున నోరు మూసుకుని తల వంచుకున్నాడు.

మేడం తిరిగి తన పనిలో మునిగిపోయింది.

"అసలు మనం లెక్కలు చెయ్యకపోతే ఈవిడకేం?" మళ్ళీ గుసగుసగా అన్నాడు సుభాష్.

అనిల్ ఇక మాట్లాడే ధైర్యం చెయ్యలేదు.

"అది కాదురా అనిల్..." సుభాష్ మళ్ళీ ఏదో చెప్పబోయే ప్రయత్నం చేస్తూండటంతో, అనిల్ గుసగుసగా అన్నాడు, "ష్... సుభాష్ మాట్లాడకు మేడం చూస్తున్నారు"

భారతీదేవి మళ్ళీ తల ఎత్తింది.

సూటిగా సుభాష్, అనిల్‌లవైపు చూస్తూ, "స్టాండప్ బోత్ ఆఫ్ యూ" అంది కోపంగా.

ఇద్దరూ లేచి నిలబడ్డారు.

అనిల్ ముఖంలో భయం...

సుభాష్ ముఖంలో భయాన్ని కప్పివేస్తూ అదోవిధమైన నిర్లక్ష్యం.

"ఇద్దరూ హోంవర్క్ నోట్సులు పట్టుకుని ఇలా రండి" భారతీదేవి మేడం ఆజ్ఞాపించారు.

ఇద్దరూ నోట్సులు పట్టుకుని భయంభయంగా టేబుల్ దగ్గరికి వెళ్ళారు.

భారతీదేవి అనిల్ నోట్సు చూశారు. లెక్కలన్నీ కరెక్టే.

"ఎవరు చెప్పారు?" మామూలుగా అడిగారు.

"నేను స్వంతంగా చేశాను మేడం"

"గుడ్" అంటూ భారతీదేవి మేడం సుభాష్ నోట్సు చూశారు. లెక్కలన్నీ కరెక్ట్‌గానే వున్నాయి.

ఆమె కనుబొమలు ముడిపడ్డాయి.

"ఎవరు చేశారు?"

"నేనే"

"నిజం చెప్పు. ఎవరు చెప్పారు?" కోపంగా అడిగారు భారతీదేవి మేడం.

సుభాష్‌కు నిజంగానే భయంవేసింది.

"మా ప్రైవేట్ మాస్టారు చెప్పారు మేడం" అన్నాడు భయం భయంగా.

"మరి ఆయన చేస్తే నీకెలా వస్తాయి? నువ్వు స్వంతంగా చెయ్యాలి"

అలాగే... అన్నట్లుగా బుద్ధిగా తల ఊపాడు సుభాష్.

ఎంత నిర్లక్ష్యంగా వుండటానికి ప్రయత్నించినా సుభాష్‌కు భారతీదేవి మేడం అంటే భయమే.

"ఊ... వెళ్ళి కూర్చోండి" అన్నారు భారతీదేవి. మళ్ళీ అంతలోనే ఏదో గుర్తుకు వచ్చినట్లుగా, "అనిల్ నీ సీటు ఫస్ట్‌బెంచ్ కదా! అక్కడ కూర్చున్నావేం?" అన్నారు.

"మరేమో మేడం మా క్లాస్‌టీచర్ మోహన్ను ఫస్ట్‌బెంచ్‌లో కూర్చోబెట్టి నన్ను ఇక్కడ కూర్చోమన్నారు"

"ఎందుకని...?" క్లాసంతా కలయ చూస్తూ అడిగారు.

ఔను తను సెలవు పెట్టిన ఈ రెండు రోజుల్లో క్లాసులో చిన్నచిన్న మార్పులు జరిగాయి.

ఫోర్త్ బెంచ్‌లో కూర్చునే మోహన్ ఫస్ట్ బెంచ్‌లోకీ, ఫస్ట్‌బెంచ్ అనిల్ ఫోర్త్‌బెంచ్‌లోకీ, సెకండ్ బెంచ్‌లో కూర్చునే కృష్ణ ఫిఫ్త్ బెంచ్‌లోకీ... ఇలాగే ఏవో చిన్న మార్పులు.

"మోహన్ నాకంటే కొంచెం పొట్టిగా వున్నాడు మేడం"

భారతీదేవి మేడం మోహన్ను, అనిల్‌ను





మార్చిమార్చి చూసింది. ఎంతో గమనిస్తే తప్ప ఆ తేడా తెలీదు. ఏం చెప్పాలో తోచనట్లుగా ఒక్కక్షణం మౌనంగా వుండిపోయారు భారతీదేవి.

"అయితే నా పిరియడ్‌లో మాత్రం నువ్వు ఫస్ట్‌బెంచ్‌లోనే కూర్చో"

అనిల్ బుక్స్ తీసుకుని ముందుకు వచ్చి కూర్చున్నాడు.

అనిల్ తెలివైన కుర్రాడనీ, వెనక బెంచ్‌లో వుంటే చదువులో వెనకబడే అవకాశాలున్నాయనీ భారతీదేవి విశ్వాసం.

కానీ, క్లాస్‌టీచర్ ఎలా కూర్చోబెడితే అలా కూర్చోనివ్వాలే తప్ప మార్చే అధికారం సబ్జెక్ట్ టీచర్స్‌కు వుండదు.

అనిల్‌ను దూరంగా కూర్చోబెట్టడం తనకు జరిగిన అవమానంగా అర్థంచేసుకున్న సుభాష్ భారతీదేవి మేడంను కసితీరా లోలోపలే తిట్టుకుంటూ పళ్ళు నూరుకున్నాడు.

సుభాష్ అప్పుడే ఒక నిర్ణయం చేసుకున్నాడు మనస్సులో ఎలాగైనా సరే అనిల్‌తో ఫ్రెండ్‌షిప్ చేసుకుని భారతీదేవి మేడంమీద 'రివెంజ్' తీసుకోవాలి.



ఫోర్త్ పిరియడ్.

బెల్ కావడంతోనే ఆ పూటకిక భారతీదేవి మేడం చెర వదిలినందుకు సుభాష్, అతని స్నేహితులు సంతోషించారు.

మేడం బయటికి వెళ్ళగానే మోహన్, అనిల్ సీట్లు మార్చుకున్నారు. ఈ విషయంలో ఎక్కువ చొరవ చూపించింది మోహనే.

ఫ్రంట్ సీట్లో కూర్చుని పాఠాలు వినడంలో ఒకవిధమైన థ్రిల్ అనుభవించాడు మోహన్.

ప్రతి మేడం తనవంకే చూస్తూ పాఠం చెప్తారు. అది చాలా బాగుంది మోహన్‌కు.

తెలివైన పిల్లలు సహజంగా ఫ్రంట్ సీట్లో కూర్చోడానికే ఇష్టపడుతుంటారు. అంటే తను కూడా తెలివైన స్టూడెంట్ కిందే లెక్కించబడతాడు. ఏవరేజ్ స్టూడెంట్ మోహన్‌కు తాను ఇంటలిజెంట్ స్టూడెంట్‌గా చెలామణి కావడం బాగుంది.

అనిల్‌కు కూడా సుభాష్‌తో స్నేహం ఆకర్షణీయంగా కనిపించడంతో మారు మాట్లాడకుండా వెళ్ళి సుభాష్ పక్కన కూర్చున్నాడు.

సుభాష్ కూడా అనిల్ స్నేహానికి తను ప్రాధాన్యత ఇస్తున్నట్లు స్నేహపూర్వకంగా నవ్వాడు.

అక్కడ జరిగింది ఏమంటే-

మోహన్ ఏవరేజ్ స్టూడెంట్. వెనక బెంచీలలో కూర్చుని మరీ నాసిగా తయారయ్యే బిలో ఏవరేజ్‌గా అయిపోతున్నాడు.

అందుకే అతన్ని ముందు సీట్లోకీ, సహజంగానే తెలివితేటలూ క్రమశిక్షణా వున్న అనిల్ ఎక్కడ వున్నా రాణిస్తాడనే ఉద్దేశ్యంతో అనిల్‌ను వెనుక బెంచీలోకి మార్పిడి చేశారు క్లాస్ టీచర్.

ఫోర్త్ పిరియడ్ రజనీ మేడం.

రజనికి టీచింగ్ అంటే తగని తలనొప్పి. నిజానికి ఆమె మహాసోమరి. ఐదు నిము

షాల్లో పాఠం అయిందనిపించి మిగిలిన సమయంలో "చదువుకోండి" అంటూ తన ఆలోచనల్లో తానుండి పోతుంది. ఆమె మంచి గట్టి రికమండేషన్‌తో ఉద్యోగంలో చేరడం చేత హెచ్.యమ్.గారు ఆవిడను ఏమీ అనే సాహసం చెయ్యరు.

రజనీ మేడం పిరియడ్ పిల్లలకు ఆటవిడుపు. చిన్నచిన్న గ్రూప్స్‌గా విడిపోయి ఎవరికి తోచిన కబుర్లు వాళ్ళు చెప్పుకుంటుంటారు.

ఒక గ్రూప్ సినిమాల గురించీ, మరో గ్రూప్ సమ్మర్‌లో తన అక్కయ్య పెళ్ళిని వి.సి.ఆర్‌లో ఎలా రికార్డ్ చేసిందీ, ఒక గ్రూప్ క్విజ్‌లో రాబోయే ప్రశ్నల గురించీ.

సుభాష్, వేణు, నవీన్, రాజు, ప్రకాష్ ఒక గ్రూప్. అయితే ఇటీవల జరిగిన సీట్ల మార్పిడి కారణంగా అనిల్ కూడా ఆ గ్రూప్‌లో చేరాడు.

సుభాష్ గ్రూప్ ఎక్కువగా క్రికెట్, పిక్చర్స్, టి.వి.ప్రోగ్రాంస్ గురించి కబుర్లు చెప్పుకుంటుంటారు.

అయితే అనిల్ వాళ్ళు మాట్లాడే విషయాలను ఆసక్తిగా వింటాడే తప్ప నోరు మెదిపే సాహసం చెయ్యడు.

కారణం... అవి వాడికి తెలీని విషయాలు.

సుభాష్ గ్రూపు వాళ్ళు మేడంస్‌కు కొన్ని నిక్ నేమ్స్ పెట్టుకుని కోడ్‌లో మాట్లాడుకుంటుంటారు తరుచూ.

అనిల్‌కు అవీ తెలీదు.

ప్రస్తుతం సుభాష్ గ్రూప్ రాత్రి చూసిన టి.వి. నాటకాన్ని గూర్చి చర్చించుకుంటున్నారు.

"అసలు హైదరాబాదు తెలుగు టి.వి. నాటకాల వాళ్ళ మొహాలు అలా వుంటాయేంరా...?" ప్రకాష్ అనుమానం.

"ఎలా వుంటాయి..." అనిల్ అడిగాడు.

"చెక్కమొహాల్లా..." అందరూ నవ్వారు.

"వాళ్ళ మొహాలు ఎలా వుంటాయో నేను చెప్పనా?" సుభాష్ అన్నాడు.

"చెప్పు"

"అల్లంమురబ్బాలా..."

"అంటే?" ప్రకాష్ అడిగాడు.

"రోజూ వీధిలో సాయిబు అమ్ముతాడు... అది"

"తినేదేనా?"

"ఆఁ... ఓసారి కొన్నానులే... డోకొచ్చింది"

"అన్నట్టు అల్లంమురబ్బాను ఇంగ్లీషులో ఏమంటారురా?"

అందరూ అల్లంమురబ్బాను ఇంగ్లీషులో ఏమంటారో... అనే ఆలోచనలో పడిపోయారు కొన్ని సెకండ్లు.

ఎవరికీ తోచలేదు.

అయితే ఈలోపు సినిమాల గురించి మాట్లాడుకుంటోన్న గ్రూపులో ఓ చిన్న వివాదం తలఎత్తింది.

రంభ నెంబర్‌వన్నా...? సౌందర్య నెంబర్‌వన్నా? అది తేల్చుకునేందుకు ఆ చిన్నగ్రూపు రెండు గ్రూపులుగా చీలి వాదించుకోవడం ప్రారంభించారు.

గుసగుసలు కాస్తా రణగొణ ధ్వనిగా మారడంతో "ష్... డోంట్ మేక్ నాయిస్" అంటూ రజనీమేడం హెచ్చరించి తిరిగి రెడ్ కలర్ నెయిల్‌పాలిష్ తళుకులు చూసుకోవడంలో మునిగిపోయింది.

ఒక్కక్షణం... ఒకే ఒక్క క్షణం. 'నిశ్శబ్దం' తిరిగి క్లాసు యధావిధిగా రణగొణ ధ్వనితో నిండిపోయింది.

"బాపు భలే జోక్స్, కార్టూన్స్ వేస్తాడు కదురా..." వేణు అన్నాడు.

"ఔను" అందరూ ఒప్పుకున్నారు.

"రేపు భారత్- పాకిస్థాన్‌ల మధ్య క్రికెట్ మ్యాచ్ వుంది తెలుసా?"

"తెలుసులేవోయ్... పెద్ద అన్నీనీకే తెలిసినట్లు..." వేణు ఎత్తిపొడిచాడు.

"అందరికీ తెలుసా?" నవీన్ రోషం తెచ్చుకుని కోపంగా అడిగాడు.

"ఆc... అందరికీ తెలుసు..." వేణు జవాబు.

"ఏం తెలీదు"

"తెలుసు"

"బెట్... అందరికీ తెలీదు"

"బెట్... అందరికీ తెలుసు"

"బెట్"

"బెట్"

"అనిల్‌గాడికి తెలీదు తెలుసా?" నవీన్ చెప్పాడు.

అందరూ ఒక్కసారి ఆశ్చర్యపోయినట్లుగా అనిల్‌వంక చూశారు.

"ఏం... అనిల్ నీకు తెలీదూ...?" కోరస్‌గా అడిగారు నవీన్ తప్ప.

తెలీదు అన్నట్లుగా తల ఊపాడు అనిల్, అందుకు సిగ్గుపడుతున్నట్లుగా తల వంచుకుని.

"ఎందుకని?"

"మా ఇంట్లో టి.వి. లేదు"

"వాట్... మీ ఇంట్లో టి.వి.యే లేదా?" టి.వి. లేకుండా వీళ్ళెలా బతుకుతున్నారు? అన్నంత ఆశ్చర్యంగా అడిగాడు రాజు. వాళ్ళ ఆశ్చర్యం చూస్తోంటే అనిల్‌కు చచ్చేంత సిగ్గు కలిగింది. అభిమానంతో వాడి తల ఒంగిపోయింది. ఆ క్షణంలో డాడీ టీ.వీ. కొందాం అన్నా పడనీయని మమ్మీమీద గొంతువరకూ కోపం వచ్చింది.

"టూ-ఇన్-వన్ కూడా లేదా?" రాజు అడిగాడు.

"లేదు... రేడియో వుంది"

"పోనీ ఫ్రిజ్?"

"ఊహు"

"వి.సి.ఆర్ కూడా లేదా?" వేణు అడిగాడు.

"ఒరేయ్ ఫూల్! టి.వి.యే లేంది వి.సి.ఆర్. ఎలా వుంటుందిరా?" కసిరాడు సుభాష్.

"ఆc... అవును కదూ"

"చూశావా! నువ్వు ఓడిపోయావు. బెట్టు కట్టు" నవీన్ ఉత్సాహంగా వేణువంక చూస్తూ అన్నాడు.

"ఇంత చిన్న విషయంకూడా తెలీనివాళ్ళుంటారని నాకేం తెలుసూ?" వేణు కోపంగా అన్నాడు.

"నీకు తెలీకపోతే నాకేం... ఓడిపోయావు. బెట్ కట్టాల్సిందే"

"అసలు మనం బెట్ ఏమిటో అనుకోలేదుగా?" తేల్చేశాడు వేణు.

చేతికొచ్చిన పెన్నిధి జారిపోయినట్లుగా డిసప్పాయింట్ అయ్యాడు నవీన్.

ఈ సంభాషణ అంతా అనిల్‌కు కళ్ళనీళ్ళ పర్యంతం అయ్యింది.

బలవంతంగా ఆపుకున్నాడు.

"మా డాడీ నాకోసం కొత్త క్రికెట్ బ్యాట్, షూ, క్యాపు తెచ్చారు తెలుసా?"

"రియల్లీ?"

"గాడ్‌ప్రామిస్"

"అయితే సాయంత్రం మాకు పార్టీ చెయ్యాల్సిందే"

"ఓ.కే"

"రాజు ఈవినింగ్ వినోదా సెంటర్‌లో 'మిరపకాయ బజ్జీల' పార్టీ ఇస్తాడొహో"



ప్రకాష్ ఎనౌన్స్ చేశాడు.

ప్రకాష్‌కు మిరపకాయ బజ్జీలంటే ఆరో ప్రాణం. ఎంత కారంగా వున్నాసరే వేడివేడిగా తినేస్తాడు. మిగిలిన వాళ్ళకు కళ్ళంట నీళ్ళొచ్చినా, నోరంతా మండిపోయినా వాడికి మాత్రం కొంచెం కూడా కారం అనిపించదు. మంట పుట్టదు. కళ్ళంట నీళ్ళు రావు.

ఇలా ఎందుకా... అని అందరూ ఆశ్చర్యపోతుంటారు ప్రతిసారీ.

"నువ్వూ వస్తావా అనిల్...?" రాజు అడిగాడు.

"అమ్మో...స్కూలు బస్ వెళ్ళిపోదూ?"

"పోతేయేం... నేను నా సైకిల్‌మీద డ్రాప్‌చేస్తాలే"

"స్కూలు బస్‌లో వెళ్ళకపోతే మా మమ్మీ కోప్పడుతుంది" భయంగా చెప్పాడు అనిల్.

"నువ్వింకా మీ మమ్మీకి భయపడతావా?"

"ఏం? నువ్వు భయపడవా?" అనిల్ అడిగాడు.

"ఐ డోంట్ కేర్... నాకసలు మామమ్మీ అంటే భయమేలేదు"

"నాక్కూడా" వేణు.

"నాక్కూడా" నవీన్.

"మీ మదర్స్ మిమ్మల్ని ఎప్పుడూ కోప్పడరా?"

"ఎందుక్కోప్పడరూ? అయినా మేం కేర్ చెయ్యంగా"

"మరి మీ ఫాదర్ అంటే?"

"అమ్మో మాడాడీ అంటే నాకు చచ్చేంత భయం"

"నాక్కూడా"

"నాక్కూడా"





"మాడాడీ ఒకసారి బెల్ట్‌తీసుకుని కొడితే నాకు రక్తం కూడా వచ్చింది"

"ఎందుకు కొట్టారు?"

"చెప్పకుండా సినిమాకు వెళ్ళానని"

"మరి చెప్పకుండా ఎందుకు వెళ్ళావు?"

"చెప్తే పంపరుగా"

"సినిమాకు వెళ్ళాలంటే బోడి చెప్పివెళ్ళాలా ఏమిటి?" సుభాష్ నిర్లక్ష్యంగా అన్నాడు.

"ఏం? నువ్వు చెప్పవా?"

"చెప్పను..." గర్వంగా అన్నాడు సుభాష్.

అనిల్ అతనివంక ఆరాధనగా చూస్తున్నాడు.

సుభాష్‌కు ఎంత స్వేచ్ఛ...?!

"వచ్చాక తెలిస్తే?"

"తెలీడం ఏమిటి నాన్సెన్స్ నేనే చెప్తాగా వెళ్ళానని"

కుర్రాళ్ళందరికీ సుభాష్ హీరోలా కనిపించాడు.

అసలు సుభాష్ నేచర్‌లోనే వుంది హీరోయిజం.

ఎప్పుడూ నలుగురు ఫ్రెండ్స్‌తో తప్ప ఒక్కడూ కనిపించడు. నిర్లక్ష్యంగా కనిపించే వైఖరీ... చురుకైన కళ్ళూ... అందమైన ఫీచర్స్, వయస్సుకు మించిన పెద్దమాటలూ సుభాష్‌కు నాయకత్వ లక్షణాలను తెచ్చిపెట్టాయి.

"మా డాడీ ఇంట్లో వున్నంతసేపూ నేనూ మా బ్రదరూ పిల్లుల్లా వుంటాం. అయినా ఆయన ఎక్కువసేపు ఇంట్లో వుండరుగా" రాజు చెప్పాడు.

"ఏం...?"

"బిజినెస్... మా డాడీ ఇంటికి వచ్చేవేళకు మేం హాయిగా నిద్రపోతుంటాం. ఉదయం మేం స్కూలుకు వచ్చేవరకూ మాడాడీ నిద్రలేవరు" గర్వంగా చెప్పాడు రాజు.

"స్కూలునుండి లేట్‌గా వేళ్తే మీ మమ్మీ అడగదా? " అనిల్ ప్రశ్న.

"ఎందుకడగదూ? ఏదో ఒకటి చెప్పే స్తాను"

"ఏదో ఒకటి అంటే? "

"వీడొట్టి సోది సొరకాయరా... ఏమీ తెలీదు" రాజు అన్నాడు.

అందరూ ఫక్కున నవ్వారు.

"ఎస్సే రైటింగ్ కాంపిటీషన్ అనో, ప్రైవేట్ క్లాస్ అనో, సైన్స్ ఫేర్ అనో, గేమ్స్ అనో ఏదో ఒకటి చెప్తాడురా..." సుభాష్ వివరించాడు. సుభాష్ అనిల్‌కు ప్రత్యేక స్థానాన్నివ్వడం మిగిలిన మిత్రబృందం గమ నించింది.

తనను "సోదిసొరకాయ్" అన్నందుకు అనిల్‌కు కోపం ముంచుకువచ్చినా బలవం తాన అణచుకున్నాడు.

"అనిల్! సాయంత్రం నువ్వు వస్తావా? భలే ఎంజాయ్ చెయ్యొచ్చు" సుభాష్ అడి గాడు.

తల్లి కోప్పడుతుందని లోలోపల బెదురు తూనే అంగీకార సూచనగా తల ఊపాడు అనిల్. లేకపోతే వాళ్ళందరూ తనను అమ్మకు భయపడే సోది సొరకాయ్ అని గేలిచేస్తారనే భయంతో.

పిరియడ్ నలభై ఐదు నిముషాలూ పిల్ల లకు నాలుగు నిముషాల్లో గడిస్తే మేడంకు మాత్రం నలభైఐదు యుగాల్లా గడిచి చివ రికి పూర్తయ్యింది.

పిల్లలు కేరింతలు కొడుతూ క్లాసుల్లోంచి బయటపడ్డారు.

★ ★ ★

సాయంత్రం ఐదు గంటల పది నిముషా లయ్యింది. లక్ష్మి ఇంట్లో పనిపాటలు చూసుకుంటూనే స్కూలు నుండి వచ్చే కొడుకు కోసం ఎదురు చూస్తోంది.

అప్పటికే రావలసిన టైంకన్నా పావు గంట ఎక్కువగా గడిచింది. వీడింకా రాలేదే... అనుకుంది స్వగతంగా.

మరో పావుగంట గడిచింది.

వంటగదిలో పనిపూర్తిచేసుకుని కొడుకు కోసం ఎదురుచూస్తూ బయటికి వచ్చి రోడ్డు వంక చూస్తూ నుంచుంది.

పెద్ద స్కూల్ బ్యాగ్, టిఫిన్ బాక్స్, వాటర్ బాటిల్, నాప్‌కిన్ అమర్చిన బాస్కెట్ మోసుకుంటూ కాళ్ళీడ్చుకుంటూ నీరసంగా వస్తూ ప్రశాంత్ కనిపించాడు.

ప్రశాంత్ పక్కింటివాళ్ళ అబ్బాయి అనిల్ చదివే కాన్వెంట్‌లోనే ఐదో తరగతి చదువుతున్నాడు.

లక్ష్మి ప్రశాంత్‌ను చూసిన వెంటనే అదే చూపుతో రోడ్డు చివరికంటా చూసింది అనిల్ కొరకు.

అనిల్ కనిపించలేదు.

"ప్రశాంత్ బస్ వచ్చి ఎంత సేప య్యింది? " అంది ప్రశాంత్‌ను పలకరిస్తూ.

"పది నిముషాలు అయ్యింది ఆంటీ..." స్కూలు బ్యాగ్‌ను మొయ్యలేక మొయ్యలేక మోస్తూ చెప్పాడు ప్రశాంత్.

"మరి మా అనిల్ ఏడీ...? " ఆశ్చర్యంగా అడిగింది లక్ష్మి.

"మరేమో... మీ అనిల్ ఈరోజు అసలు బస్ ఎక్కలేదుగా ఆంటీ..."

"అనిల్ బస్ ఎక్కలేదా...? "

"లేదు ఆంటీ... మరేమో ఇవ్వాళ బస్‌లో నా ప్రక్కన రవి కూర్చున్నాడు. అప్పుడేమో నేను అనిల్ కొరకు వెతికాను. బస్‌లో అనిల్ కనిపించలేదు? "

"మీ స్కూల్లో గేమ్స్ పెడుతున్నారా ప్రశాంత్? "

"లేదు ఆంటీ..."

లక్ష్మిలో సన్నగా కలవరం ప్రారంభ మైంది.

ప్రశాంత్ లోపలికి వెళ్ళిపోయాడు.

అనిల్ కొరకు ఎదురు చూస్తోన్న లక్ష్మి హృదయం పరిపరి విధాల పరుగులీసింది.

అనిల్ ఏమైయుంటాడు.

వారం క్రితం రోడ్ క్రాస్ చేయబోతూ బస్సు గుద్దుకుని అనిల్ వయస్సే వున్న కుర్రాడు అక్కడికక్కడే చనిపోయాడు.

హఠాత్తుగా ఆ దృశ్యం గుర్తుకు వచ్చిన లక్ష్మి హృదయం జలదరించింది. ఇంతకూ అనిల్ స్కూల్లోనే వున్నట్లా...? లేక ఎవ రైనా ఫ్రండింటికి వెళ్ళి వుంటాడా...?

క్రమంగా సంధ్య చీకట్లు కమ్ముకుంటు న్నాయి. మేతకు వెళ్ళిన పిట్టలు గూళ్ళకు చేరుతూ సందడి చేస్తున్నాయి.

ఆరయ్యింది.

లక్ష్మి మనస్సు మరి ఆగలేదు. గదిలో పేపరు చదువుకొంటోన్న శంతన్ దగ్గరగా వెళ్ళింది. వదిన రావడం చూసిన శంతన్ పేపరు పక్కన పెట్టి, "ఏమిటి వదినా...?" అన్నాడు.

"శంతన్... అనిల్ ఇంకా ఇంటికి రాలేదు" లక్ష్మి తనలోని ఆతృతను దాచు కుంటూ మామూలుగా చెప్పినట్లు చెప్పింది.

శంతన్ వాచీ చూసుకున్నాడు. ఆరుంబా వయ్యింది. ఆరుంబావేగా అయ్యింది. వదిన ఆదుర్దా పడ్డంలో అర్థం లేదనిపించింది శంతన్‌కు. అనిల్ మరీ ఎల్‌కేజీ కుర్రాడేం కాదు తప్పిపోతాడనుకునేందుకు. ఎవరైనా ఫ్రండ్ ఇంటికి ఏ నోట్సుకోసమో వెళ్ళి వుంటాడు. లేక ఏ ఆటలో ఆడుతూ వుండి వుంటాడు. ఇందులో అంత కంగారు పడ్డా నికి ఏముంది...?

ఏమైనా వదినకు పిల్లల విషయంలో జాగ్రత్తతో పాటు కంగారూ ఎక్కువే. తాము ఇంటికి రావడం కాస్త ఆలస్యం చేసినా ఇంట్లోకీ బయటికీ తిరుగుతూ ఎదురు చూస్తుంటుంది.

తన భావాలను బయటపెట్టి వదిన ఫీలింగ్స్‌ను హర్ట్ చేయడం ఇష్టంలేని శంతన్, వెంటనే లేచి షర్ట్ తగిలించుకుని, "నేను వెళ్ళి చూసి వస్తాలే వదినా... నువ్వు కంగారుపడకు" అంటూ వెళ్లాడు.

మరో అరగంట భారంగా గడిచింది.

సారధి ఇంటికి వచ్చే వేళయింది. సారథి వస్తే అనిల్ ఇంకా ఇంటికి రాలేదని చెప్పా లని చూస్తోంది.

మరో పావుగంట భయంకరమైన నిరీ క్షణ అనంతరం సారధి స్కూటర్ వీధి చివర కనిపించి 'హమ్మయ్య' అన్నట్లుగా రిలీఫ్‌గా ఊపిరి తీసుకుంది. సారధి స్కూటర్ ఆపుతూ గుమ్మంలో చూస్తూ నించున్న భార్యను చూసి చిరునవ్వు నవ్వాడు. కానీ, మూడ్‌లో లేనట్లున్న భార్య వైపు చూస్తూ స్కూటర్ స్టాండ్ వేసి "ఏమైంది లక్ష్మి?" అన్నాడు.

"అనిల్ ఇంకా రాలేదా...?" అంటూ టైం చూసుకున్నాడు.

"స్కూల్లో ఏమైనా గేమ్స్ కండక్ట్ చేస్తు న్నారేమో...?" సాలోచనగా అన్నాడు సారధి.

"లేదుటండీ, ప్రశాంత్ చెప్పాడు. అయినా గేమ్స్ వుంటే అనిల్ ఉదయమే చెప్పి వెళ్ళే వాడుగా..."

ఆమె స్వరంలో వినిపించిన బేలతనాన్ని గుర్తించిన సారధి, " నువ్వు కంగారు పడకు. నేను వెళ్ళి చూసివస్తాను. గాభరా పడకు" అంటూ స్కూటర్ స్టార్ట్ చేశాడు.

తనెందుకు, ఎంత కంగారు పడ్తూందో లక్ష్మి చెప్పలేదు.

స్కూటర్ వీధి మలుపు తిరిగింది.

లక్ష్మి అలాగే చూస్తూండిపోయింది.

"ఏమిటి వదినగారూ! అనిల్ ఇంకా రాలేదా...?" పక్కపోర్షన్ వసంత పలకరిం

పుగా అడిగింది.

"లేదండీ..."

"మా ప్రశాంత్ చెప్తే 'అయ్యో' అనిపించింది."

లక్ష్మి వసంతవంక నిర్వికారంగా చూసింది.

"అయ్యో వదినగారూ! ఇప్పుడు ఎక్కడ విన్నా ఏవో ఘోరాలే కదండీ బయటికి వెళ్ళినవాళ్ళు ఇంటికి వచ్చేపరకూ ప్రాణాలు గుప్పిట్లో వుంటాయంటే నమ్మండి" అని... కాసేపాగి,

"రోడ్డు ప్రమాదాలు చూస్తే అలాగైతే, దానికితోడు పిల్లల్ని కిడ్నాప్ చేసేవాళ్ళు ఎక్కువైపోయారండీ ఈమధ్య..." అంది.

"కిడ్నాపా...?"

"అయ్యో! మీరు వినడనే లేదా...?"

"ఏమిటి?" భయంగా అడిగింది లక్ష్మి.

"పిల్లల్ని తినేవాళ్ళు ఊళ్ళోకి వచ్చారట..."

"పిల్లల్ని తినేవాళ్ళా..?"

"ఔనండీ. నిన్న ఆటోలో కూర్చుని ఒక పిల్లని తినేశారట"

లక్ష్మి అయోమయంగా చూస్తూ వింటూండిపోయింది.

"మీరు నమ్మడం లేదుకదూ...? వాళ్ళను పోలీసులు పట్టుకున్నారట కూడ" వసంత అదేపనిగా చెప్పుకుపోతోంది.

లక్ష్మి చెవులు ఎప్పుడో వినడం మానేశాయి. అన్యమనస్కంగా రోడ్డు చివరికంటా చూస్తోంది.

వసంత వయస్సు పాతిక. కానీ ఆ అమ్మాయిని కదిలిస్తే అమ్మమ్మకంటే కూడా అధ్వాన్నంగా, చాదస్తంగా మాట్లాడుతుంది.

ఆ ధోరణి కష్టంలో ఉన్నవాళ్ళకు సానుభూతి చూపడం అనుకుంటుందేగానీ, తన మాటలు వాళ్ళనెంత బాధిస్తాయో ఆమెకు తెలీదు.

"మొన్న ఇలాగే మా మేనత్త ఆడబిడ్డ తోడికోడలి కొడుకు..." వసంత చెప్పుకుపోతోంది.

వీధిచివర సారధి స్కూటర్... వెనక అనిల్.

లక్ష్మి గుండె కుదుటపడింది.

"స్కూటర్ దిగుతున్న కొడుకును చూసి, "ఇంత లేటయ్యిందేంరా...?" అంది. అనిల్ ఒక్కసారి తల్లి ముఖంలోకి చూసి తలవంచుకున్నాడు.

"మాట్లాడవేం...?"

"వాళ్ళ స్కూల్లో ఏవో గేమ్స్ కండక్ట్ చేస్తున్నారటలే..." స్కూటర్ లోపల పెడుతూ సారధి చెప్పాడు.

"గేమ్సా..?"

అనిల్ మౌనంగా వుండిపోయాడు.

"గేమ్స్ ఏవీ లేవని చెప్పాడుగా ప్రశాంత్"

"ఏమిటిరా...?" అన్నట్లు కొడుకు వంక చూశాడు సారధి.

"మా క్లాస్ పిల్లలకు మాత్రమే స్పెషల్‌గా కండక్ట్ చేస్తున్నారు..." అనిల్ నెమ్మదిగా చెప్పాడు.

"అయినా ఉదయం నాకు చెప్పి వెళ్లవచ్చుగా. లేటవుతుందని. నాకెంత కంగారువేసిందో..."

"మరిచిపోయాడేమోలే... అయినా పిల్లలు పెద్దవాళ్లయ్యేకొద్దీ స్కూల్లో ఏక్టివిటీస్ ఎక్కువవుతుంటాయి. కాస్త ఆలస్యానికే నువ్విలా గాభరాపడితే ఎలా...?"

తల్లీ తండ్రీ మాటల్లో వుండగా నెమ్మదిగా లోపలికి జారుకున్నాడు అనిల్. ఈలోపు శంతన్ కూడా ఇల్లు చేరాడు.

"ఇంతకూ అనిల్ మీకెక్కడ కనిపిం

చాడు? " లక్ష్మి అడిగింది.

"బస్‌స్టాండ్ రోడ్‌లో కాళ్ళీడ్చుకుంటూ వస్తున్నాడు పిచ్చి సన్యాసి. పైగా గోతాంలా ఆ పుస్తకాల సంచీ ఒకటి"

అసలే బస్‌స్టాండ్ రోడ్‌లో ట్రాఫిక్ ఎక్కువ. ఇంకా నయం. క్షేమంగా ఇల్లు చేరాడు అనుకుంది లక్ష్మి.

"ఏమైనా మీ నాన్నగారిలా నీకు గాభరా ఎక్కువగానీ" నవ్వుతూ అన్నాడు సారథి.

శంతన్ ఫక్కున నవ్వాడు.

లక్ష్మికి అన్నదమ్ములిద్దరూ తనను ఆటపట్టిస్తున్నందుకు ఉడుకుమోత్తనం వచ్చేసింది.

"పోనీలెండి. మీరూ, మీ వాళ్ళే నిర్వికార నిశ్చల రుషిపుంగవులు" అంటూ మూతి ముప్పైవంకర్లు తిప్పుతూ లోపలికి వెళ్లిపోయింది.

లక్ష్మి పెళ్లి సందర్భంలో బస్ ట్రబుల్ ఇవ్వడంవల్ల అనుకున్న సమయానికంటే అరగంట లేటయ్యారు మగపెళ్లివారు.

ఈ అరగంట ఆలస్యానికే లక్ష్మి తండ్రి గాభరాపడిపోయి, బి.పి. పెంచుకుని చుట్టూ వున్నవాళ్లను గాభరా పెడుతూ ఎంత చికాకు చెయ్యాలో అంత చికాకూ చేశాడు.

పెళ్ళయ్యాక లక్ష్మి ఆ సంఘటన గురించి వివరంగా చెప్పి తెగనవ్వింది. అప్పటినుండే సారధి ఆమెను తండ్రితో పోల్చి ఉడికిస్తుంటాడు. భర్త తెమిలేసరికి ఆలస్యం అవుతుందని, స్నానం చేసి వచ్చిన అనిల్‌కు భోజనం వడ్డించింది లక్ష్మి.

కొడుకు భోంచేస్తున్నంతసేపూ వాడి స్కూలు విషయాలూ, ఆరోజు జరిగిన ఆటల వివరాలూ ఆసక్తిగా అడుగుతూనే వుంది.

అనిల్ తోచిన విధంగా జవాబులు చెప్తూ భోంచేస్తున్నాడు. భోజనం పూర్తి కాగానే ఎవరూ చెప్పకుండానే పుస్తకాలు ముందు వేసుకుని కూర్చుని శ్రద్ధగా చదువుకోడం గమనించిన లక్ష్మి లోలోపలే మురిసిపోయింది కొడుకు శ్రద్ధకూ, తెలివితేటలకూ.

స్కూలు వదిలేక రెండు గంటలు బలాదూరు తిరుగుతూ, ఆ తరువాత చన్నీటి స్నానం, వేడివేడి భోజనం... అనిల్ కళ్లమీదికి నిద్ర ముంచుకువస్తోంటే ఏదో చదువుతున్నట్లు నటిస్తున్నాడు.

"హోంవర్క్ చెయ్యవా...? " లక్ష్మి అడిగింది.

కళ్లు కూరుకుపోతోంటే, "లేదు... ఇవ్వ లేదు" అనేశాడు అనిల్.

తల్లీ, తండ్రీ, చిన్నాన్న భోజనాలు చేస్తోంటే ముందు గదిలో కునికిపాట్లు పడుతున్నాడు అనిల్.

"పిల్లల్ని తినేవాళ్లు వచ్చారంటూ వసంత చెప్తోంది. ఏమిటి? " లక్ష్మి శంతన్‌వైపు చూస్తూ అడిగింది.

అంటే లక్ష్మి భర్తమీద అలిగిందన్న మాట.

"మీ ఆడవాళ్లు ఇలాంటి పుకార్లను భలే పోగు చేస్తారులే వదినా" నవ్వేశాడు శంతన్.

"పోలీసులు కూడా పట్టుకున్నారటగా...?"

"అంతా వట్టి పుకారు వదినా..." తేల్చేశాడు శంతన్. భోజనాలు పూర్తి కాగానే శంతన్ బయటికి వెళ్లిపోయాడు.

తండ్రినీ, తననూ గాభరా మనుష్యులు అన్నందుకు ఇంకా కోపం నటిస్తోన్న లక్ష్మిని చప్పుడు కాకుండా దగ్గరగా లాక్కుని కోపం పోగొట్టేశాడు సారథి.

"ఓ శుభవార్త చెప్పనా? "

"ఏమిటి? " ఆసక్తిగా అడిగింది.

"రేపు ఎరియర్స్ వస్తాయి"

"ఎంత? "

"పదివేలు"

లక్ష్మి ఏదో ఆలోచిస్తోన్నట్లుగా మౌనంగా వుండిపోయింది. ప్రతినెల వచ్చే జీతంకాక అదనంగా పదివేలంటే తమవంటివాళ్లకు పెద్ద మొత్తమే మరి. ఆ డబ్బుతో ఏం చెయ్యాలి.

"ఏం చేద్దాం..." సారథి అడిగాడు. లక్ష్మికి ఓ జత బంగారు గాజులు చేయించుకోవాలని ఎప్పటినుండో కోరిక. భర్తకు చెప్తే కాదనడు.

కానీ ఎప్పటికప్పుడు తనకే అమ్మో.. అంత డబ్బా అనిపిస్తుంటుంది.

భర్త పదివేలు అనగానే బంగారుగాజులు తళతళలాడుతూ లక్ష్మి కళ్ళముందు కదలాడాయి ఎప్పటిలాగే. అయితే వెంటనే అమ్మో... అని కూడా అనిపించింది. వెంటనే మరోసారికి వాయిదా పడిపోయింది కూడా.

"ఏమిటి ఆలోచిస్తున్నావు...?"

"అబ్బే.. ఏంలేదు. ఏం చేస్తే బాగుంటుందా అని"

"నువ్వు కోప్పడను అంటే నేను చెప్తాను"

లక్ష్మికి నవ్వు వచ్చింది. భర్త అలా చిన్న పిల్లాడిలా అడుగుతోంటే ముద్దుగా కూడా అనిపించింది.

"చెప్పండి..." అంది చిరునవ్వుతో.

"నువ్వు కోప్పడకూడదు... మరి"

లక్ష్మి సారథి క్రాపులోకి చేయి గుచ్చి ముద్దుగా వూపుతూ, "అల్లరి చాలు" అంది బయటిగదిలోని అనిల్‌కు వినిపించకుండా.

సారథి లక్ష్మికి మరికాస్త దగ్గరగా జరగబోయాడు.

"ఊఁ... అక్కడే కాస్త ఊఁ... అంటే చాలు... ఇంతకూ ఏమిటో చెప్తానన్నారు...?"

"ఊఁ... అదే మనం ఆ డబ్బుతో టి.వి. కొంటే ఎలా వుంటుంది?" తండ్రి నోటి వెంట వచ్చిన టి.వి. అన్న మాట అనిల్ నిద్రమత్తును పటాపంచలు చేసింది. ఒక్క ఉదుటున తండ్రి దగ్గరకు చేరాడు అప్పుడే టి.వి. కొంటున్నంత ఉత్సాహంతో.

"కొనుక్కుందామా లక్ష్మి" ఆశగా అడిగాడు సారథి.

"కొనుక్కుందాం మమ్మీ...ప్లీజ్ మమ్మీ... మా ఫ్రండ్స్ అందరి ఇళ్లల్లోనూ టి.వి.లు వున్నాయి"

అనిల్ కళ్లల్లోనూ, స్వరంలోనూ తొణుకుతోన్న ఆశ లక్ష్మిని కదలించింది.

"ఏం మాట్లాడవేమోయ్..."

"అసలు మీకు ఎలా చెప్తే అర్థం అవుతుంది? ఎన్నిసార్లు చెప్తే అర్థం అవుతుంది?" లక్ష్మికి కోపం వచ్చిందని అర్థం అయ్యింది సారథికి.

"చదువుకునే పిల్లలు వున్న ఇంట్లో టి.వి. వుంటే వాళ్ళింకేమయినా చదువుతారా?"

"నేను వాడ్ని కంట్రోల్ చేస్తాగా?" లక్ష్మిని కన్విన్స్ చేస్తూ అన్నాడు సారథి.

"ఏం చేస్తారు? టి.వి.లో ఎప్పుడూ ఏవో ప్రోగ్రాంస్ వస్తూనే వుంటాయి. మనం చూస్తూ వాణ్ణి చూడకుండా ఆపుతామా...?"

"మనమైనా అన్నీ చూస్తామా ఏమిటి? ఏవో కొన్ని"

"నేను సినిమా చూడకుండా మీరు క్రికెట్ చూడకుండా వుండగలమా? అవిపోతే పిల్లల ప్రోగ్రాంస్. ఈవిధంగా టి.వి. ముందు పిల్లలూ, పెద్దలూ ఎన్ని గంటలు వేస్ట్ చేస్తున్నారో ఆలోచించండి"

అనిల్‌కు తల్లిమీద గొంతువరకూ కోపం వచ్చింది. అసలు డాడీ మంచివాడే. ఇదిగో... ఈవిడే. ఈవిడగారిదే పెత్తనం అంతా. కసిగా అనుకుంటూ విసురుగా వెళ్లి

దుప్పటిముసుగు పెట్టుకుని పడుకున్నాడు కోపంగా.

సారధి కూడా మౌనంగా వుండిపోయాడు. తను మరీ పెత్తనం చేస్తున్నట్లుగా మాట్లాడుతోందేమో. ఈ ఆలోచన రాగానే లక్ష్మి నవ్వుతూ అంది.

"అనిల్ టెంత్ పాస్ కానివ్వండి. అప్పుడు కొనుక్కుందాం"

"ఇంకా నయం. అప్పటికయినా అన్నావు. ఏకంగా అనిల్ పెళ్ళి కానివ్వండి. వాడి పెళ్లాం తెస్తుంది. అనలేదు" ఉడుక్కుంటున్నట్లుగా అన్నాడు సారధి.

లక్ష్మి వంటగది శుభ్రం చేస్తోంది.

భర్తకు టి.వి. అంటే ఎంత మోజో తనకు తెలుసు. టి.వి.లో క్రికెట్ మాచెస్ వస్తున్నాయంటే ఎవరి ఇంటికీ వెళ్ళి చూడటానికి మనస్కరించక చూడకుండా వుండలేకా ఆయన పడే అవస్థ చూస్తుంటే ప్రతిసారీ జాలి కలుగుతుంది.

ఒక్కోసారి కోపం కూడా వస్తుంది. ఇంత పిచ్చి ఏమిటీ? అని. రేడియోలో కామెంటరీ వింటూ, "గవాస్కర్ అదరగొట్టేశాడు" అంటాడు. "కపిల్ ఇంకా ఇంప్రూవ్ కావాలి" అంటాడు.

"సరియైన పిచ్ లేక కానీ మనవాళ్లే గెలవాల్సినమాట" అంటాడు. వికెట్లంటాడు. ఓవర్లంటాడు. సిక్సర్లంటాడు. ఇవేవీ తనకు తెలీకపోయినా భర్త ఆట చూడలేకపోతున్నందుకు గుండెపోతున్నాడనే విషయం మాత్రం స్పష్టంగా తెలుస్తుంది.

అప్పుడు మాత్రం ఆ టి.వి. ఒకటి తెచ్చి పడేయాలన్నంత జాలి కలుగుతుంది. నిజానికి ఇలాంటి చిన్న చిన్న సరదాలు తీర్చుకోగలిగిన ఆదాయమే తమది. వాయిదాల పద్ధతి మీదో... లేదా మరో విధంగానో టి.వి. కొనడం ఏమంత కష్టమైన పనేమీ కాదు.

కానీ... ఎలా? చూస్తూ చూస్తూ పక్కలో పామును పెట్టుకోవడం ఎలా? నిజానికి తనకు మాత్రం ఇంట్లో టి.వి. వుండాలనే ముచ్చట లేదా? ఎలాగూ చూడాలనే కోరిక ఎంత వున్నా తాము సినిమాలకు ఎక్కువగా ఖర్చు పెట్టరు. కనీసం నెలకో సినిమా చూడ్డం కూడా అరుదే. ఇంట్లో టి.వి. వుంటే ఎంచక్కా సినిమాలు చూడవచ్చు నిజమే.

కానీ ఎలా? తమ కోరికల కోసం చూస్తూ చూస్తూ, తెలిసీ తెలిసీ వాడి భవిష్యత్ బలి చేయడం ఎలా...?

పనిచేసుకుంటూనే ఆలోచిస్తోంది లక్ష్మి.

కిచెన్ రూం సర్ది సారధికి పక్క వేసింది. మౌనంగా వచ్చి పడకమీద వాలిపోయాడు. ఆయన హర్ట్ అయ్యారేమో... లక్ష్మి మనస్సు చివుక్కుమంది. అసలు తనను అడగబట్టికానీ, అడక్కుండా తెచ్చి ఇంట్లో పెడితే తానేం చేస్తుంది?

అయినా తండ్రీ కొడుకులు కంట్రోల్‌గా వుంటామంటున్నారుగా. చూద్దాం. లక్ష్మి నెమ్మదిగా భర్త పక్కన చేరుతూ. "కోపం వచ్చిందా...? " అంది నెమ్మదిగా.

సారధి ఆమె చేతిని చెక్కిలికి అదుముకుంటూ మౌనంగా వుండిపోయాడు.

"అలాగే... టి.వి. కొనుక్కుందాం"

సారధి ఆమె చేతిని అలాగే పట్టుకుని మౌనంగా వుండిపోయాడు.

"కోపం వచ్చిందా? " లక్ష్మి స్వరంలో ఆర్ద్రత.

"అబ్బే! అదేం లేదు"

"టి.వి. ఏ కంపెనీది మంచిది? రేపు మీరు వస్తూ తెచ్చేయండి. మళ్ళీ డబ్బు వుంటే దేనికో దానికి అయిపోతుంది. డయొనారా మంచిదా? కోణార్క్ మంచిదా? క్రౌన్ కూడా మంచిదే అను

కుంటా. ఏదైనా కాస్త పెద్ద సైజు తీసుకుంటేనే మంచిది. కళ్ళకు దెబ్బ లేకుండా వుంటుంది"

తనను సంతోషపరచేందుకు అంతగా ప్రయత్నిస్తోన్న లక్ష్మిని చూసి కరిగిపోయాడు సారథి.

మునివ్రేలితో తన షర్ట్ బటన్స్ కదుపుతోన్న భార్య వంక చూశాడు. పెద్దవై విశాలంగా అనిపించే కళ్లూ, కోటేరు వంటి ముక్కు. చిన్న పెదవులు. ఒత్తుగా వున్న నల్లని నొక్కుల జుట్టు... ఎత్తుకు తగిన లావుతో ఆడపిల్ల అంటే ఇలా వుండాలి. అనిపించేలా వున్న లక్ష్మిని పెళ్లిచూపుల్లోనే ప్రేమించేశాడు సారథి.

లక్ష్మి చూపుల్లో తొణుకుతోన్న అనంతమైన అనురాగానికి విచలితుడైన సారథి ఆమెను అలాగే చుట్టి హృదయానికి హత్తుకున్నాడు. ముఖమంతా ముద్దులతో నింపివేశాడు.

టి.వి. తెచ్చుకుందామన్నందుకే ఈ సంతోషమంతా... అనుకుంది. లక్ష్మి. పోనీలే. ఆయన సంతోషం కంటేనా? అని సరిపెట్టుకున్నా ఏ మూలో కొడుకు భవిష్యత్ గురించిన బెంగ లేకపోలేదు.

"లక్ష్మీ! రేపు పదివేలు అనిల్ పేర ఫిక్సిడ్ డిపాజిట్ చేస్తాను. వాడు కాలేజీకి వచ్చేప్పటికి ఆ డబ్బు ఉపయోగపడుతుంది"

లక్ష్మి తెల్లబోయినట్లుగా భర్త ముఖంలోకి చూస్తూ "మరి టీవీ? " అంది అస్పష్టంగా.

"పిచ్చీ! ఏదో కోరిక అలా అనిపిస్తుంది గానీ, నువ్వు చెప్పిన మాటల్లో నిజం నాకు మాత్రం తెలీదా? నువ్వు అన్నట్లు మనం మరికొంత కాలం కోరికలకు కళ్ళాలు వేసుకోవాలి. తప్పదు. అనిల్ భవిష్యత్ కంటే మన కోరికలు ముఖ్యం కాదుకదా...? " లక్ష్మి జుట్టు నిమురుతూ చెప్తున్నాడు.

భర్త కళ్లల్లోకి ఆరాధనగా చూస్తూ మౌనంగా వింటోంది లక్ష్మి.

"నువ్వు ఇందాక అనిల్ టెంత్ అయ్యాక అన్నావుగానీ, నిజానికి టెంత్ పిల్లలకు టర్నింగ్‌పాయింట్ మాత్రమే. ఇంటర్ పూర్తయితేగానీ వాట్ ఈజ్ వాట్ అనే జ్ఞానం కలగదు. అప్పుడు మనం పదహారు టీ.వీలూ, పాతిక టూ ఇన్ వన్‌లూ మ్రోగించినా వాళ్ళవరకూ వాళ్లు శ్రద్ధగా చదువుకుంటారు"

అయితే అనిల్ ఇంటర్ అయ్యాకే మనం టీవీ కొనుక్కోవాలన్నమాట"

"అహఁ... అలా అనేగా శ్రీమతిగారి ఆజ్ఞ" చిలిపిగా అన్నాడు సారథి.

లక్ష్మి మనస్సులోనే లెక్క వేసుకుంది.

అంటే... ఇంకా ఐదేళ్ల తరువాతన్న మాట.

ఆ స్వరంలో ఎంతో కొంత నిరాశ లేకపోలేదు.

"మరి ఇందాక నేను చెప్పినట్లు చెయ్యనా...? "

"మీ ఇష్టం"

"మీ ఇష్టం కాదు. నీకు ఇష్టం అయితేనే. రాణీగారి ఆజ్ఞ లేకుండా ఎలా? " ఆమె నడుం చుట్టూ చెయ్యి చుడుతూ అన్నాడు సారథి.

లక్ష్మి నవ్వింది.

"నాకు పదివేలు పెట్టి పట్టుచీర తెమ్మంటాను తెస్తారా? "

"నువ్వు నిజంగా అడగాలేగానీ తప్పకుండా తెస్తాను. తీరా తెచ్చాక డబ్బు వేస్ట్ చేశానంటూ తిడతావు. ఏం నిజంగా తేనా? " ఆమెను మరింతగా హత్తుకుపోతూ అడిగాడు సారథి.



"భలేవాళ్లు. నేను ఏదో సరదాకు అన్నాను. మీరు నిజంగా చేసినా చేస్తారు బాబూ... మీరు ఇందాక చెప్పిన ప్లాన్ బాగుంది అనిల్ కాలేజీకి వచ్చేసరికి డబ్బు వడ్డీతోసహా అంది వస్తుంది"

"నీకో విషయం తెలుసా...?" సీరియస్‌గా అడిగాడు సారథి.

"ఏమిటీ?"

"నువ్వు పట్టుచీరలో కంటే నా కంటికి ఇలాగే అందంగా కనిపిస్తావు" అన్నాడు ఆమెకూ తనకూ అడ్డుగా వున్న చీరను తొలగిస్తూ.

లక్ష్మి సిగ్గుతో ముడుచుకుపోతూ, "ఈమాట చాలాసార్లు చెప్పారు" అంది గుసగుసగా.

★ ★ ★

అది "ది హోలీ కాన్వెంట్"

పట్టణంలో వున్న ఖరీదయిన ఇంగ్లీష్ మీడియం స్కూలు-

ఖరీదయిన తల్లిదండ్రులే తప్ప మిగిలిన వాళ్లు ఊహించుకునేందుకు కూడా భయపడే గొప్ప కాన్వెంట్.

పట్టణంలో అతిఖరీదయిన డాక్టర్స్, లాయర్స్, బిజినెస్ మాగ్నట్స్, పొలిటీషియన్స్, చుట్టుపక్కల పల్లెల భూస్వాములు... వీరే ఆ స్కూలు మహారాజ పోషకులు.

కాన్వెంట్‌లో సీటు కొరకు మూడు సంవత్సరాలు ముందుగా సీటు రిజర్వ్ చేయించుకోవలసివుంటుంది.

యల్. కె. జి. సీటుకొరకు చెల్లించవలసిన మినిమమ్ డొనేషనే పదివేలు.

పదివేలుగానీ, పాతికవేలుగానీ ఆ స్కూల్లో సీటు దొరకడమే పదివేలంటారు పేరెంట్స్

గోల్డెన్ స్పూన్స్ నోట్లో పెట్టుకుని పుట్టిన ఆ ఖరీదయిన విద్యార్థులు తమ ఖరీదుకు తగిన విధంగానే స్కూలుకు వస్తుంటారు.

ఖరీదయిన స్కూలు డ్రస్సులు, బ్యాగులు, మల్లెపూవులాంటి తెల్లని సాక్సుతో పాలిష్ చేసి నల్లగా నిగనిగ మెరుస్తోన్న షూస్, టై... వెండిపట్టీలా నడుంకు బెల్టు. సిరిసంపదలు ఇచ్చిన ఆరోగ్యంతో పావురాయి రెక్కల్లా స్కూటర్లనుండి, కార్లనుండి, స్కూలు బస్‌లనుండి దిగుతుంటారు పిల్లలు.

ఇమ్మీడియేట్‌గా ఎవరి స్కూలు బ్యాగ్ చెక్ చేసినా వంద రూపాయలకు తక్కువగా వుండవా బ్యాగ్‌లో.

తమ బిడ్డల బంగారు భవిష్యత్తుకు ఆ స్కూలునే గీటు రాయిగా ఎంచుకుని, వున్న కాస్తా కూస్తా బంగారం అమ్మి డొనేషన్లు కట్టి సీటు సంపాదించి, పిల్లల్ని ఆ స్కూల్లో చేర్పించి పుస్తకాలు, డ్రస్సులు, బూట్సూ, సాక్సులూ, టైలూ వగైరా... వగైరాలు సమకూర్చి వెన్ను విరిగినట్లు కూలిపోతుంటారు మధ్యతరగతి ఉద్యోగులు.

భార్యాభర్తలు ఉద్యోగాలు చేస్తోంటే అందులో ఒక జీతం అంతూ పొంతూ లేని ఆ కాన్వెంట్ ఫీజులకూ, పుస్తకాలకూ, మెయింటనెన్స్‌కూ, కల్చరల్ ఏక్టివిటీస్ అంటూ అదనంగా కొనిపించే దుస్తులకూ, వడ్డించే స్పెషల్ టాక్స్‌లకూ సరిపోగా మిగిలిన ఒక్క జీతంతో గడుపుకొస్తుంటారు.

కుటుంబంలో ఒక్కరే ఉద్యోగస్తులైనవాళ్లు ఆ స్కూలు వంక తేరి చూడటమే సాహసాల్లోకెల్లా సాహసం.

అటువంటి సాహసమే చేశారు లక్ష్మీ-సారథి దంపతులు.

సారథికి పిత్రార్జితం అంటూ ఏమీలేదు. కష్టపడి చదువుకుని కాంపిటీటివ్ ఎగ్జామ్స్ రాసి కేవలం మెరిట్‌తో బ్యాంక్ వుద్యోగం సంపాదించుకున్నాడు.

బ్యాంక్ ఇచ్చిన వెహికల్ లోన్‌తో




స్కూటర్ కొన్నాడు. రెండు గదుల అద్దె ఇంటి గుమ్మాలకు కదలాడే పలుచని అంద మైన తెరలు, ఇంటిముందు హుందాగా కని పించే స్కూటర్ సారథి ఆర్థిక పరిస్థితిని గూర్చి చూసేవాళ్ళకు అంచనాలను పెంచు తుంది.

ముందుగది పగలంతా డ్రాయింగ్ రూంగానూ, కామన్ రూంగానూ, అనిల్ స్టడీ రూంగానూ ఇలా ఎన్నో అవతారాలు ఎత్తి చివరికి రాత్రి బెడ్‌రూంగా మారిపో తుంది.

వెనక గది కిచెన్ కం డైనింగ్ రూంగానూ, స్టోర్ రూంగానూ తన సర్వీ సెస్ అందిస్తూ రాత్రికి భార్యాభర్తలకు బెడ్ రూంగా రూపాంతరం చెందుతుంది.

లక్ష్మి ఆ రెండు గదుల ఇంటినీ ఎంత నీట్‌గా, ఎంత ఆర్టిస్టిక్‌గా వుంచుతుందంటే సాటి ఆడవారికే అసూయ కలిగేటంత. రెండు గదులు మాత్రమే గల ఆ చిన్న ఇంటిని అంత అందంగా ఎలా వుంచగలు గుతుందా... అని ఆశ్చర్యపోతుంటారు.

ఎక్కువ సామాను పోగుచేయకపోవ టమే... ఆ అందానికి కిటుకు. ఆ విషయం లక్ష్మికి బాగా తెలుసు.

అనిల్ పుట్టాక ఆపరేషన్ చేయించుకు నేందుకు భార్యాభర్తలిద్దరూ సుముఖంగానే వున్నా అటువారూ, ఇటు వారూ పడనివ్వక పోవడంతో మళ్ళీ కాన్పు రాకుండా కొన్ని జాగ్రత్తలు మాత్రం తీసుకుంటున్నారు.

అనిల్ స్వతహాగా తెలివైనవాడు కావడం చేత క్లాసులో ఒకటి నుండి ఐదు ర్యాంకుల మధ్య వుంటాడు.

ఫస్ట్ ర్యాంక్ రానందుకు అప్పుడప్పుడూ తల్లి మెత్తగా మందలిస్తూనే వుంటుంది. పిల్లవాడు శ్రద్ధగా చదువుతున్నాడంటే అందుకు తన శ్రద్ధే కారణం అని లక్ష్మి, తన భయభక్తులే కారణమని సారథీ లోలోపలే గర్వపడుతుంటారు. కానీ, పిల్లవాడు బుద్ధిగా చదువుకొని ప్రయోజకుడు కావడా నికి తమ ప్రయోజకత్వ మొక్కటే సరిపో దనీ, ఇంకా అనేకానేక పరిస్థితులు అనుకూ లించాలనీ పాపం ఇంకా వాళ్లకు అనుభవం లోకి రాలేదు. ఇక ఆర్థికపరమైన విషయా నికి వస్తే లక్ష్మి చాలా చాకచక్యంగా బ్యాల న్స్‌డ్‌గా నడుపుతుంటుందా ఇంటిని.

సగం జీతం అనిల్ చదువుకు ఖర్చు అవు తోంటే మిగిలిన సగాన్ని ఆమె ఎంతో నేర్పుగా సర్దుకొస్తుంటుంది. ఏనెల కాస్త అనుకోని అదనపు ఖర్చు తగిలినా వాళ్ళ బడ్జెట్ కొన్ని నెలల వరకూ మరి కోలు కోదు.

ఈ సమాజంలో రాజకీయ నాయకుని కుమారుడు పెరిగి తండ్రి పదవికి వారసుడ వుతున్నాడు.

వ్యాపారస్థుని కుమారుడు తండ్రి బిజినె స్‌కు యజమాని **అవుతాడు**. రిజర్వేషన్ పేరుతో కొంతమంది అదృష్టవంతులు ఉద్యోగాలు దక్కించుకుంటారు అర్హులు కాక పోయినా.

కానీ, ఒక మధ్యతరగతి ఉద్యోగి కొడుకు, ఒక కూలివాడి కొడుకు దేనికి వారసుడౌ తాడు...?

నిరుద్యోగం నాలుకలు చాచుకుని యువ తరాన్ని కబళిస్తున్న ఈ పరిస్థితుల్లో మరి పదేళ్ళ నాటి పరిస్థితి ఊహించడం పెద్ద కష్టమైన విషయమేమీ కాదు.

తమ వంటి మధ్యతరగతికి చెందినవారి పిల్లలంతా ఏంచేస్తారు? ప్రభుత్వం ఎంద రికి ఉద్యోగ ఉపాధులు చూపించగ లదు...? ప్రభుత్వం చూపించగలిగే ఉద్యో గాలను ఉత్తర దక్షిణాలను ఎరగాచూపి తన్నుకుపోతే అవిలేని తమలాంటివారి గతి ఏమిటి?

ఇప్పటికే తన తమ్ముడు చంద్రం, మరిది

శంతన్‌లను చూస్తూనే వుందిగా... డిగ్రీలు పాసయ్యి ఏళ్ళు గడుస్తున్నా ఏ ఉద్యోగమూ వార్ని వరించలేదు.

మగపిల్లవాడికి పెళ్ళీడు దాటుతోన్నా ఉద్యోగం లేకుండా పెళ్ళి చేయడం ఎలా... అనే మీమాంస...

పోనీ, చెయ్యకుండా ఊరుకుందామా అంటే వయస్సులో వున్న మగపిల్లలు... ఈ సమాజమూ, ప్రకృతీ కలిసి కావలిసినంత స్వేచ్ఛను కట్టబెట్టిన మగపిల్లలు.

ఎప్పుడే తప్పటడుగు వేసి జీవితాన్ని ధ్వంసం చేసుకుంటారో అనే భయం.

పెళ్ళికాని ఆడపిల్లలతోపాటుగా పెళ్ళికాని, ఉద్యోగంరాని మగపిల్లలు కూడా తల్లిదండ్రుల గుండెలమీద కుంపట్లుగా మారుతున్నారు.

తమ బిడ్డలకు కనీసం ఏవ్యాపారమో, వ్యవహారమో చూపించేందుకు తగిన ఆర్థిక స్థోమత సమకూర్చలేని మధ్యతరగతి దౌర్భాగ్యం గురించి ఆలోచిస్తూ లక్ష్మి మనసు పాడుచేసుకుంటుంది ఎప్పుడూ. తన తమ్ముడు చంద్రం ఈమధ్య ఏవో సంఘాలతో సంబంధాలు పెట్టుకుంటోన్నట్లుగా చూచాయగా వింది. మీటింగ్‌లూ, సమావేశాలూ అంటూ ఇల్లు పట్టకుండా తిరుగుతున్నాడట. వీళ్ళ భవిష్యత్ తలచుకుంటూ లక్ష్మి వ్యథ చెందుతూంటుంది. ఆమె భయాలు విన్న సారథి నవ్వేస్తాడు.

"మనకు వున్నది ఒక్క పిల్లవాడు, ఎలాగోలా అవుతుందిలే... ఇప్పటినుండే ఈ దిగులు ఎందుకు..." అంటాడు.

"మన ఒక్క పిల్లాడి గురించీ కాదు నా దిగులు... మన శంతన్, చంద్రంవాళ్ళల్లాగే మరెంత మందో... వీళ్ళంతా ఏమవుతారు చెప్పండి..." అంటుంది.

"ఏరోజుకారోజు కాకపోయినా, ఏనెలకానెల అన్నట్లు గడుస్తోన్న మన సంసారంతో వాడికి మనం ఏ బ్రతుకు తెరువు చూపించగలం...?" లక్ష్మి చెప్పే విషయాలు నూటికి నూరుపాళ్ళు నిజాలే. నిజానికి అవి సారధికి తెలీనివికావు. స్త్రీ సహజమైన బేలతనంతో లక్ష్మి బయటపడినట్లుగా అతడు బైటపడడు.

ఆలోచించీ లాభంలేదనీ, చేయగలిగింది కూడా ఏమీ లేదనీ అతనికి తెలుసు. అందుకే "వాళ్ళావిడ తెచ్చే కట్నం డబ్బుతో వ్యాపారం చేసుకుంటాడులే..." అంటూ తేల్చివేయబోతాడు.

కానీ, లక్ష్మి మాత్రం సరిపెట్టుకోలేదు.

అందుకే ఆమె కొడుకు చదువు విషయంలో చాలా జాగ్రత్తలు తీసుకుంటుంది భవిష్యత్తును భద్రపరచాలనే ఆతృతతో.

★ ★ ★

తెల్లవారు ఝాము, ఐదున్నర గంటల ప్రాంతం...

లక్ష్మి అనిల్‌ను చదువుకోమంటూ నిద్రలేపుతోంది.

చాలా రాత్రి వరకూ భర్తతో కబుర్లు చెప్తూ ఏరాత్రి వేళో నిద్రలోకి జారిపోయే లక్ష్మికి నిజానికి అప్పుడు లేవాలని వుండదు. తను ఆరింటికి లేస్తే కొడుక్కు ఏడింటికి లేచే అలవాటు పడ్తుందని భయం. అందుకే అనిల్ కొరకు ఆమె బలవంతంగా తన బద్ధకాన్ని, నిద్రను జయిస్తుంది.

నిద్ర కళ్ళను బలవంతాన స్వాధీనంలోకి తెచ్చుకుని కొడుకుని లేపి పుస్తకాల ముందు కూర్చోబెట్టి తాను పనులు చూసుకుంటుంది.

అనిల్ చిన్న తరగతిలో వుండగా వాడిని చదివించడం హోంవర్క్ చేయించడం ప్రశ్నలు వేయడం వంటివి చేసినా వాడు ఆరు ఏడు తరగతులకు వచ్చేసరికి ఆ లెక్కలు... ఆ సిలబసు ఆమె నసాళానికి

అంటడం చేత ఇప్పుడు లక్ష్మి వాడ్ని చదువుకోమని చెప్పి కూర్చోబెడుతుందేతప్ప పుస్తకాల జోలికి వెళ్ళడం మానేసింది.

నిజానికి లక్ష్మి ఇంటరు పాసయినా తెలుగు మీడియం కాబట్టి వాడి ఇంగ్లీషు మీడియం ఆమె గొంతు పట్టేసింది.

"అనిల్ నాన్నా... లే... లేచి ముఖం కడుక్కుని, కూర్చుని చదువుకో..."

లక్ష్మి అనిల్‌ను బుజ్జగిస్తూ లేపే ప్రయత్నం చేస్తోంది. అనిల్‌కు చాలా బద్ధకంగా వుండి లేవబుద్ధి కావడంలా.

"లే... నాన్నా..."

అనిల్ బద్ధకంగా మసిలాడే తప్ప లేచే ప్రయత్నం చేయలేదు

"ఊం... లే... ఎంతసేపలా ముసులు తావు...?" ఈసారి తల్లి స్వరంలో లాలన లేకపోవడాన్ని గుర్తించిన అనిల్ చటుక్కున లేచి కూర్చున్నాడు. మెలకువ వస్తూనే వాడికి జ్ఞాపకం వచ్చిన మొదటి విషయం తండ్రి టి.వి. కొంటానన్నా తల్లి శనిలా అడ్డుపడుతోందని.

వెనువెంటనే తల్లిమీద విపరీతమైన కోపం ముంచుకు వచ్చింది. ఎంతసేపూ వెధవ చదువు... కాలకృత్యాలు తీర్చుకుని విసుగ్గా పుస్తకాలు ముందేసుకుని కూర్చున్నాడు అనిల్.

మనస్సుంతా టి.వీ. గురించిన ఆలోచనలతో నిండిపోగా ఏంచదువుతున్నాడో కూడా తెలీకుండా ఏడుగంటలవరకూ పుస్తకాల ముందు కూర్చున్నాడు. ఏడుగంటలకు పుస్తకాలు, సర్దుకుని తనపనులు చూసుకుని భోంచేసి స్కూలుకు బయలుదేరాడు.

"మమ్మీ..."

"ఊం" అనిల్ లంచ్ బాక్స్ సర్దుతూ పలికింది లక్ష్మి.

తోటకూర పప్పు చిన్ని బాక్స్‌లో పెట్టి ఆ చిన్న బాక్స్ అన్నం బాక్స్‌లో పెట్టి ప్రక్కనే ఓ ఉసిరికాయ పెట్టింది.

క్యారియర్‌లోని మరో చిన్న గిన్నెలో పెరుగూ అన్నం సర్దింది

"మమ్మీ..."

"ఏమిటి అనిల్?"

"అన్నం కలిపి బాక్స్‌లోపెట్టి స్పూన్ పెట్టు"

"అన్నం కలిపి బాక్స్‌లో పెట్టాలా...?" ఆశ్చర్యంగా అడిగింది లక్ష్మి.

"అవును మమ్మీ..."

"ఎందుకు...?"

"కలిపిన అన్నం స్పూన్‌తో తినడం ఈజీ కదూ...?"

"అలా ఎందుకు...?" లక్ష్మికి అనిల్ చెప్తున్నదేమిటో అర్థంకాలేదు.

"కలిపిన అన్నం అయితే స్పూన్‌తో ఈజీగా తినేయొచ్చుగా మమ్మీ" తల్లికి అర్థం అయ్యేలా చెప్పడానికి ప్రయత్నించాడు అనిల్.

"స్పూన్‌తో ఎందుకు తినాలి...?" అయోమయంగా అడిగింది.

"మా స్కూల్లో అందరూ అలాగే తింటారు మమ్మీ..."

లక్ష్మికి విషయం బోధపడింది.

టిఫిన్స్ తెచ్చుకున్నవాళ్ళు స్టైల్‌గా స్పూన్‌తో తింటారు. అలాగే అన్నం తెచ్చుకున్న వాళ్ళు కూడా అప్పటికప్పుడు కూరతో కలపడం కాకుండా కలిపి తెచ్చిన అన్నాన్నే స్పూన్‌తో స్టయిల్‌గా తింటారన్నమాట.

"ప్లీజ్! నాకూ అలాగే పెట్టు మమ్మీ..."

"అలా అన్నం బాగుండదు అనిల్..." అయిష్టంగా అంది లక్ష్మి.

"ప్లీజ్ మమ్మీ! అలాగే బాగుంటుంది. మా స్కూల్లో అందరూ అలాగే తింటారు"

"వాళ్లంతా ఎలా తింటేనేం...? నువ్వు మామూలుగా తినొచ్చుగా...?"

అనిల్ మౌనంగా వుండిపోయాడు.

లక్ష్మికి తన లాజిక్ తనకే నచ్చలేదు.

సహజంగా పిల్లలు ప్రతి చిన్న విషయానికీ సమవయస్కులతో పోటీ పడుతుంటారు. నలుగురితో సమంగా వుండలేకపోతే న్యూనత ఫీలవుతుంటారు.

అనిల్‌కు అర్థం అయ్యేలా చెప్తే...

"అనిల్ మధ్యాహ్నానికల్లా కూర కలిపిన అన్నం బాక్స్‌లో చల్లగా చప్పగా అయిపోయి తినబుద్ధి పుట్టదు నాన్నా"

అనిల్ తల వంచుకుని మౌనంగా బయటికి వెళ్ళిపోయాడు.

కానీ, వాడి ముఖంలో కవిపిస్తోన్న నిరాశ మాటేమిటి...?

వెంటనే వాడు కోరిన ప్రకారం కలిపిన అన్నం బాక్స్‌లో పెట్టి స్పూన్ వేసింది.

ఇప్పుడు కలిపిన ఈ అన్నం మధ్యాహ్నానికల్లా చల్లగా, చప్పగా అయిపోతుంది ఎలా తింటాడు?

ఏమిటో ఈ పిల్లల షోకులు... పనికి మాలిన అనుకరణలు...

లక్ష్మి బాధగా నిట్టూర్చింది.

లక్ష్మి లోలోపల విసుక్కుంటూనే వుంది. బాధపడుతూనే వుంది. బయటి గదిలో కూర్చుని 'సాక్స్' తొడుక్కుంటోన్న అనిల్ మనస్సు ధుమధుమ లాడుతోంది.

"ఛీ... ఛీ... ఏదడిగినా ఇంతే... టి.వి. అడిగినా అంతే. కలిపిన అన్నం పెట్టమన్నా అంతే... అన్నిటికీ పెద్ద సుత్తి కొడుతుంది. అడిగింది ఇవ్వకపోగా ముందు ఈ సుత్తి వినలేక చావాలి.

అసలు ఈ మమ్మీలందరూ ఛస్తే ఎంత బాగుండును. హాయిగా ఇష్టం వచ్చినట్లు ఎంజాయ్ చెయ్యొచ్చు. స్వేచ్ఛగా వుండొచ్చు ఏదో... ఏదో ఊహించుకుంటూ కోపంగా 'షూ' తొడుక్కున్నాడు.

పుస్తకాల సంచీ, టిఫిన్ బాక్సు తీసుకుని స్కూలుకు వెళ్ళిపోయాడు. కొడుకు ముఖంలో కోపచ్ఛాయలు గమనించిన లక్ష్మి, 'అబ్బ... ఏం పిల్లలో... అన్నదే తడవుగా అన్నీ అయిపోవాలి. ఏమాత్రం కాస్త అటూ ఇటూ అయినా ముఖం మాడ్చేసుకుంటారు' అనుకుంది.



ఉదయం తొమ్మిది గంటల ప్రాంతం.

స్కూలుకు వచ్చాడన్న మాటేగానీ మాథ్స్ హోంవర్క్ చేయనందుకు అనిల్ గుండె పీచుపీచుమంటూనే వుంది. భారతీదేవి మేడం గుర్తుకు వచ్చి ఒళ్లు వణుకుతోంది.

"సుభాష్! నువ్వు మాథ్స్‌హోం వర్క్ చేశావా?"

"ఓ..."

"నేను చెయ్యలేదు" లో గొంతుతో భయంగా అన్నాడు అనిల్.

"నేను చేశానుగా... తీసుకుని ఎక్కించుకో"

"స్వంతంగా చెయ్యలేదని తంతారేమో" భయంగా అన్నాడు అనిల్.

"గాడిదగుడ్డుకదూ! అసలు నిన్ను అడగరు. నువ్వు ఓన్‌గానే చేస్తావనుకుంటారు.

అంతగా అడిగితే ఓన్‌గానే చేశానని చెప్పు"

ఈ సలహా అనిల్‌కు బాగా నచ్చింది. వెంటనే సుభాష్ నోట్సు తీసుకుని లెక్కలన్నీ మక్కీకి మక్కీ ఎక్కించుకున్నాడు.

"సుభాష్ లెక్కలన్నీ కరెక్టేనా? "

"అన్నీ కరెక్టే. మా ట్యూషన్ మాస్టారు చేశారు తప్పులెందుకుంటాయి? " అనిల్ తృప్తిపడ్డాడు.

ఆవిధంగా ఆ రోజు లెక్కల గండం గడిచింది.

ఆరోజు ఇంటర్వెల్‌లో ఐస్‌క్రీం ఇప్పించే కార్యక్రమం నవీన్ తీసుకున్నాడు. అయితే రోజూ ఇలా వాళ్లూ వీళ్లూ ఇప్పిస్తుంటే తీసుకోవడం అనిల్‌కు సిగ్గుగా వుంది.

తనూ ఒకరోజు వాళ్లకు ఇప్పించగలిగితే ఎంత బాగుండును. వాళ్లందరికీ ఇన్నిన్ని రూపాయలు ఖర్చు చేసేందుకు ఎలా వస్తాయో... వాళ్ల మమ్మీ, డాడీ ఏమీ అనరా?

ఎప్పుడైనా డాడీ ఓ అర్ధరూపాయి ఇవ్వబోతే వెంటనే మమ్మీ, "ఎందుకండీ అలా డబ్బు ఇవ్వడం నేర్పితే వాడికి చిరుతిండి కొనుక్కు తినడం అలవాటు అవుతుంది" అంటుంది.

"పోనీలే ఈ ఒక్కరోజుకూ" అని డాడీ అంటే, "ఈ ఒక్కరోజు కొనుక్కు తిన్న పిల్లాడికి రేపు కొనుక్కుతినాలని అనిపించదా? రోజూ మనం ఇవ్వగలమా" అని ఆర్భ్యా చేస్తుంది.

ఎప్పుడైనా చంద్రం మామయ్య వచ్చినప్పుడు డబ్బు ఇవ్వబోతే, వెంటనే మమ్మీ, "ఎందుకురా వాడికి అలా డబ్బు తీసుకోడం నేర్పుతావూ? ఇక ఇంటికి ఎవరు వచ్చినా ఆశగా ఎప్పుడిస్తారా అన్నట్లు ఎదురు చూస్తుంటాడు" అంటుంది కోపంగా.

"పోనీలే అక్కా! పరాయివాళ్ల దగ్గర ఎందుకు తీసుకుంటాడు? ఏం నీలూ బయటివాళ్ల దగ్గర తీసుకోకూడదేం" అంటూ నోటు జేబులో పెట్టాడు.

వెంటనే మమ్మీ, "నీలూ! అంత డబ్బు ఏం చేసుకుంటావ్... నీ కిడ్డీబ్యాంక్‌లో దాచుకో... ఏం? " అంటూ తన చేతిలో ఓ రూపాయి వుంచి మిగిలిన డబ్బు కిడ్డీ బ్యాంక్‌లో వేయిస్తుంది.

అబ్బ... అప్పుడు తనకెంతకోపం వస్తుందనీ... కళ్లంబట నీళ్లు కూడా వచ్చేస్తాయి... కానీ బలవంతంగా ఆపుకుంటాడు.

ఛీ...ఛీ మమ్మీకెంత చుప్పనాతితనమో... కుళ్లు. తనకు మామయ్య డబ్బు ఇస్తే ఈమె సొమ్మేం పోయిందో.

వెధవది కిడ్డీ బ్యాంక్ ఒకటి తన ప్రాణానికి "ఒరేయ్ అనిల్! ఈ ఐస్‌క్రీం తీసుకో కారిపోతోంది" అరిచాడు నవీన్. తల్లి కుళ్లుబోతుతనాన్ని గురించి ఆలోచిస్తున్న అనిల్ ఉలిక్కిపడ్డాడు.

"నాకు వద్దు నవీన్" మొహమాటంగా అన్నాడు అనిల్.

"ఏం? " తెల్లబోతూ అడిగాడు నవీన్.

"నాకు నాకు జలుబుచేసింది" తడబడుతూ చెప్పాడు అనిల్.

"కాదురా! అనిల్‌గాడు మొహమాట పడ్తున్నాడు" చిచ్చరపిడుగు వేణు అసలు రహస్యం కనిపెట్టేశాడు.

"మొహమాటమా? "

"అవును" ఖచ్చితంగా అన్నాడు వేణు.

"ఎందుకు? "

"ఎందుకంటే రోజూ మనమే ఇప్పిస్తున్నాం కదా! అందుకు"

"అయితే ఏం? ఒక రోజు వాడ్నీ ఇప్పించమను" తేలికగా అనేశాడు సుభాష్ అదో పెద్ద విషయం కానట్లు.



"మరి మనకిప్పించేందుకు వాడి దగ్గర డబ్బులుండవుగా"

అందరూ అనిల్ వంక సానుభూతిగా చూశారు ఐస్‌క్రీం తింటూ అభిమానంతో. అనిల్ శిరస్సు ఒంగిపోయింది.

"పోనీ అనిల్ మాకు ఇప్పించవద్దులే తీసుకో"

"అనిల్! ఫ్రండ్స్‌లో అలాంటివి వుండకూడదు. నువ్వు ఇప్పించకపోయినా ఫరవాలేదు. ఇదిగో.. తీసుకో" సుభాష్ అనిల్ చేతిలో ఐస్‌క్రీం వుంచబోయాడు.

"వద్దు" అనిల్ బలహీనంగా అన్నాడు.

"నువ్వు తీసుకోకపోతే గాడ్ ప్రామిస్సే"

"అవును గాడ్ ప్రామిస్సే" అందరూ ముక్తకంఠంతో 'గాడ్ ప్రామిస్' చెప్పారు.

అనిల్‌కు ఐస్‌క్రీం తీసుకోక తప్పలేదు.

★ ★ ★

"ఇవ్వాళ సూర్యకాంతం స్కూలుకు రాలేదేంరా?" సుభాష్ రాజును అడిగాడు. సూర్యకాంతం స్కూలుకు రానందుకు అతనికి అతని మిత్రబృందానికి చాలా ఆనందంగా వుంది.

"ఏమో మరి"

"సూర్యకాంతం ఎవరు సుభాష్?" అనిల్ అడిగాడు.

"సూర్యకాంతం అంటే తెలీదూ? షేమ్" నవీన్ నవ్వాడు.

"సూర్యకాంతం అంటే మన మాథ్స్ మేడం" వేణు వివరించాడు.

"ఆవిడపేరు భారతీదేవికదా?"

సుభాష్ బృందం వివరించలేదు.

"జయసుధ శోభన్‌బాబుకు లైట్ కొడుతోందిరోయ్"

"వాళ్ళిద్దరూ దొంగచాటుగా నవ్వుకుంటారు తెలుసా?"

"ఓ...నాకెందుకు తెలీదూ? వాళ్ళిద్దరూ స్లిప్పులు కూడా రాసుకుంటారు"

"వాళ్ళయితే అలా చెయ్యొచ్చుగానీ మనం మాత్రం ఆడపిల్లలవైపు చూస్తేనే తంతారు" అనిల్ స్నేహితుల ఈ సంభాషణ అంతా మౌనంగా వింటున్నాడు. కానీ అతనికి ఏమీ అర్థం కాకుండా వుంది. ఈ జయసుధ ఎవరో, శోభన్‌బాబు ఎవరో లైట్ కొట్టడం ఎందుకో.. బొత్తిగా తెలీడంలేదు. అడిగితే సొరకాయ్ అంటారనే భయం.

"నేనో రహస్యం చెప్పనా?" వేణు అన్నాడు తనకూ ఓ ముఖ్యమైన విషయం తెలుసు అన్నట్లు.

"చెప్పు" నవీన్ తప్ప మిగిలిన అందరూ ఆసక్తి ప్రదర్శించారు.

"మళ్ళీ ఎవరితోనూ చెప్పొద్దు"

"చెప్పం"

"గాడ్ ప్రామిస్?"

"గాడ్‌ప్రామిస్" అందరూ ఒట్టు పెట్టుకున్నట్లుగా తల మీద చెయ్యి పెట్టుకున్నారు.

"మరేమో మొన్న లైబ్రరీ హాల్లో బీరువాల వెనక శోభన్‌బాబు జయసుధను కావిలించుకుంటుంటే చూశా"

"రియల్లీ" అన్ని గొంతులూ ఒకేసారి అన్నాయి నవీన్, అనిల్ తప్ప.

"రియల్లీ"

అనిల్‌కు ఈ శోభన్‌బాబు, జయసుధ ఎవరో తెలీనందుకు ఎక్కువ విచారంగా కొంచెం అవమానంగా వుంది.

వేణు ఓ కొత్తవార్త చెప్పి ఫ్రండ్స్ అందరి అటెన్షన్ ఆకర్షించడంతో నవీన్‌కు తనూ ఏదైనా కొత్త విషయం చెప్పి అందరి దృష్టినీ ఆకర్షించాలనే కోరిక కలిగింది.

కోరిక కలగడమే తరువాయిగా ఓ చక్కని కథ అల్లేశాడు.

"ఓస్ అదేనా నేనైతే అంతకంటే పెద్దదే




# ఏరిన ముత్యాలు

★ బాగా తినడంద్వారా మానవుడు బలిష్టుడైనట్లే బాగా చదవడంద్వారా వివేకవంతుడవుతాడు

-జెరిమికోలెరిల్

★ ఇతరుల కోసం జీవించేవాడు నిజంగా జీవించి వుంటాడు

-వివేకానంద

★ స్వాతంత్ర్యం ఒక దేశానికి మరొక దేశం యిచ్చే కానుకకాదు

-గాంధీ

★ ఒక వ్యక్తి పరిణామం అతనితో ప్రత్యక్షంగానో, పరోక్షంగానో సంబంధం ఉన్న తదితరులందరి పరిణామాన్నిబట్టి వుంటుంది

-మార్క్స్ ఏంగెల్స్

★ సహనమే సంస్కృతి

-డా॥సర్వేపల్లి రాధాకృష్ణన్

★ అన్వేషణ మానవుని గమ్యాన్ని చేరుస్తుంది

-ఒక సూక్తి

★ కిరీటం ధరించిన శిరస్సు శాంతికి నోచుకోదు

-షేక్స్‌పియర్

★ రాజకీయాలు ఒక శాస్త్రం మరియు ఒక కళ

-లెనిన్

★ ఆకలితో అలమటించేవాడు దేశభక్తుడు కాజాలాడు

-బ్రౌన్

★ చట్టాలు పేదవారిని రాసి రంపాన పెడతాయి. ధనవంతులు చట్టాలను శాసిస్తారు

-గోల్డ్‌స్మిత్

★ భూమిమీద మానవునిగా పుట్టడంకంటే అద్భుతమైనది ఏదీలేదు

-గోర్కీ

★ ఎంత చూసినా ఒకే వంశం వుంది. అదే మానవవంశం

-జార్జిమూర్

★ సంఘంలో జీవించలేనివాడు, లేదా తాను స్వయం పోషకుడైనందువలననే సంఘంతో నిమిత్తం లేకుండా జీవించేవాడు పశువో, దేవతో అవుతాడు

-అరిస్టాటిల్

★ మానవలోకాన్ని మించిన పార్యగ్రంథం మరొకటిలేదు

-సామెత

సేకరణ: షేక్ సాదిఖ్‌షా




ఈ శీర్షికద్వారా ప్రతినెలా 'చతుర'లో వెలువడే నవలను సమీక్షించే అవకాశాన్ని కల్పిస్తున్నాం. పాఠకులు తమకు నవల ఎందుకు నచ్చిందో లేదా ఎందుకు నచ్చలేదో వివరిస్తూ రచన బాగోగులు గురించి రాయాలి. సమీక్షలు రాసేవారు కథ మొత్తం మళ్ళీ చెప్పకుండా, అవసరమైనమేరకే ప్రస్తావిస్తూ రాయాలి.

1. సమీక్ష అరఠావుకి మించకుండా కాగితానికి ఒకవైపునే రాయాలి.
2. ఏ నెల సమీక్ష ఆ నెల 20వ తేదీలోపు మాకు అందేటట్లు పంపాలి.
3. మీ సమీక్షకు తప్పనిసరిగా ఈ కింది కూపన్ జతపరచాలి.
4. కవరుపై 'చతుర సమీక్ష'కు అని పేర్కొని ఎడిటర్, 'చతుర', ఈనాడు కాంపౌండ్, హైదరాబాద్-500 482 అనే చిరునామాకు పోస్ట్‌చేయాలి.

**మాకు సకాలంలో అందిన సమీక్షలలో ఎన్నికచేసిన అయిదు ఉత్తమ సమీక్షలకు రు. 100/- ప్రథమ బహుమతి, రు: 75/- ద్వితీయ బహుమతి, రు: 50/- చొప్పున మూడు తృతీయ బహుమతులను అందజేస్తున్నాం. పాఠకుల పరిశీలనాశక్తిని, రచనాసక్తిని పెంచే లక్ష్యంతో ఏర్పాటుచేసిన ఈ సమీక్షా రచనలో పాల్గొని ఈ అవకాశాన్ని సద్వినియోగం చేసుకోగోరుతున్నాం.**

★ కొందరు బహుమతి విజేతలు తమ బహుమతి తాలూకు చెక్కు అందలేదనీ, అడ్రసు మారిందనీ రాస్తున్నారు. బహుమతి మొత్తాలు ప్రతినెలా మొదటివారంలోనే పంపుతున్నాం. అడ్రసుల విషయంలో కూపన్‌లో రాసేటప్పుడే జాగ్రత్తపడటం మంచిది. ఈ విషయంలో ఉత్తర ప్రత్యుత్తరాలు సాధ్యంకాదు.

**కూపన్**

**నవంబర్ చతుర నవల కాన్వెంట్**

.......................................................

**సమీక్షకుని పేరు :** .......................................................

**చిరునామా :** .......................................................

.......................................................

.......................................................

.......................................................

చూశా"

"ఏమిటి?" వేణు తప్ప అందరూ కుతూహలం నింపుకున్న కళ్లతో నవీన్ వంక చూశారు.

నవీన్‌కు కావల్సింది అదే.

"మళ్లీ ఎవరికీ చెప్పొద్దు"

"చెప్పం"

"గాడ్‌ప్రామిస్ వెయ్యండి" అంటూ అందరితో చేతిలో చెయ్యివేయించుకున్నాడు.

"త్వరగా చెప్పు" విసుక్కున్నాడు సుభాష్.

"మరేమో మొన్న సైన్స్ లాబ్‌లో శోభన్‌బాబు, జయసుధ బూతు పని చేస్తోంటే చూశా"

"నిజంగా...?" కళ్లు పెద్దవి చేసుకుని అడిగారు పిల్లలంతా. ఈసారి వేణుకూడా కుతూహలాన్నీ, ఆశ్చర్యాన్నీ ఆపుకోలేకపోయాడు.

"నిజం... నా కళ్లారా చూశాను"

"ఏం చేశారురా?" ప్రకాష్ అడిగాడు.

నవీన్ కొంచెం ఇబ్బంది పడుతూ ప్రకాష్ చెవిలో ఏదో చెప్పాడు... అంతే మిగిలిన పిల్లలు కూడా అత్యుత్సాహంగా వారివారి చెవులను నవీన్ నోటి దగ్గరకు చేర్చేశారు.

అయితే నవీన్ చెవిలో చెప్పిన విషయం వేణు నమ్మలేదు. సహజంగా నవీన్ అంటే వుండే వైరభావమే అతన్ని అలా నమ్మకుండా చేసింది.

"మొన్నా?" అడిగాడు వేణు.

"అవును మొన్న ఆఫ్టర్‌నూన్"

"అరేయ్ వీడు కోతలు కోస్తున్నాడురా" డిక్లేర్ చేశాడు వేణు.

"నువ్వే కోతలు కోసేది" రోషంగా అన్నాడు నవీన్.

"వందసార్లు నువ్వే కోతలు కోసేది"

"వెయ్యిసార్లు నువ్వే కోతలు కోస్తావు"

"నువ్వు చూడలేదు బెట్"

"బెట్ నేను చూశాను"

"బెట్"

"బెట్"

"ఎంతెంత...?"

"ఎంతెంత...?"

"అసలు మొన్న స్కూలు వుందా అని. ఆ వేళ ఏదో ఫెస్టివల్ అయితే హాలీడే ఇచ్చారుకదా" వేణూ క్లూ బయట పెట్టాడు. అవును కదూ.. అన్నట్లుగా మిగిలిన వారంతా నవీన్ వైపు అనుమానంగా చూశారు.

నవీన్‌కు వేణూను చంపేద్దామన్నంత కోపం వచ్చింది.

అయితే ఇంత చర్చ జరిగినా అనిల్‌కు జయసుధ, శోభన్‌బాబులు ఎవరో అర్థం కాలేదు. అయినా అడిగేందుకు భయపడి మౌనంగా వుండిపోయి ఆ తరువాత లంచ్ అవర్‌లో సుభాష్‌ను వంటరిగా పట్టుకుని జయసుధ ఎవరో, శోభన్‌బాబు ఎవరో తెలుసుకున్నాడు. శోభన్‌బాబు సోషల్ సార్, జయసుధ సైన్స్ మేడం"

★ ★ ★

లక్ష్మి రాత్రి వంట ప్రయత్నంలో వుంది.

సారధి ఏమీ తోచనట్లుగా ఇంట్లోకీ బయటికీ రెండుసార్లు తిరిగాడు.

బంగాళాదుంపలు చెక్కు తీస్తోన్న లక్ష్మి అతన్ని చూసి నవ్వుతూ "ఏమిటి...?" అంది.

"వంట అయిపోయిందా...?"

"ఆc... అయిపోవచ్చింది. ఇదిగో ఈ బంగాళాదుంపలు రెండూ వేయిస్తే సరి. అయిపోయినట్లే"

"త్వరగా కానివ్వు"

"ఏం? ఆకలి వేస్తోందా...?"

"కాదు... సినిమాకు వెడదాం"

"ఇప్పుడా...?"

"ఇంకా గంట టైం వుంది. త్వరగా తెమిలితే వెళ్ళగలం"

లక్ష్మి ఇబ్బందిగా ముఖం పెట్టింది.

"ఏమిటి...కాస్ట్రాయిల్ ఫేసు పెట్టావ్?"

"అనిల్"

"వాడు చదువుకుంటుంటాడ్లే..."

అనిల్‌ను ఒంటరిగా వదిలి వాడి కళ్ల ముందే ఇద్దరూ సినిమాకు వెళ్ళడం లక్ష్మికి ఇష్టం వుండదు. వాడి చిన్ని మనస్సు ఎంత కష్టపెట్టుకుంటుందో అనుకుంటుంది.

లక్ష్మి మౌనాన్ని సారధి అర్థం చేసుకున్నాడు.

నిజానికి లక్ష్మికి సినిమాలంటే ఎంతో ఇష్టం. కానీ, సినిమాకు వెళ్దాం అనే ప్రతిపాదన వచ్చిన ప్రతిసారీ ఆమె జవాబు ఇలాగే వుంటుంది..

పెళ్లయిన కొత్తలో ఇద్దరూ కలిసి ఏం చూశారో... కానీ అనిల్ పుట్టినప్పటినుండీ ఇద్దరూ కలిసి సినిమాకు వెళ్ళడం అనేది చాలా అరుదైన విషయంగా మారింది.

ప్రతిసారీ... అనిల్ ఎలా? అనే సమస్యే ఎదురయ్యేది.

లక్ష్మికి ఒంటరిగా వెళ్ళి సినిమా చూసే అలవాటు లేదు... ఇరుగూ పొరుగుతో అసలే వెళ్లదు.

లక్ష్మి లేకుండ సారధికి వెళ్ళాలనిపించదు.

ఇదీ వారి సినిమా బాధ.

"పోనీ, సెకండ్‌షోకు వెడదామా... అనిల్ నిద్రపోతుంటాడుకదా?"

"అబ్బే వద్దండీ. ఏ రాత్రప్పుడయినా నిద్ర లేచి చూస్తే మనం లేకపోతే?"

"వాడు మరీ అంత పసివాడేం కాదు. నిద్ర లేచి ఝడుసుకునేందుకు" విసుగ్గా అన్నాడు సారధి.

"ఝడుసుకుంటాడని కాదు"

"మరి?"

"ఫీలవుతాడని" నెమ్మదిగా అంది లక్ష్మి.

"పోనీ, వాడ్ని కూడా తీసుకువెడదామేమిటి?"

"వాడా?" అదిరిపడింది లక్ష్మి.

"ఒక్క సినిమా చూస్తే ఏమీ మునిగిపోదులే"

"భలేవాళ్ళు ఇవ్వాళా రేపూ సినిమాలు పిల్లలు చూసేలా వుంటున్నాయా? అలాంటి సినిమాలు పిల్లలు చూస్తే ఇంకేమయినా వుందా?"

"అబ్బబ్బ ప్రపంచంలోని అనుమానం అంతా నీకే వుంది" విసుక్కున్నాడు సారధి.

"ఇంతకూ ఏం సినిమా...?"

సారధి చెప్పాడు.

"అయ్యో! ఆ సినిమానిండా ద్వంద్వార్థపు మాటలూ, పాటలేనట. అలాంటి సినిమాలకు పిల్లల్ని తీసుకువెడితే ఇంకేమయినా వుందా?"

ఏ సినిమా అయితే అనిల్ చూస్తే పాడయిపోతాడని లక్ష్మి భయపడుతోందో అదే సినిమా వారంక్రితమే అనిల్ వీడియో కేసెట్‌లో చూశాడని తెలిస్తే లక్ష్మి గుండె రక్త ప్రసరణ వేగం పెంచేసి బి.పి. తెచ్చుకునేదేమో.

సహజంగా లక్ష్మి పిల్లలు చూడదగ్గ సినిమాలు కొన్ని ఎన్నికచేసి వాటికి అనిల్‌ను అతని స్నేహితులతో పంపడమో, లేక తామిద్దరూ వెంట బెట్టుకు వెళ్లి చూపించడమో చేస్తుంటుంది. పక్కగదిలో పుస్తకాల ముందు కూర్చున్న అనిల్‌కు తల్లీ-తండ్రీ సంభాషణ మొత్తం వినిపిస్తూనే వుంది.

పుస్తకాల ముందునుండి లేచి అక్కడికి వచ్చాడు.




"మమ్మీ..." నెమ్మదిగా పిలిచాడు అనిల్.

"ఏమిటి నాన్నా..."

"డాడీ నువ్వూ సినిమాకు వెళ్ళండి. నేను ఇంట్లో వుండి చదువుకుంటాను" లక్ష్మి సంతోషంతో పొంగిపోయి, "మా నాన్నే" అంటూ అనిల్ తల ప్రేమగా నిమిరింది.

సారధి పితృహృదయం లోలోన గర్వప డింది.

పిల్లలు ఎవరైనా తల్లిదండ్రులు సినిమాకు వెళ్తామంటే ఏడ్చి గోలపెడ్తుంటారు. మరి కాస్త పెద్ద పిల్లలు అయితే ముఖం మాడ్చు కుని కూర్చుంటారు. కానీ అనిల్ ఎంతో బుద్ధిగా తల్లిదండ్రులను సినిమాకు వెళ్ళిర మ్మంటున్నాడు.

మరోసారి ఆ దంపతులు తమ పెంపకం లోని విశిష్టతకు మనస్సులోనే గర్వపడ్డారు ఎవరికివారు.

"వెళ్ళండి మమ్మీ... టైం అయిపోతోంది" త్వరపెట్టాడు అనిల్.

"వద్దులే నాన్నా... ఇప్పుడు సినిమాకు ఏం వెడతాం?" అంటూ తేల్చేసింది లక్ష్మి ఎప్పటిలాగే.

ఎందుకో ఆ క్షణాన సారధికి కూడా కొడు కును వదిలి సినిమాకు వెళ్లాలనిపించలేదు.

ప్రతిసారిలాగే అప్పుడూ సారధీ-లక్ష్మిల సినిమా ప్రోగ్రామ్ అలా ముగింపుకొచ్చింది.

★ ★ ★

సాయంత్రం నాలుగు గంటలయ్యింది.

విద్యార్థులు ప్లేగ్రౌండ్‌లో ఆటల్లో-మా టల్లో మునిగిపోయారు.

"రేపు నేను స్కూలుకు డుమ్మా కొట్టేస్తు న్నానోచ్" సుభాష్ తన మిత్రబృందం మధ్య ప్రకటించాడు.

"ఎందుకు?" అందరూ కుతూహలంగా అడిగారు.

"రేపు భారత్- పాకిస్తాన్‌ల మధ్య క్రికెట్ మ్యాచ్ తెలుసా...?"

"అయితే...?" అనిల్ అడిగాడు.

"సోది సొరకాయ్" అన్నాడు వేణు.

అందరూ నవ్వారు.

అనిల్‌కు కళ్లల్లో నీళ్లు తిరిగాయి. బలవం తంగా ఆపుకున్నాడు.

"రేపు మనం స్కూలుకు డుమ్మా కొట్టి మ్యాచ్ చూస్తామన్నమాట" వివరించాడు సుభాష్.

అనిల్‌కు వాళ్ళంతా తనను "సోది సొర కాయ్" అన్నందుకు కోపంగా వున్నా మ్యాచ్ గురించి తెలుసుకోవాలనే ఉత్సాహంతో కోపాన్ని దిగమ్రింగాడు. ఫ్రండ్స్ అన్నా తప్పులేదనీ, స్పోర్టివ్‌గా తీసుకోవాలనీ సర్దిచె ప్పుకున్నాడు.

"రేపు మీ టీ.వీ.లో మ్యాచ్ వుందా సుభాష్?" ఆసక్తిగా అడిగాడు. కుతూహ లంతో చక్రాల్లాంటి వాడి కళ్లు మరింత విశా లమయ్యాయి. అనిల్ ప్రశ్నకు అందరూ నవ్వారు.

అనిల్‌కు తన తప్పు అర్థం అయ్యింది.

అయితే "సచిన్ టెండూల్కర్ కూడా ఆడ తాడు కదూ...?"

"నువ్వు నిజంగానే సొరకాయవురా అనిల్. అసలు మన భారత టీమ్‌కు కెప్టెనే అతనుకదా?" అతిశయంగా అన్నాడు నవీన్.

"ఏంకాదు... భారత్ టీమ్ కెప్టెన్ రాహుల్ ద్రావిడ్" అందుకున్నాడు వేణు.

"ఏంకాదు సచినే"

"కాదు రాహులే"

"సచిన్... బెట్"

"బెట్ రాహుల్"

"బెట్"

"బెట్"

"ఎంతెంత...?"

"ఎంతెంత...?"

"నువ్వే చెప్పు"

"నువ్వే చెప్పు"

వేణూ, నవీన్ ప్లేగ్రౌండ్‌లో పెద్దగా అరుచుకుంటున్నారు. అనిల్‌కు భయం వేసింది. వాళ్ళిద్దరూ కొట్టుకుంటారేమో అని.

వాళ్లిద్దరూ అలా అరుచుకోవడం చూసి చుట్టూ విద్యార్థులు గుంపు కట్టారు. గుంపు కట్టిన విద్యార్థుల్లో కూడా కొంతమంది వేణు వైపు, మరికొంతమంది నవీన్‌వైపు చేరి "భారత క్రికెట్ కెప్టెన్" గురించి వాదించుకుంటున్నారు. అంతా గోలగోలగా తయారయ్యింది.

ఆటల్లో పిల్లలెందుకో కొట్టుకుంటున్నారని పి.టి. సార్ పరుగెత్తుకుంటూ వచ్చాడక్కడికి ఏమిటి? ఏమిటి అంటూ.

"ఏం కాదు..."

"ఏం కాదు..."

గుంపు మధ్యలో వేణు నవీన్ రొప్పుతూ అరుచుకుంటున్నారు.

"ఏమిటి?" పి.టి. సార్ అడిగాడు.

"సార్‌ను అడుగుదాం..."

"అడుగుదాం..."

పందెపు కోళ్లల్లా రొప్పుతోన్న వాళ్లను చూస్తూ "ఏమిట్రా?" అంటూ కోపంగా అడిగారు పి.టి. మాస్టారు.

"సార్! ఇండియా క్రికెట్ టీమ్ కెప్టెన్" రొప్పుతూ అడిగాడు నవీన్.

"సచిన్ టెండూల్కర్ కాదా సర్..." ఆవేశంగా అందుకున్నాడు వేణు.

"అవును... అయితే ఏం?"

"ఇందాకట్నించి వాడు నన్ను అదరగొడ్తున్నాడు సర్"

పి.టి. మాస్టారుకు అర్థం అయ్యింది.

"స్టుపిడ్స్. అందుకోసం కొట్టుకొని ఛస్తున్నారా?" అంటూ చెరో మొట్టికాయ ప్రసాదించి, తను మరో గేమ్ జరిగేచోటికి వెళ్ళిపోయారు. విజయగర్వంతో వేణు ముఖం వికసించగా నవీన్ ముఖం మాడిపోయింది. వాడి అవమానాన్ని తన కింది పెదవిపై చూపిస్తున్నాడు కసిగా.

"వేణూ! రేపు మా ఇంటికి వస్తావా... మ్యాచ్ చూద్దాం" సుభాష్ అడిగాడు.

విజయగర్వంతో పొంగిపోతోన్న వేణు వెంటనే "వస్తాను" అన్నట్లుగా తల ఊపాడు. సుభాష్ నవీన్‌ను కాకుండా ముందుగా తననే అడిగినందుకు మరింత గర్వాన్ని పెంచుకున్నాడు నిమిషాల్లో.

"నేను కూడా వస్తాను" ప్రకాష్ అన్నాడు.

"ప్రకాష్ నేను మీ ఇంటికి వస్తాను. ఇద్దరం కలిసి సుభాష్ ఇంటికి వెడదాం. ఏం?" రాజు అన్నాడు.

అందరూ కలిసి తనను వెలివేసినట్లు ఫీలయిన నవీన్ వెంటనే "అనిల్ రేపు మా ఇంటికి వస్తావా... మ్యాచ్ చూద్దాం. మా ఇంట్లో కలర్ టి.వి. వుంది" అన్నాడు.

"రేపు స్కూలు వుందిగా" అనిల్ అనుమానం.

అయితే ఈసారి నవీన్ "సోది సొరకాయ్" అంటూ అనిల్‌ను వెక్కిరించలేదు.

"వెధవ స్కూలు ఒక్కరోజు వెళ్లకపోతే ఏం పోయింది? రేపు స్కూలు లేదని చెప్పేయ్" సుభాష్ చెప్పాడు.

"ఎలా? మా ఇంటిపక్క వాళ్ళబ్బాయి ఈ స్కూల్లోనే ఫిఫ్త్‌క్లాస్ చదువుతున్నాడు. మా బస్‌లోనే వస్తాడు"

అందరూ రెండు క్షణాలు తీవ్రంగా ఆలోచించారు.

"ఐడియా..." నవీన్ అరిచాడు.




"ఏమిటి?" అందరూ ఒకేసారి అడిగారు.

"అనీల్! నువ్వు ఎర్లీగా రెడీ అయివుండు నేను మీ ఇంటికి వస్తాను"

"మమ్మీకి ఏమని చెప్తావు?"

"ఏదో ఒకటి నేను చెప్తాగా. రేపు నువ్వే చూడు"

"అయితే మీ ఇద్దరూ కలిసి రేపు మా ఇంటికి వచ్చేయండిరా. అందరం కలిసి మ్యాచ్ చూద్దాం. మా మమ్మీ డాడీ కూడా ఇంట్లో వుండరు" సుభాష్ డిక్లేర్ చేశాడు.

నవీన్ సంతోషంగా ఒప్పుకున్నాడు.

తిరిగి గుంపులో కలిసిపోయినందుకు వాడికి ఆనందంగా వుంది. ఒక్క ఐదు నిముషాలే. అయితేనేం. వాళ్ళందరూ తనను బాయ్‌కాట్ చేయడం నవీన్ భరిం చలేకపోయాడు.

అనిల్‌కు రేపు తను క్రికెట్ మ్యాచ్ చూడబోతున్నందుకు కాస్త భయంగానూ ఎక్కువ సంతోషంగానూ అనిపించింది.

ఇదీ అని తెలీని టెన్షన్‌లో ఆ రాత్రి కలత నిద్రలోనే గడిపాడు.

ఉదయం-

మొదటి పిలుపుకే నిద్రలేచి త్వరత్వరగా కాలకృత్యాలు తీర్చుకుని పుస్తకాలు ముందు వేసుకుని చదువుకుంటోన్న అనిల్‌ను చూసిన లక్ష్మి మాతృహృదయం ఆనం దంతో ఉప్పొంగిపోయింది. తన పెంపకం లోని విశిష్టతకు లోలోపల ఓ క్షణం గర్వప డింది కూడా. అనిల్ కళ్లముందు తెరచివుం చిన పుస్తకం అయితే వుందిగానీ ఊహలన్నీ చూడబోయే మ్యాచ్ చుట్టే పరిభ్రమిస్తు న్నాయి.

తను కూడా బాగా క్రికెట్ నేర్చుకుని...

ఓహ్ ఎంత బాగుంటుంది!

ఔనూ! చిరంజీవి గొప్పా...?

తను ఫిఫ్త్‌క్లాసువరకూ చిరంజీవే కావాల నుకున్నాడు.

అనిల్ కళ్లు పుస్తకాన్ని చూస్తోంటే మెదడు "కావాలా? చిరంజీవి కావాలా?" అని ఆలోచిస్తోంటే చెవులు మాత్రం నవీన్ పిలుపు కొరకు ఎదురుచూస్తున్నాయి.

"ఆంటీ! అనిల్ వున్నాడా?" బయట వరండాలో నవీన్ లక్ష్మిని అడుగుతు న్నాడు. అనిల్ ముఖం ఆనందంతో వికసిం చింది. అయినా బుద్ధిగా చదువుకుం టోన్నట్లుగా అక్కడే కూర్చున్నాడు కదల కుండా.

"ఉన్నాడు బాబూ! చదువుకుంటున్న ట్లుంది." తల్లి జవాబు చెప్తోంది.

"ఇంకా రెడీ కాలేదా... ఆంటీ...?"

"రెడీ అయినట్లే వుంది. అయినా ఇంత త్వరగా దేనికి?"

"ఈవేళ మాకు ప్రైవేట్ క్లాస్ తీసుకుంటు న్నారు. త్వరగా రమ్మన్నారు. అనిల్ చెప్ప లేదా ఆంటీ?"

"లేదే.... కూర్చో.. పిలుస్తాను"

లోపలికి వెళ్ళిన లక్ష్మి బుద్ధిగా చదువు కుంటోన్న కొడుకుని చూసి ముచ్చట పడుతూ, "అనిల్ మీ ఫ్రెండ్ వచ్చాడురా" అంది.

"ఎవరూ... నవీనా?" తనకు ఏమీ తెలీ నట్లు అడిగాడు.

"ఔను. ఈవేళ ప్రైవేట్ క్లాస్ వుందిటగా. నాకు చెప్పలేదేం? వెళ్ళు. బయట ఆ అబ్బాయి కూర్చున్నాడు. త్వరగా బాక్స్ సర్దుతాను" లంచ్ బాక్స్ సర్దడంలో మునిగి పోయింది లక్ష్మి.

అనిల్ ఒక్క దూకుతో బయటికి వచ్చాడు.

స్నేహితులిద్దరూ విజయసూచకంగా బొటనవేళ్లు పైకెత్తి చూపించుకుని గుంభ నంగా నవ్వుకుని, లక్ష్మి వస్తోన్న అలికిడి

విని మళ్ళీ మామూలుగా అయిపోయారు.

"అనిల్ మాథ్స్ హోంవర్క్ చేశావా?" నవీన్ ప్రశ్న.

"ఆc... సోషల్ ఎసైన్‌మెంట్ వ్రాశావా?" అనిల్ అడిగాడు.

లక్ష్మికి ఎంతో సంతృప్తిగా అనిపించింది. తన కొడుకు స్నేహితులు కూడా ఎంతో తెలివైనవాళ్ళూ బుద్ధిమంతుల్లానే వున్నారు. పిల్లలు చూడముచ్చటగా వున్నారు.

లక్ష్మి అనిల్‌కు లంచ్‌బాక్స్ ఇస్తూ అడిగింది, "బస్ రాలేదుగా... ఎలా వెళ్తారు?"

"నా సైకిల్ వుందిగా ఆంటీ. బస్ వచ్చే వరకూ వుంటే లేటవుతుంది..."

"జాగ్రత్తగా వెళ్ళండి. అసలే ట్రాఫిక్ ఎక్కువ, స్పీడ్‌గా వెళ్ళకండి..." గుమ్మం దాటేవరకూ అప్పగింతలు పెడ్తూనే వుంది లక్ష్మి.

★ ★ ★

నవీన్ సైకిల్ వెళ్ళి పెద్ద బిల్డింగ్ ముందు ఆగింది.

ప్రహరీ దాటి లోపలికి వెళ్తే ఇంటిముందు రకరకాల పూలమొక్కలు.

"అనిల్... రా..." అన్నట్లుగా తలలూపుతున్నాయి.

ఒకవైపు పచ్చటి ముఖమల్ క్లాత్‌లా వున్న లాన్‌లో ఉయ్యాల. తోటమాలి కాబోలు ట్యూబ్‌తో లాన్ తడుపుతున్నాడు. సుభాష్‌వాళ్ళ ఇంత డబ్బు వున్నవాళ్లని తెలీదు అనిల్‌కు.

మొదట ఇంట్లోకి వెళ్ళేందుకు భయపడ్డాడు.

నవీన్ మాత్రం స్వేచ్ఛగా లోపలికి వెళ్తూ, "రా... అనిల్" అని పిలిచాడు. డ్రాయింగ్ రూం ఎంతో అందంగా వుంది. షోకేసుల నిండుగా ఎన్నో అందమైన బొమ్మలు. చూస్తూ నించున్నాడు అనిల్.

"రా... రా" అంటూ నవీన్ అనిల్ చేతిని పట్టుకుని కామన్ రూంలోకి తీసుకువెళ్ళాడు.

కామన్ రూం చాలా విశాలంగా, చల్లగా, హాయిగా వుంది. అందులో ఓ పక్క తళతళ మెరుస్తోన్న కలర్ టీ.వి. అప్పటికే ప్రకాష్, వేణు, రాజు, సుభాష్ కూర్చుని మ్యాచ్ చూస్తున్నారు కబుర్లు చెప్పుకుంటూ.

సుభాష్ అనిల్ వైపు చూస్తూ, "రా... అనిల్ కూర్చో..." అన్నాడుచిరునవ్వుతో. అనిల్ బిడియపడుతూ కూర్చున్నాడు.

ఉండుండి పెద్ద పెట్టున టీ.వి. కామెంటరీతోపాటు కేకలు వేస్తున్నారు. వెల్ క్యాచ్... గుడ్ షాట్.. సిక్సర్... కీపిట్... హుర్రే అంటూ గోలగోలగా అరుస్తూ మ్యాచ్‌ను ఎంజాయ్ చేస్తున్నారు. అనిల్‌కు ఆట పూర్తిగా తెలియకపోయినా ఆనందిస్తున్నాడు. నిజానికి అక్కడున్న పిల్లలకి ఆ ఆటగానీ, ఆడుతున్నవారుగానీ పూర్తిగా తెలీదు. కానీ, ఎవరికివారే తాము క్రికెట్‌లో నిష్ణాతులమనుకుంటున్నారు. చైల్డ్ మెంటాలిటీ.

క్రికెట్ విషయానికి వస్తే చాలామంది పెద్దలు కూడా ఇలాంటి చైల్డిష్ మెంటాలిటీనే ప్రదర్శిస్తుంటారు.

సమాజంలో క్రికెట్ ఒక స్టేటస్ సింబల్‌గా మారింది. క్రికెట్ తెలీనివారు కేవలం అడవిమనుషులు, అనాగరికులు.

అడవి మనుషులుగా, అనాగరికులుగా, అనామకులుగా వుండటానికి ఇష్టపడని స్త్రీ పురుషుల్లో తొంభైశాతం మంది క్రికెట్ తెలుసుకుంటున్నారు. తెలిసినట్లు వ్యవహరిస్తున్నారు. తెలీడమే కాదు. తామందులో పరిపూర్ణులైనట్లుగా నటిస్తున్నారు.

కామెంటరీ (ఇంగ్లీష్) వింటారు. చర్చిస్తారు. (అయోమయంగా) అనిల్ క్రికెట్




తారల్లో ఎవరినీ గుర్తించలేకపోతున్నాడు.

బ్యాట్ చేస్తోన్న ఒకరిని చూపిస్తూ "అతను ఎవరు?" నెమ్మదిగా అడిగాడు.

"అతనే తెలీదా... అతను. వి.వి.యస్. లక్ష్మణ్" వేణు చెప్పాడు.

"ఏంకాదు... అతను వెంకటేష్‌ప్రసాద్" క్షణం ఆలస్యం లేకుండా అందుకున్నాడు నవీన్.

నవీన్‌కు నిన్న అందరిముందూ తనకు జరిగిన అవమానం గుర్తుంది. ఎలాగయినా ఈరోజు వేణూను "డౌన్" చెయ్యాలనే పట్టుదలతో వాడు ఎప్పుడు తప్పు మాట్లాడతాడా? అని ఎదురు చూస్తున్నాడు.

"ఏంకాదు. అతను లక్ష్మణ్" వేణు కోపంగా అన్నాడు.

"కాదు అతను ప్రసాద్" అంతకంటే కోపంగా అన్నాడు నవీన్.

"కాదు"

"అవును"

"అతను ప్రసాద్ కాదంటే కాదు..."

"అతను లక్ష్మణ్ కాదంటే కాదు..."

"అవును"

"కాదు"

"అవును... అవును... అవును"

"కాదు... కాదు... కాదు"

"అవును అతనే"

"కాదు"

"బెట్"

"బెట్"

"సుభాష్! అతను లక్ష్మణ్ కాదూ...?"

అవునో కాదో తెలీని సుభాష్ సందిగ్ధంలో పడిపోయాడు.

"ఏమోరా! నాకూ సరిగ్గా తెలీడంలేదు. అలాగే వున్నాడు మరి"

సుభాష్ ఎటూ తేలకుండా చెప్పాడు.

"తెలిసిందా? అతను లక్ష్మణ్" వేణు తన ఆర్గ్యుమెంట్ బలపరుచుకున్నాడు.

"రాజూ! అతను ప్రసాద్ కాదూ...?" నవీన్ తనకు సపోర్ట్ వెదుక్కున్నాడు.

"ఏమోరా నాకూ సరిగ్గా తెలీదు..." తప్పుకున్నాడు రాజు.

"సరిపోయిందా...?" వేణు నవ్వాడు.

"ఈడియట్" నవీన్ గొణిగాడు.

"నువ్వే ఈడియట్ నువ్వే ఫూల్" రోషంగా అన్నాడు వేణు.

"కోతిమొహం..."

"నీదే కుక్క మొహం"

"ఎద్దు మొహం"

"పంది మొహం"

"పిల్లి మొహం"

"బల్లి మొహం"

"పెద్ద గద్ద ముక్కూ వాడు..."

"పోరా! కాకిరంగూ, కుక్క మూతీ..."

"నాది కుక్క మూతి అంటావురా?" నవీన్ ఒక్క ఎగురు ఎగిరి కరాటే స్టైల్లో కాలితో ఒక్క షాట్ ఇచ్చాడు. వేణు కూడా కుంగ్‌ఫూ స్టైల్లో ఎదురుదెబ్బ తీశాడు.

"యాహూ..." అంటూ ఆవేశంగా అరిచాడు నవీన్.

"హు... హా..." అన్నాడు వేణు రెట్టించిన ఆవేశంతో.

"హుం... యా..." అంటూ గాలిలో డైవ్ చేస్తూ వేణూను అటాక్ చేశాడు నవీన్.

"హా... హా..." అంటూ ఎదుర్కొన్నాడు వేణు.

టి.వి.లో వస్తోన్న కామెంటరీని మించిన ఈ అరుపులను వింటూ, ఆటను మించిన ఈ పోరాటాన్ని ఆసక్తిగా చూస్తున్నారు మిగిలిన పిల్లలు. కాసేపటికి కరాటే, కుంగ్‌ఫూ

లాంటి ఫారిన్ స్టైల్స్ వదిలేసి అచ్చమైన భారతీయ మల్లయుద్ధంలోకి దిగిపోయారు నవీన్, వేణులు. బాహా బాహీ, ముష్టాముష్టి దంతాలూ, నఖాలే ఆయుధాలుగా విజయమో, వీరస్వర్గమో తేల్చేసుకోవాలన్నంత పట్టుదలతో వీరోచితంగా పోరాడుతున్నారు.

నవీన్, వేణుల యుద్ధఘట్టం ముగియకుండా ఇంటిముందు కారు ఆగిన శబ్దం వినిపించింది.

"ష్... మా డాడీ, మమ్మీ వస్తున్నారు" సుభాష్ అన్నాడు.

అంతే... ఎక్కడి వాళ్ళక్కడ సర్దుకుని బుద్ధిగా కూర్చున్నారు.

ఇంతకు రెండు క్షణాలకుముందు విజయమో, వీరస్వర్గమో తేల్చుకునేందుకు అక్కడో రణరంగాన్ని సృష్టించారని చెప్తే, చెప్పిన వాళ్ళను పిచ్చివాళ్లను చూసినట్లు చూస్తారు విన్నవాళ్లు.

అంత ఇన్నోసెంట్‌గా వున్నాయి వాళ్ళ ముఖాలు.

"కోప్పడతారా...?" గుసగుసగా అడిగాడు అనిల్.

"ఎవరు...?"

"మీ మమ్మీ-డాడీ..."

"ఎందుకు...?"

"టీ.వీ. చూస్తున్నందుకు"

అనిల్ భయానికి సుభాష్ నవ్వాడు.

ఆ నవ్వు-

ఒట్టి సోది సొరకాయ్... అన్నట్లు అనిపించింది అనిల్‌కు. సుభాష్ తల్లిదండ్రులు ఇద్దరూ డాక్టర్సే. అంతేకాదు టౌన్‌లో మంచి ప్రాక్టీస్ వున్న లీడింగ్ డాక్టర్స్

డాక్టర్ ప్రేమలత గైనకాలజిస్ట్‌గానూ, డాక్టర్ మూర్తి జనరల్‌ఫిజీషియన్‌గానూ ప్రైవేట్ డిస్పెన్సరీ నడుపుతున్నారు.

ఖరీదయిన హాస్పిటల్... అంతకంటే ఖరీదయిన రెసిడెన్స్... అందంగా, ఆరోగ్యంగా 'మేడ్ ఫర్ ఈచ్ అదర్' అన్నట్టుగా వున్న సుభాష్ మమ్మీ, డాడీలను ఆరాధనగా చూస్తుండిపోయాడు అనిల్.

పిల్లలంతా బుద్ధిగా టి.వి. ముందు కూర్చుని ఆసక్తిగా మ్యాచ్ చూడ్డం గమనించిన డాక్టర్ మూర్తి అడిగాడు.

"అరే... మీరందరూ ఇక్కడే వున్నారే. ఇవ్వాళ స్కూలు లేదా?"

"వుంది డాడీ. మరేమో మ్యాచ్ చూద్దామని వుండిపోయాం" గారాబంగా చెప్పాడు సుభాష్.

"బ్యాటింగ్ ఎవరిది...?"

"ఇండియాది"

"స్కోరెంత...?"

సుభాష్ చెప్పాడు.

"ఎనీ హోప్స్ టు విన్?"

"హోప్‌లెస్ డాడీ"

సుభాష్, వాళ్ళ డాడీ మ్యాచ్ గురించి అంత ఫ్రెండ్లీగా డిస్కస్ చేసుకోడం అనిల్‌కు ఎంతో నచ్చింది.

స్కూలుకు డుమ్మా కొట్టినందుకు ఏమీ అనలేదు.

సుభాష్ డాడీ ఎంత మంచి వారో... అదే తన డాడీ అయితే స్కూలు మానేసి టి.వి. చూస్తున్నట్లు తెలిస్తే చంపేస్తాడు. మమ్మీ అయితే మరీను.

డాక్టర్ మూర్తి ఐదు నిముషాలు మ్యాచ్ చూసి లేచి డ్రాయింగ్ రూంలోకి వెళ్ళిపోయాడు.

డాక్టర్ ప్రేమలత రిలాక్సవుతూ అక్కడే కూర్చుని వుంది.

"సుభాష్ స్కూలుకు వెళ్ళలేదా...?" భర్తను అడిగింది.

"మ్యాచ్ చూస్తున్నారట"





డాక్టర్ మూర్తికి తనకొడుకలా ధైర్యంగా నిజం చెప్పడం చాలా సంతోషం కలిగించింది. అదే వయస్సులో తను మ్యాచ్ చూసేందుకు నానా అవస్థపడేవాడు. తండ్రి దగ్గర ఎన్ని అబద్ధాలు చెప్పాలో అన్నీ చెప్పేవాడు.

చదువు వచ్చినా రాకపోయినా జీవితంలో క్రమశిక్షణ వుండాలన్నేది తండ్రి సిద్ధాంతం... ఆ సిద్ధాంతంతోనే, ఆ క్రమశిక్షణతోనే అప్పట్లో ఆయన స్వయంకృషితో పైకి వచ్చాడు.

కొడుకు స్వేచ్ఛా ప్రవృత్తి నచ్చేదికాదు... కొడుక్కు అబద్ధాలు ఆడక తప్పేది కాదు.

తను తన కొడుకును అలా నిర్బంధించడు. వాడు స్వేచ్ఛగా పెరగాలి.

"మెడికల్ కాన్ఫరెన్స్‌కు ఎప్పుడు వెళ్ళడం...?" ప్రేమలత అడిగింది. మూర్తి చెప్పాడు.

మెడికల్ కాన్ఫరెన్స్‌లవల్ల ఆర్థికంగా లాభంలేకపోయినా పలుకుబడి పెరుగుతుంది. అదృష్టం బాగుంటే ఫారిన్ ఛాన్స్‌లు కూడా తగిలే అవకాశం వుంది.

ఇవ్వాళా రేపూ ఒక్క డబ్బు సంపాదించడంవల్ల లాభంలేదు. దానితోపాటు అధికారం, పలుకుబడి కూడా పెంచుకోవాలి. ఆ రెండూ వున్నవారికే సంఘంలో గౌరవం.

డాక్టర్ మూర్తి, డాక్టర్ ప్రేమలత మెడికల్ కాన్ఫరెన్స్ గురించీ దానివల్ల కలిగే లాభాలగురించీ డిస్కస్ చేసుకున్నారు. ఆ తరువాత ప్రేమలత పనిపిల్లను పిలిచి సుభాష్ స్నేహితులందరికీ బిస్కట్స్, లైమ్ జ్యూస్ సర్వ్ చేయించింది. లైమ్‌జ్యూస్ సిప్‌చేస్తూ సుభాష్ వాళ్ళ మమ్మీ ఎంతమంచివారు అనుకున్నాడు అనిల్.

గులాబీరంగు శరీరచ్ఛాయతో గుండ్రని ముఖంతో తీరైన ముక్కూ మొహంతో వున్న సుభాష్ మదర్ అనిల్‌కు ఎంతో నచ్చింది.

సుభాష్ వాళ్ళ మమ్మీ ఎంత బాగున్నారు? ఎంత మంచి వారు? అనుకున్నాడు పదేపదే. డాక్టర్ మూర్తి, డాక్టర్ ప్రేమలతగార్లు తన మమ్మీ-డాడీ అయితే ఎంత బాగుండేది?

అనిల్‌కు తన తల్లి గుర్తుకు వచ్చింది.

ఇంటికి తన ఫ్రెండ్స్ ఎవరైనా రావడం పాపం.

యూనిట్ ఎగ్జామ్స్‌కు డేట్స్ ఇచ్చారా? బాగా చదువుతున్నారా...? క్వార్టర్లీ ఎగ్జామ్స్‌లో నీ ర్యాంక్ ఎంత? ఇంగ్లీష్‌లో మార్కులెన్ని? బాగా చదవండి మా అనిల్‌కు ఈసారి మాథ్స్‌లో తక్కువ మార్కులు వచ్చాయి... ఇలాంటి చెత్త ప్రశ్నలతో బోర్ కొట్టించేస్తుంది.

బయటికి వెళ్ళాక ఫ్రెండ్సంతా ఒకళ్ళతో ఒకళ్ళు చెప్పుకుని నవ్వుకుంటారు. నిజంగా తనకైతే భలే షేమ్‌గా వుంటుంది.

సుభాష్ వాళ్ళ మమ్మీ-డాడీ తన మమ్మీ-డాడీ కానందుకు చాలా నిరుత్సాహపడ్డాడు. మరికాసేపటి తరువాత సుభాష్ మమ్మీ-డాడీ కారులో వెళ్ళిపోయారు.

పిల్లలు తిరిగి స్వేచ్ఛావిహంగాలైపోయారు.

మ్యాచ్ చూడ్డంకంటే కూడా అరుపులతో, చరుపులతో, పాటలతో, డ్యాన్సులతో, ఫైటింగ్స్‌తో రోజంతా జాలీడేగా గడిచిపోయింది.

అయితే నవీన్ వేణుల మనస్సుల్లో మాత్రం మరికాస్త కచ్చ పేరుకుంది.

ఎలాగైనా సరే... నవీన్‌ను దెబ్బకొట్టాలని వేణు మనస్సులోనే భీషణ ప్రతిజ్ఞ చేసుకుంటే, వేణును దెబ్బతీయాలని నవీన్ కూడా దారుణమైన ప్రతిజ్ఞ చేసుకున్నాడు.

"అనిల్! రేపు సెమీఫైనల్ మ్యాచ్ మా

ఇంట్లో చూద్దామా? " నవీన్ అడిగాడు.

"మీ ఇంట్లోనా? "

"ఆఁ... మా ఇంట్లో కలర్ టి.వి., విసి. ఆర్ కూడా వుంది తెలుసా? " స్కూలు ఎగ్గొట్టడంలో గల సాధక బాధకాలన్నీ నవీన్ చూసుకుంటాడు. కాబట్టి నవీన్ వాళ్ళింట్లో మ్యాచ్ చూడవచ్చు

దొంగ సంతకాలు పెట్టి లీవ్‌లెటర్స్ పంపడం, ఇంటిదగ్గర తల్లి నమ్మేలా అబద్ధాలు చెప్పడం. అమాయకమైన మొహంతో కథలు అల్లడం, పెద్దవాళ్ళను నమ్మించడంలో నవీన్ దిట్ట.

"ఏం అనిల్ వస్తావా...? "

"ఊ..."

సుభాష్ ఇంటిని అనిల్ కళ్ళు విప్పార్చుకుని చూసినప్పటినుండీ నవీన్‌కు అనిల్‌ను తమ ఇంటికి కూడా తీసుకువెళ్ళాలనీ, సుభాష్ ఇంటికంటే తమ ఇల్లే పెద్దదని రుజువు చేయాలనీ చాలాకోరికగా వుంది.

సుభాష్ మమ్మీలా తన మమ్మీ తన ఫ్రెండ్స్‌ను రిసీవ్‌చేసుకోదు... ఆమెతో పెద్ద బోర్.

అందుకే నవీన్ ఏ కొందరినో తప్ప తన ఫ్రెండ్స్ అందరినీ ఇంటికి తీసుకువెళ్ళడు. కానీ, అనిల్‌కు తమ ఇల్లు చూపించాలనే కోరిక గాఢంగా కలగడంతో సాహసించాడు.

మరునాడు-

అనుకున్న ప్రకారం అనిల్ నవీన్ ఇంటికి వెళ్ళాడు.

అనిల్ కొరకే ఎదురుచూస్తోన్న నవీన్ గేటుదగ్గరికి ఎదురువచ్చి అనిల్‌ను లోపలికి తీసుకువెళ్ళాడు.

అనిల్‌ను చూస్తూనే గొలుసుతో కట్టివున్న ఆల్సేషన్ డాగ్ గట్టిగా గింజుకుంటూ అరచింది.

అనిల్ భయపడ్డాడు. కట్టివేసే వుందనుకో... అయినా తెంచుకుంటే...?!

"ఏం చెయ్యదురా... నేను వున్నానుగా..." నవీన్ అభయమిచ్చాడు. అయినా అనిల్‌కు భయం పోలేదు.

"టామీ! కీప్ క్వయిట్..." నవీన్ గద్దించాడు.

నవీన్ ఇచ్చిన ఇంగ్లీష్ కాషన్ అర్థంచేసుకున్న టామీ అయిష్టంగానే, అయినా మౌనంగా వుండిపోయింది.

గండం గడిచినట్లుగా రిలీఫ్ ఫీలయ్యాడు అనిల్.

ఆ ఇంటిని చూస్తోన్న అనిల్ కళ్ళు సుభాష్ ఇంటిని చూస్తున్నప్పటిలాగే విప్పార్చుకున్నాయి.

నవీన్ తన ఇంటిలోని ప్రతి గదినీ చూపిస్తోంటే ఆ గదులనూ అందులోని విలువైన వస్తుసామగ్రినీ చూస్తూ, ఆశ్చర్యపోతూ, అవన్నీ తనవి కానందుకు మనస్సులోనే అసంతృప్తి పడుతూ, "నవీన్! మీ ఇల్లు కూడా చాలా పెద్దదేనే" అన్నాడు ఆశ్చర్యంగా.

తమ ఇల్లు అనిల్‌కు నచ్చినందుకు నవీన్ సంతోషంగా నవ్వాడు.

"సుభాష్ ఇంటికంటే మా ఇల్లే పెద్దది" అన్నాడు అతిశయంగా.

"ఔను" ఒప్పుకున్నాడు అనిల్.

ఆ ఇంట్లో ఒక చివరగా ఎవరివల్లా డిస్టర్బ్ కాని విధంగా అందంగా వున్న ఒక విశాలమైన గదిలో కూర్చుని ఎవరితోనో మాట్లాడుతోన్న వ్యక్తిని దూరంనుండే చూపిస్తూ "మా డాడీ" అన్నాడు నవీన్.

"మీ డాడీ లాయరా...? "

"అవును చాలా పెద్ద లాయరు"

నవీన్ వాళ్ళ ఫాదర్‌కు నలభై ఐదేళ్ళ వయస్సు వుంటుంది. బట్టతలే అయినా అందంగా, దృఢంగా, హుందాగా అచ్చు సినిమాలోని లాయర్‌లా కనిపించాడు అనిల్




కళ్ళకు.

ఆ గదిలో ఎటువైపు చూసినా పెద్దపెద్ద బీరువాలు వాటినిండుగా బైండ్ చేసి పెట్టిన పెద్దపెద్ద లా పుస్తకాలూ, ఓ మూల షోకేస్‌లో అమర్చబడిన అందమైన బొమ్మలతో పాటు కళ్ళకు గంతలు కట్టివున్న విగ్రహం... గోడలమీద అందమైన ఫ్రేంలతో బిగించబడిన గాంధీ, నెహ్రూ ఫొటోలు అచ్చు సినిమా సెట్‌లో లాయరు గారి గదిలాగే వుంది.

"నవీన్! మీనాన్నగారి రూం చాలా బాగుంది"

"ఆ రూం మా నాన్నగారి ఆఫీస్ రూం. అందులోకి ఎవర్నీ రానీయరు"

"మరి ఆ బొమ్మకు కళ్ళకు గంతలు న్నాయేం...? "

"ఆ బొమ్మ న్యాయదేవత అంటారు. అంటే న్యాయదేవతకు చెవులే గానీ కళ్ళుండ వని"

"అంటే? "

"అంటే నేరస్థుడు నేరం చేసినప్పుడు కోర్టులో వున్నవాళ్ళల్లో ఎవరూ చూడలేదు కదా! ఒక వ్యక్తి నేరం చేసిందీ లేందీ నిర్ధారించి తీర్పు చెప్పేది కేవలం సాక్షులు చెప్పే సాక్ష్యాలు వినేకదా అందుకే న్యాయానికి చెవులేగానీ కళ్ళుండవంటారు"

"మరి సాక్షులు అబద్ధం చెప్తే...? "

"ఎక్కువమంది సాక్షులు అబద్ధాలే చెప్తారు"

అనిల్ ఆశ్చర్యపోయాడు.

"ఎందుకు...? "

"నేరం జరుగుతుండగా నిజంగా చూసిన వాళ్లల్లో చాలామంది కోర్టులకు వచ్చి సాక్ష్యం చెప్పరట"

"ఎందుకని...? "

కొంతమంది మాకెందుకొచ్చిన గొడవ అనుకునీ, మరికొంతమందికి పోలీసులంటే కోర్టులంటే భయం, మరికొంతమంది నేరస్తునితో విరోధం తెచ్చుకునేందుకు భయపడి. అందుకే లాయర్లు కొందరు ప్రొఫెషనల్ సాక్షులను తయారుచేసుకుంటారు"

"ప్రొఫెషనల్ సాక్షులు అంటే ఎవరు నవీన్...? "

"నేరం జరుగుతుండగా చూడకపోయినా చూసినట్లుగా సాక్ష్యం చెప్పడం వాళ్ళ వృత్తి అన్నమాట"

"మరి చూడకుండా ఎలా చెప్తారు? "

"లాయర్స్ ఫీడ్ చేస్తారు. అపోజిషన్ లాయరు ఈ ప్రశ్న వేస్తాడు. దానికి నువ్వీ జవాబు చెప్పాలి. అని లాయర్లే ప్రశ్నలూ-జవాబులూ బట్టీ వేయిస్తారు వాళ్ళచేత. ఒక్కోసారి ఈ ప్రొఫెషనల్ సాక్షులు అనుకోని ప్రశ్న తగిలినప్పుడు ఉక్కిరిబిక్కిరి అవుతుంటారట" లాయరు కొడుకుగా నవీన్ తనకు తెలిసినంతవరకూ అనిల్ సందేహాలు తీరుస్తున్నాడు.

"భలే..." అనిల్ ఆనందంగా వింటో న్నాడు.

"ఓసారి మా డాడీ... ఓ కేసులో..." నవీన్ తన తండ్రి ఓ కేసులో చేసిన తమాషా వర్ణిస్తూ ఇల్లంతా చూపుతున్నాడు.

కామన్‌హాల్, బెడ్‌రూందాటి కిచెన్‌కు దగ్గరగా వచ్చారు. కిచెన్‌కు ముందున్న పెద్ద డైనింగ్ హాల్లో, డైనింగ్ టేబిల్ వద్ద కూర్చుని పనిమనిషితో ఏదో మాట్లాడు తోంది నవీన్ తల్లి విజయలక్ష్మి. ఆవిడకు నలభై దాటి ఐదేళ్ళయ్యింది. పెద్ద ఊబ శరీరం. తలకు వేసుకున్న నల్లరంగు సరిగ్గా అంటక జుట్టు అక్కడా అక్కడా తెల్లగా కని పిస్తోంది.

ఎర్రని పలుచని జార్జెట్ చీర ఆవిడ ఊబ శరీరానికి చాలా ఎబ్బెట్టుగా కనిపి స్తోంది. ఆ అలంకరణలో వయస్సు దాచా

లనే తాపత్రయం స్పష్టమవుతోంది.

"ఆఁ... అయితే ఆవిడకూ, మొగుడికి అంతంత మాత్రమేనంటావ్" విజయలక్ష్మి పనిమనిషిని ఆసక్తిగా అడుగుతోంది.

ఆమెకు విజయలక్ష్మి అని పేరుతో పిలిస్తే చాలాకోపం. మిసెస్. విజయలక్ష్మి రామనాథం అని పిలిస్తే తప్ప ఆవిడకు నచ్చదు.

"మొన్నేమయిందనుకున్నారూ...? " అంటూ పనిమనిషి చెప్తోంటే, మధ్యమధ్య ప్రశ్నలు వేస్తూ, తనకు తోచిన కామెంట్స్ చేస్తూ ఆసక్తిగా వింటోంది మిసెస్ విజయలక్ష్మి రామనాథం.

"మా మమ్మీ..." నవీన్ చెప్పాడు.

మిసెస్. విజయలక్ష్మి రామనాథం తల ఎత్తి నవీన్ వంకా, అనిల్ వంకా చూసింది.

"ఈ అబ్బాయి ఎవరు? " కరుకుగా అడిగింది.

"మా ఫ్రెండ్ మమ్మీ"

మిసెస్. విజయలక్ష్మి రామనాథం అనిల్‌ను నిశితంగా చూసింది. అనిల్‌కు ఆమె మాటా, చూపూ కూడా ఎందుకో నచ్చలేదు. మిసెస్. విజయలక్ష్మి రామనాథం అనిల్ కాన్వెంట్ డ్రస్ చూస్తూ అతని అంతస్తును అంచనా వేయలేకపోయినా, అతని బెరుకు చూపు చూస్తూ అతని అంతస్తును అంచనా వేసేందుకు ప్రయత్నించింది.

"ఎవరబ్బాయి...? "

"డాక్టరుగారబ్బాయి మమ్మీ"

అనిల్ తెల్లబోయినట్లు చూశాడు నవీన్ వంక.

"ఏ డాక్టరు? "

పట్టణంలో వున్న డాక్టర్స్‌లో ఒకరి పేరు చెప్పేశాడు నవీన్.

"ఊహుఁ" అన్నట్లుగా తల పంకించిన మరుక్షణంలోనే, "ఎవరూ? డాక్టర్ వెంకటేశ్వర్రావుగారి అబ్బాయా? " అంది.

"అవును మమ్మీ"

"డాక్టర్ వెంకటేశ్వర్రావుగారికి ఇద్దరూ ఆడపిల్లలే కదా? "

నవీన్ ఉలిక్కిపడ్డాడు.

ఛీ...ఛీ... లాయరు కావలసింది డాడీ కాదు. ఇదిగో ఈ మహాతల్లి అంటూ లోలోనే విసుక్కుంటూ "ఆ డాక్టరు వెంకటేశ్వర్రావుగారు కాదు మమ్మీ... ఇంకో కొత్త డాక్టరు. కొత్తగా వచ్చారు" అన్నాడు త్వరత్వరగా.

"కొత్తగా వచ్చారా...? ఏ వీధి? నర్సింగ్ హోం ఎక్కడ...? "

"అమ్మగారూ! నేను వెడతాను. ఇంకా అచ్చెమ్మగారింటికి పోవాలి" పనిమనిషి నోట అచ్చెమ్మ పేరు వినగానే మిసెస్. విజయలక్ష్మి రామనాథం అటెంక్షన్ అటు మళ్ళింది. అంతే కాదు... మనస్సు రగిలింది కూడా.

"ఊ, వెడుదువుగాన్లే" అంది కోపంగా వెంటనే. "అయితే రాకరాక అత్తగారు వస్తే గొడవపెట్టుకుందా...? " అంది కుతూహలంగా.

"గొడవంటే గొడవా అబ్బో ఏమైనా ఈ పెద్దోళ్ళు పేరుకే పెద్దోళ్ళు... బుద్దులు మాత్రం అలగా వాళ్ళకంటే అన్యాయం" పనిమనిషి చురక వేసింది. మిసెస్ విజయలక్ష్మి రామనాథం అలగాజనం అంటూ ప్రతి మాటకూ తనను ఎత్తిపొడుస్తోండటం పనిమనిషికి ప్రతిసారీ బాధ కలిగించడంతో, సమయం దొరికినప్పుడల్లా పెద్దోళ్ళను ఎత్తిపొడవడం నేర్చుకుంది.

మిసెస్ విజయలక్ష్మి రామనాథానికి ఆ విసురు నసాళానికి అంటిందిగానీ, అప్పుడు పనిమనిషిని ఏమన్నా, అచ్చెమ్మ తన అత్తగారితో పడిన గొడవ విషయం చెప్పకుం




డానే వెళ్ళిపోతుందనే భయంతో ఆ విషయం పట్టించుకోనట్లుగా.

"ఊ... అయితే పెద్ద గొడవే అయిందన్న మాట..." అంది ఆ తరువాత సంగతి చెప్ప మన్నట్లు. ఈ లోపుగా అనిల్‌ను తీసుకుని నవీన్ అక్కడ్నించి బయటపడ్డాడు గండం గడిచినట్లుగా.

నవీన్ చదువుకునేందుకు ఓ గది ప్రత్యే కంగా వుంది.

నవీన్ అనిల్‌ను తన గదిలోకి తీసుకువె ళ్ళాడు.

గదిలోకి వెళ్ళగానే అనిల్ అడిగాడు, "మీ మమ్మీతో ఎందుకలా చెప్పావు? "

"ఏమిటి...? " ఏం చెప్పాడో నవీన్ మరి చిపోయాడు.

"అదే... నేను డాక్టరుగారి అబ్బాయినని"

"ఓ... అదా..." నవ్వేశాడు నవీన్.

అవసరార్థం తల్లిదగ్గర అలా అబద్ధాలు ఆడేయడం నవీన్‌కు అలవాటే... అందుకే ఆ విషయం వెంటనే మరిచిపోయాడు.

"మా మమ్మీ అలగావాళ్ళతో స్నేహం చెయ్యొద్దంటుంది. అలగావాళ్ళతో స్నేహం చేస్తే చెడిపోతారట"

"అలగావాళ్ళంటే...? "

నవీన్ తల గోక్కున్నాడు.

"అలగా వాళ్ళంటే... అదే... టీచర్స్ పిల్లలూ, గుమాస్తాల పిల్లలూ... డబ్బులే కుండా వుంటారు చూడూ... పూర్ పీపుల్... వాళ్ళన్నమాట"

అనిల్‌కు ఏమిటో అర్థం అయీ కాకుండా అనిపించింది.

నవీన్ చెప్పిన లిస్ట్‌లో తన తండ్రి లేడు. తన తండ్రి బ్యాంక్ క్లర్క్.

క్లర్క్‌ను తెలుగులో 'గుమస్తా' అంటారని అనిల్‌కు తెలీదు.

మరి... నవీన్ తనను డాక్టరుగారబ్బా యని చెప్పాడెందుకని...?

"నవీన్ నాతో స్నేహం చేస్తే మీ మమ్మీ కోప్పడతారా? "!

"ఓ... అనిల్ లీవిట్... మమ్మీ డామ్ బోర్. ఆవిడ మాటలు ఎవరు పట్టించుకుం టారు? ఇంటికి ఎవరైనా వస్తే చాలు... పెద్ద లాయరులా సవాలక్ష ప్రశ్నలు వేస్తుంది. పొద్దుగూకులూ అలగాజనం అల గాజనం అంటూ బోర్ కొట్టేస్తుంది"

"మరి మీ డాడీ...? "

"మా డాడీ అసలు ఏమీ పట్టించుకోరు"

అనిల్ నవీన్ రూం చాలా జాగ్రత్తగా చూశాడు.

చదువుకునేందుకు స్వంతంగా ఒక గది ఎంత అదృష్టం?! ఈర్ష్యగా అనుకున్నాడు అనిల్.

"నాగది బాగుందా అనిల్? "

"ఊ..."

"గేమ్ స్టార్టయ్యింది చూద్దామా? "

"ఆc..."

నవీన్ అనిల్‌ను కామన్ హాలుకు తీసు కువెళ్ళాడు. కామన్ హాలు విశాలంగా, చల్లగా, హాయిగా వుంది. అయినా ఎందుకో సుభాష్ ఇంట్లో గేమ్ చూస్తూ ఆనందించి నంతగా నవీన్ ఇంట్లో గేమ్ చూస్తూ ఆనం దించలేకపోయాడు అనిల్.

ఎప్పుడు నవీన్ వాళ్ళ మమ్మీ వస్తుందో... ఏమడుగుతుందో... తను డాక్టరుగారి అబ్బాయిని కానని తెలిసి తిడు తుందేమో... అనే భయంతో ముళ్ళమీద కూర్చున్నట్లుగా కూర్చున్నాడు అనిల్.

ఆ ఇంట్లో మొత్తంమీద అనిల్‌ను విశే షంగా ఆకర్షించింది లాయరుగారు ఆయన గది మాత్రమే.

లాయర్ రామనాథంగారు క్లైంట్స్‌తో

డీప్‌డిస్కషన్స్‌లో వున్నారు.

ఆ కేసు గెలిస్తే తన మామూలు ఫీజు కాక అదనంగా మరో పాతికవేలు తన బ్యాంక్ బ్యాలన్స్‌లో జమఅయినట్లే లెక్క.

ఒళ్ళు బలిసిన పుత్రరత్నం తన మిత్రబృందంతో కలిసి ఓ మైనర్ బాలికను రేప్‌చేస్తే, ఆ కేసు మాఫీ చేయించి కొడుకును నిర్దోషిగా నిరూపించేందుకు డబ్బుతో పులిసిన ఒక తండ్రి లాయర్ల చుట్టూ తిరుగుతున్నాడు.

నిజానికి ఈ కేసు గెలిపించడం రామనాథం గారికి ఓ పెద్ద విషయం కాదు.

ఆయన తిమ్మిని బొమ్మినీ, బొమ్మిని తిమ్మినీ చేయగల సమర్ధుడు. గుడినీ, గుళ్లోని లింగాన్నీ సైతం గుట్టుచప్పుడు కాకుండా మ్రింగి తేన్చగల చతురుడు.

ప్రొఫెషనల్ సాక్షులను సైతం ముప్పతిప్పలు పెట్టి మూడు చెరువుల నీళ్ళు తాగించి, ఇంకెప్పుడూ కోర్టుముఖం చూడకూడదని చెంపలు వేసుకునే పరిస్థితిని కల్పించగలదిట్ట.

నడిరోడ్డుమీద వందలమంది ముందు ఓ ప్రముఖుడ్ని హత్యచేసి ఉరికంబం ఎక్కడానికి సిద్ధంగా వున్న హంతకుడికి సైతం తన వాదనా పటిమతో శిక్షతప్పించగల ఘటనాఘటన సమర్థుడు ఆ రంగంలో.

కాకపోతే ఆయనగారి ఫీజు సామాన్యులు అందుకోలేనిది. నేరాలే వృత్తిగా గల ధనవంతుల పాలిట ఆయన కల్పవృక్షం.

"చూడండి రావుగారూ! అవతల అమ్మాయి చూస్తే మైనరు. ఈ కేసు గెలిచే వరకూ అనుమానమే. అందులోనూ జడ్జి గార్కి ఇలాంటి కేసులంటే మహా మంట. ఆయనకు ఐదుగురు ఆడపిల్లలున్నారు. ఆడపిల్లకు అన్యాయం జరిగిందంటే ఆయన సహించలేడు. ఏవిధంగా చూసినా కేసు గెలవడానికి హోప్స్ చాలా తక్కువ"

రావుగారి ముఖంలో భయం స్పష్టంగా కనిపిస్తోంది.

ఈ కేసులోనుండి బయటపడకపోతే, కొడుకు మాట ఎలా వున్నా ఫలానావాడి పుత్రరత్నం జైలులో వున్నాడంటే అది తనకెంత అప్రదిష్ట...

"రామనాధంగారూ! మీరే అలా అంటే ఎలా? నా బిడ్డను రక్షించి నా పరువు కాపాడండి. మీరు తీసుకున్న ఏ కేసూ ఫెయిల్ కాలేదని కాదనీ నాకు తెలుసు" కాళ్ళా వేళ్ళా పడ్డట్టు బేలగా అన్నాడు తండ్రి.

"మీరలా అధైర్యపడకండి. నా సాధ్యమైనంతవరకూ నేను చేస్తాననుకోండి. అయితే హోప్స్ లేవు. రేప్‌కేసుకు యావజ్జీవ జైలు శిక్ష పడవచ్చు. మైనర్‌బాలిక కాబట్టి ఆ శిక్ష మరింత పెరగనూవచ్చు లేదూ... మరింత కఠినంగా వుండనూవచ్చు"

కేసు స్వభావ స్వరూపాలను వివరించి క్లైంట్‌ను ఎంతగా వీలయితే అంతగా భయపెడితేగానీ అనుకున్న డబ్బు రాలదు.

"లాయరుగారూ! ఇలాంటి కేసులు వాదించడంలో మిమ్మల్ని మించిన వాళ్ళు లేరని మా ఫ్రెండ్ మీపేరు సజెస్ట్ చేశాడు. ఎలాగైనా సరే నన్నీ గండంనుండి గట్టెక్కించి పుణ్యం కట్టుకోండి"

"చెప్పాను కదూ! నా శక్తి మేరకు ప్రయత్నిస్తాను. కాకపోతే జడ్జిగారి విషయమే... ఆడవాళ్ళకు అన్యాయం జరిగిందంటే ఆయన అసలు క్షమించరు"

"అలా అనకండి లాయరుగారూ. ఎంత డబ్బయినా సరే... నా బాబును రక్షించండి. మీ పేరు చెప్పుకుని దీపం వెలిగించుకుంటాను"

లాయర్‌గార్కి కావలసిన మాట బయటికి వచ్చేసింది. ఇక చాలు. "దీపందేముం





దిలెండి. కేసుగెలిస్తే నాకూ లాభమేగా" నవ్వుతూ అన్నారు.

ఇక ఆ తరువాత ఫీజుకు సంబంధించిన అగ్రిమెంట్ రెండు నిముషాల్లో ముగించి కేసు వివరాల్లోకి వెళ్ళారు లాయరుగారు.

రావుగారి సుపుత్రుడికి పాతికేళ్ళు. ఇంకా కాలేజీలో చదువుతున్నాడు. డబ్బులో పుట్టి డబ్బులో పెరగడంచేత, చిన్నతనం నుండే విలాసవంతమైన జీవితానికి అలవాటుపడ్డాడు. ఆ వయస్సుకే అన్ని అవలక్షణాలూ అలవడ్డాయి.

స్కూలుకు వెళ్ళి వంటరిగా వస్తోన్న అమ్మాయిని తుప్పలలోకి లాక్కువెళ్ళి, స్నేహితులతో కలసి అఘాయిత్యం చేసి పారిపోయాడు.

స్పృహలేని స్థితిలో వున్న ఆ అమ్మాయిని ఎవరో చూసి హాస్పిటల్‌లో చేర్చడం, ఆ అమ్మాయి మూడురోజులు మృత్యువుతో పెనుగులాడి చివరికి ఎలాగో బతికి బయటపడ్డం జరిగాయి.

కానీ ఆ షాక్ నుండి మాత్రం జీవితమంతా కోలుకోలేదేమో...

ఆ పాప తల్లిదండ్రులు మధ్యతరగతి గృహస్తులు. న్యాయంకొరకు డబ్బు వెచ్చించలేరు. ఎంత డబ్బయినా వెచ్చించి, ఎంత దూరమైనా వెళ్ళి న్యాయాన్ని కొనుక్కోలేరు.

అది ప్లస్‌పాయింట్ అయ్యింది లాయర్ రామనాథంగారికి.

కేసు వివరాలన్నీ క్షుణ్ణంగా తెలుసుకుని రావుగారి పుత్రరత్నానికి బెయిలు ఏర్పాట్ల గురించి ఆలోచిస్తుండగానే డ్రామా ట్రూప్ వంటి మరో బృందం వచ్చి కూర్చుంది లాయర్‌గారితో మాట్లాడేందుకు.

లాయరుగారు రావుగార్ని పంపించి వాళ్ళను గదిలోకి పిలిపించారు. పట్టెడు నగలతో, పట్టుచీర కట్టుకున్న ఓ సుమంగళి వస్తూనే, ఏడుస్తూ లాయరుగారి కాళ్ళు పట్టుకున్నంత పనిచేసింది.

"అయ్యొయ్యో... ఏమిటమ్మా ఇది... తప్పు... లేవండి. లేవండి" అంటూ కాళ్ళు పక్కకు జరుపుకున్నారు లాయర్‌గారు.

"లాయరుగారూ! మీరే మమ్మల్ని రక్షించాలి" ముక్కు చీదేస్తూ మరోసారి లాయరుగారి కాళ్ళు వాటేసుకోబోయిందా సుమంగళి.

"అయ్యో... మీరలాంటి పని చెయ్యొద్దు. అలా కూర్చుని విషయం ఏమిటో చెప్పండి" ఈసారి మరి ఆ కాళ్ళు ఎక్కడ పెట్టుకోవాలో తెలీనట్లు ముడుచుకుపోయారు లాయరుగారు నిస్సహాయంగా ఆ మగవాళ్ళ వంక చూస్తూ. అందులో ఒకతనికి యాభై ఏళ్ళుంటాయి. అతను ఆవిడ భర్త.

"మాణిక్యం! నువ్విలా కుర్చీలో కూర్చో..." అంటూ భార్యను బలవంతంగా కూర్చోబెట్టారు.

కుర్చీలో కూర్చున్న మాణిక్యం ముక్కుచీదేస్తూ "ఆ మాయదారి ముండ... మా కొంప ముంచింది లాయరుగారూ!" అంది.

లాయరుగార్కి సగం విషయం అర్థమైపోయింది. "వరకట్నపుచావు" వెంటనే లాయరుగారి మెదడు చురుగ్గా వారి స్థితిగతులను అంచనావేసింది. ఫరవాలేదు. బాగానే గిట్టుబాటు అయ్యేలా వుంది. కాకపోతే చెయ్యి జార్చే రకంలా లేదు.

అసలు వుంటే చాలుగానీ వాళ్ళ జేజెమ్మ చేత కూడా అనుకున్న దానికంటే రెట్టింపు కక్కించగలడు... అందుకు సందేహం లేదు. పరిస్థితిని ఒక్కనిముషంలో అంచనా వేసిన లాయరుగారు ఆసక్తిని ప్రదర్శిస్తూ "వివరంగా చెప్పండి" అన్నాడు.

"లాయరుగారూ! మా కోడలు-" అంటూ ఏదో చెప్పబోతోన్న భర్తను, "మీరు ఆగండి" అంటూ ఒక్క కసురు కసిరి, "లాయరుగారూ! అది మా కొంప ముంచిందండీ..." అంది శోకయుక్తంగా.



"అది అంటే మీ కోడలుగారా? "

"కోడలు కాదండీ. మా ప్రాణానికి కొరివి"

"ఏం చేసింది? "

"ఏం చేస్తుందండీ మా కొంపకు కొరివి పెట్టింది."

"ఏం చేసిందండీ...? " ఈసారి ఆమెను కాకుండా ఆమె కొడుకును అడిగారు లాయరుగారు.

పాతికేళ్ళ వయస్సులో వున్న అతను మన్నుతిన్న పాములా నిర్లిప్తంగా కూర్చున్నాడే తప్ప పెదవి కదపలేదు. అదేదో తనకు సంబంధించిన విషయం కానట్లు.

"లాయరుగారూ! మా కోడలు..." అంటోన్న భర్తను, "మీరాగండీ అన్నింటిలోనూ తెయితెక్కమని మీరే వుంటారెందుకూ...? " మాణిక్యాంబ భర్తను ఒక్క కసురు కసిరింది.

లాయరుగార్కి పూర్తికేసు అర్థమైపోయింది.

"మీ కోడలు ఎప్పుడు చనిపోయింది...?" అడిగాడు.

"మా కొంప ముంచేందుకు ప్రొద్దుటే చచ్చింది. పాడుముండ చచ్చీ సాధిస్తోంది" మెటికలు విరిచింది మాణిక్యాంబ ఆగ్రహంతో.

"ఎలా చనిపోయారు? "

"ఇంకెలా చచ్చిందీ... స్టౌ అంటుకుని చచ్చింది"

"ప్రమాదంలోనా...? "

"ఆc..." సాగదీసింది మాణిక్యాంబ.

"మరి అలాంటప్పుడు మీరు నా దగ్గరకు వచ్చిన పనేమిటి? " సూటిగా అడిగాడు లాయరుగారు.

అతనికి ఈ డ్రామా ట్రూపును చూస్తోంటే చిరాగ్గా వుంది. కానీ సహనం పోగొట్టుకోకుండా ప్రశాంతంగా సంభాషణ సాగిస్తున్నారు.

"ఆ మాయదారిముండ ఛస్తూ ఛస్తూ మా కొంపమీదికి తేవడానికి ఏదో కూసి చచ్చిందట"

అంటే కోడలు తన మరణవాఙ్మూలంలో తన మరణానికి తన అత్తగారే కారణమని చెప్పివుంటుందని ఊహించారు లాయరుగారు.

"ఈ విషయం మీకు తెలుసా...? "

"ఏమిటి లాయరుగారూ...? "

"ఒక అత్తను తన కోడలిని వరకట్నం గురించి వేధించి చంపినందుకు ఉరితీశారు. అదీ బహిరంగంగా..."

మాణిక్యమ్మ ముఖం భయంతో పాలిపోయింది.

"వరకట్న చావులను ఇప్పుడు ప్రభుత్వం తీవ్రంగా పరిగణిస్తోంది. కోర్టులు కూడా ఏమాత్రం జాలి చూపించడంలేదు. చాలా కఠినమైన శాసనాలను తెచ్చారు"

కొడుకు చాలా నిర్లిప్తంగా వింటున్నాడు.

మాణిక్యాంబ భర్త చాలా కుతూహలంతో, ఉత్సాహంగా వింటోంటే మాణిక్యాంబ మాత్రం పాలిపోయిన ముఖంతో భయంగా వింటోంది.

లాయరుగారు తన ధోరణిలో చెప్పుకుపోతున్నారు-

"భారతీయ శిక్షాస్మృతి 304 (బి) ప్రకారం వరకట్న చావులకు ఏడు సంవత్సరాల కఠిన కారాగార శిక్షగానీ, లేదూ యావజ్జీవ శిక్షగానీ విధించవచ్చు

భర్తగానీ, అతని బంధువులుగానీ క్రూరత్వానికి గురిచేస్తే, అంటే ఆత్మహత్య చేసుకునే పరిస్థితులు కల్పించడం, ఆమెను తీవ్రంగా గాయపరచడం లేదా ప్రాణాపాయం కల్పించడం, మానసికంగా కానీ,





శారీరకంగా గానీ హింసించడం వంటి పనులు చేయడం, డబ్బు తెమ్మని లేదా ఆస్థులకొరకు వేధించడం వంటి పనులు చేసినవారికి భారతీయ శిక్షాస్మృతి సెక్షన్ 498 (ఎ) ప్రకారం..." అంటూ ఒక్క సెకను ఊపిరి తీసుకునేందుకు ఆగారు లాయరుగారు.

మాణిక్యాంబ ఊపిరి బిగపట్టుకుని వింటోంది. ఆమెకు చెమటలు పడ్తున్నాయి. లాయరుగారు తిరిగి తన మాటలు కొనసాగించారు.

"కాబట్టి వరకట్నం చావుకు కారణమైన వాళ్ళకు ఉరిశిక్ష విధించడంగానీ, యావజ్జీవ ఖైదు వేయడంగానీ జరుగుతుంది..." తాపీగా ముగించారు లాయరుగారు.

మాణిక్యాంబ భయంతో ఏడుస్తూ మళ్లీ లాయరుగారి కాళ్లు పట్టేసుకోబోయింది.

"మీరిలా ప్రతిసారీ నా కాళ్లు పట్టేసుకోనక్కర్లేదు. ఏం జరిగిందీ దాచకుండా నిజం చెప్తే చాలు. సాధ్యమైనంతవరకూ ప్రయత్నిద్దాం. ఆపైన మీ అదృష్టం"

"దాచిపెట్టేందుకేముంది లాయరుగారూ! దానమ్మ కడుపు కాల అదెళ్ళిపోయింది. పోయింది పోకుండా నా పీకకు చుట్టింది. అంతే..." ఏడుస్తూ అంది మాణిక్యాంబ.

"అంటే మీరేమీ చెయ్యకుండానే తనంతట తానే చనిపోయి మీ పేరు చెప్పిందంటారా...?"

"అంతే... లాయరుగారూ! అంతే! తనంతటతానే మీద కిరసనాయిలు పోసుకుని, అంటించుకుంటోంటే స్వయంగా కళ్ళారా చూశాను"

"ఆమె కాల్చుకుంటోంటే మీరు చూస్తూ కూర్చున్నారా?"

"అబ్బే.. లేదండీ. అయ్యొయ్యో అదేం పనే నిక్షేపంలా రెండు లీటర్ల కిరసనాయిలు నాశనం చేస్తున్నావు. నీకంతగా చావాలని వుంటే ఏ ఉరో పోసుకుని చావరాదుటే... అంటూనే వున్నాను. అయినా నా మాటేమయినా లెఖ్ఖా, జమా. నేనలా అంటూండగానే అగ్గిపుల్ల వెలిగించుకోనే వెలిగించుకుంది. కాల్చుకోనే కాల్చుకుంది."

"మాణిక్యాంబగారూ! మీరు ఇంకేలాయరునైనా చూసుకోండి. నాకు కుదర్దు" ముందు జాగ్రత్త కొరకు కాళ్ళు పక్కకు జరుపుకుంటూ చెప్పారు లాయరుగారు.

మాణిక్యాంబ లాయరుగారి కాళ్ళకొరకు చూసి అవి అక్కడ లేకపోవడంతో చేసేది లేక బుడిబుడి దీర్ఘం తీస్తూ, "అదేమిటి లాయరుగారూ! మిమ్మల్ని నమ్ముకుని వచ్చినవాళ్ళం. ఎక్కడికి పోతాం చెప్పండి" అంటూ, "మాట్లాడవేం. అలా బెల్లం కొట్టిన రాయిలా కూర్చోకపోతే... ముంగిలా కూర్చోడానికా వచ్చింది" అంటూ భర్తను విసుక్కుంది.

"నిజమేనండీ లాయరుగారూ! మిమ్మల్ని నమ్ముకుని వచ్చాం" భర్త చెప్పాడు.

"అబ్బే! లాభం లేదండీ. నేను చాలా బిజీగా వున్నాను. మీరిలా నా టైం తినేస్తోంటే నాకు కుదర్దు. మీరు మరో లాయరును చూసుకోవడం మంచిది"

మాణిక్యాంబ తన మెడకు అప్పుడే ఉరితాడు పడ్తోన్నట్లుగా వణికిపోయింది. ఈసారి నిజంగానే ఏడుస్తూ, "లాయరుగారూ! మీరే నాకు దిక్కు. మీరు కాదంటే..." వెక్కిళ్ళ మధ్య మాటలు మింగేసింది.

"లాయరుగారూ! ఇవి చేతులు కావు" అంటూ లాయరుగారి చేతులు పట్టుకోబోయాడు ఆమె భర్త.

"అలా అయితే దాచకుండా అంతా వివరంగా చెప్పాలి. మీరు ఏమాత్రం అబద్ధం చెప్పినా ఈ కేసు నా వల్ల కాదు. మీ తృప్తి కోసం ఈ కేసు తీసుకున్నా ఓడిపోవడమూ,



మీకు "ఉరిశిక్షా" తప్పదు... ఆ పైన మీ ఇష్టం"

"లాయరుగారూ! ఉన్నది ఉన్నట్లు చెప్తాను. కేసు మీరే వాదించాలి" మాణిక్యాంబ భర్త చెప్పాడు.

"ఏమమ్మా! మీకు ఇష్టమేనా...?"

ఇష్టమే అన్నట్లుగా తల ఊపింది మాణిక్యమ్మ ముక్కు ఎగబీలుస్తూ.

"అయితే ఇప్పుడు జరిగింది జరిగినట్లు చెప్పండి"

"అదే కాల్చుకు చచ్చింది... చచ్చింది లాయరుగారూ... దేవుడితోడు" అంది. ఆమె నోటంట నిజం రాదనే విషయం తెలుసుకున్న లాయరుగారు "మీరు కాసేపు బయట కూర్చోండి. మీవారితో మాట్లాడతాను" అన్నారు.

మాణిక్యాంబ అయిష్టంగానే కుర్చీలోంచి లేచింది.

"మాణిక్యం అంతా చెప్పేయనా...?" అడిగాడు భర్త.

"చెప్పండి. ఆ పాపిష్టిది మన పరువు ఇలా బజార్న పెట్టి చచ్చింది. ఏం చేస్తాం" ముక్కుతూ, చీదుతూ చెంగుతో తుడుచుకుంటూ బయటకు వెళ్ళింది మాణిక్యాంబ.

చచ్చిపోయిన కోడలుమీద కారాలూ, మిరియాలూ నూరుతూ మెటికలు విరుస్తూ, పళ్లు నూరుకుంటూ, శాపనార్థాలు పెడుతూ బయట కూర్చుంది.

టి.వి. చూస్తూ మధ్య విరామ సమయంలో బయట తోట చూస్తోన్న అనిల్ లాయరుగారి గదిముందు దయ్యంలా కూర్చున్న మాణిక్యాంబను చూసి ఉలిక్కిపడ్డాడు.

సరిగ్గా అదే సమయంలో మాణిక్యాంబ అనిల్‌ను చూసింది.





'ఈ హిడింబి ఇక్కడికెందుకు వచ్చిందీ?' అనుకున్నాడు అనిల్ లోలోన భయపడుతూ.

అనిల్‌ను చూసిన మాణిక్యాంబ చచ్చిపోయిన తన కోడలిని శపించడం ఓ క్షణం ఆపి, "ఈ కుర్రపీనుగ ఇక్కడ తగలడ్డాడేం? ఈ మాయదారి పీనుగ తనను లాయరుగారింటి దగ్గర చూసినట్లు వీధిలో అందరికీ చెప్తాడేమో. వాళ్ళంతా పత్తిత్తులు పరంజ్యోతులైనట్లూ, నేనొక్కదాన్నే రాకాసినైనట్లూ, కోడల్ని కాల్చుకుతింటున్నట్లూ ఇప్పటికే వీధంతా గుసగుసపోతోంది"

మాణిక్యాంబ ఎన్నడూ లేనిది మనస్సులోనే భయపడింది.

తన మొహం అనిల్‌కు కనిపించకుండా పక్కకు తిప్పుకుని, చెంగుచాటు చేసుకుని పళ్ళు నూరుకుంది కోపంగా.

మాణిక్యమ్మ ఇల్లు అనిల్ ఇంటికి నాలుగిళ్ల అవతలే. ఆవిడంటే ఆ వీధి వీధంతటికీ ఏదో విధమైన భయమే.

ఆవిడ ఇంటింటికీ తిరుగుతూ కోడలిమీద చాడీలు చెప్తూ, ఆ ఇంటి కబురు ఈ ఇంటికీ, ఇ ఇంటి కబురు ఆ ఇంటికీ మోస్తూ ఇరుగూ పొరుగుల మధ్య తగవులు పెడ్తుంటుంది.

ఆవిడ నోరు చాలా పెద్దది. అందుకే ఆ కాలనీలో పెద్దవాళ్లందరికి ఆమె నోరంటే భయం.

అంతేకాకుండా పిల్లలకు కూడా మాణిక్యాలు అంటే చెప్పలేనంత కోపం. మీ వాణ్ణి సినిమాహాల్లో చూశాను. మీ వాణ్ణి పార్క్ దగ్గర చూశాను. పకోడీలు కొనుక్కుతింటున్నాడు. మీ అమ్మాయి కాలేజీకి వెళ్లలేదా. నాకు ఎవరో అబ్బాయితో రోడ్‌మీద కనిపించిందే.

అబ్బో... అబ్బో... మీవాడు సైకిల్‌మీద ముగ్గుర్ని ఎక్కించుకుని ఏం జోరుగా పోతున్నాడులే. అంటూ చూసిందీ, చూడందీ కూడా కలిపి చిలవలూ పలవలుగా

చెప్తుంది.

ఆరోజు ఆ ఇంట్లో పెద్దవాళ్ళకూ పిల్లలకూ మధ్య జరిగితే ఒక మహాయుద్ధం... లేదూ కోల్డ్ వార్.

కొంపతీసి ఈ దయ్యం నన్ను ఇక్కడ చూశానని మమ్మీకి చెప్తుందేమో అనిల్ మనస్సులో చాలా భయపడిపోయాడు. ఆమె తనను చూసివుండదులే. చూసినా గుర్తుపడ్తుందా. చాలా దూరంగా వున్నాగా. అనే చిన్న ఆశ మొలకెత్తగా మరి అక్కడ వుండకుండా లోపలికి జారుకున్నాడు.

లోపల మాణిక్యాంబ మొగుడు లాయరు గారితో మాట్లాడుతున్నాడు.

మాణిక్యాంబకి కోడలు అంటే అసలు గిట్టదు. కోడలంటే గిట్టకపోవడానికి ప్రత్యేక మైన కారణం ఏమీలేదు. కోడలు పుట్టింటి వారు అనుకున్న ప్రకారం కట్నం అంతా దోసిట్లో పోశారు. అనుకున్నవాటికంటే ఘనంగానే లాంఛనాలు జరిపించారు.

ప్రతి పండుగకూ కొత్త బట్టలూ, బహుమతులూ ఘనంగానే ముడుతున్నాయి. కోడలు కూడా బుద్ధిమంతురాలు. పనిమంతురాలు. ఆ అమ్మాయికి ఒకే ఒక లోపం వుంది. అదే నోట్లో నాలుక లేకపోవటం. అంటే చాలా అమాయకురాలు. అయినా మాణిక్యాంబకు కోడలు అంటే గిట్టదు. కారణం... ఆమె కోడలు కావడం. తన చేతికి చిక్కడం... నిజం చెప్పాల్సివస్తే మాణిక్యాంబకు కోడలే కాదు. ఎవరన్నా గిట్టదు. అయితే ఎవరన్నా గిట్టకపోడానికీ, కోడలంటే గిట్టక పోవడానికీ చాలా తేడా వుంది. ఎవరన్నా గిట్టకపోయినా ఆ ఎవర్నీ ఆమె ఏమీ సాధించలేదు.

కానీ కోడలు అలా కాదుకదా!

వంటింట్లో చిక్కిన చెవుల పిల్లిలాంటిది. ఎంత హింసించినా అడిగేవారుండరు. ఆ హింసకు పరాకాష్ఠే ఆరోజు.

మాణిక్యాంబ కోడలిమీద స్వయంగా కిరోసిన్ వంపి అగ్గిపుల్ల గీసి అంటించి కోడలు పెట్టే కేకలు బయటివారెవరికీ వినిపించకుండా తలుపులు వేసింది. ఇక చివరి దశ అని తోచినప్పుడు పెద్దగా రాగాలు తీస్తూ ఏడుస్తూ ఇరుగూ పొరుగును చేర్చింది.

అంతా కలిసి చావుబతుకుల్లో వున్న ఆమెను హాస్పిటల్ కు చేర్చారు.

అయితే మాణిక్యాంబ ఊహించిన విధంగా కోడలు వెంటనే చనిపోలేదు. హాస్పిటల్ లో నరకయాతనపడి మరణవాఙ్మూలం ఇచ్చి మరీ చనిపోయింది.

ఆ మరణ వాఙ్మూలమే మాణిక్యాంబ మెడకు ఉరి(త్రాడై చుట్టుకుంది. మాణిక్యాంబ భర్త తన స్వంత ధోరణిలో చెప్పిన విషయానికి సారాంశం ఇది.

అంతా విన్న లాయరుగారు తన ఫీజ్ కండీషన్స్ అన్నీ చకచకా రెండు నిముషాల్లో చెప్పి అందుకు ఇష్టమైతే కేసు తీసుకుంటాననీ, లేదూ మళ్ళీ తిరిగిచూడకుండా వెళ్ళిపోవచ్చుననీ తేల్చిచెప్పేశాడు.

"ఒక్క నిముషం లాయరుగారూ! మా మాణిక్యాన్ని అడిగి వస్తాను" అంటూ మాణిక్యాంబ మొగుడు భార్య దగ్గరికి వచ్చి లాయరుగారు చెప్పిన విషయాన్ని చెవిన వేశాడు.

"హమ్మో... హమ్మో... వీడి నోరుబడా. హంత డబ్బా! వీడి ఆశ నాశనం గానూ..." అంది మాణిక్యాంబ కొండంత ఆశ్చర్యంతో.

"మరి వద్దని చెప్పేయనా...?"

మాణిక్యాంబ మొగుడివంక గుర్రుగా చూసింది. భార్య మొహంలో గుర్రుమంటోన్న చిరుతపులి ముఖం కనిపించి వణికి పోయాడు మాణిక్యాంబ మొగుడు.

"డబ్బు కొరకు చూసుకుంటే ఎలా



మాణిక్యం. నీకంటే డబ్బు ఎక్కువా?" అన్నాడు వెంటనే తెలివితెచ్చుకుని.

"ఓ పదివేలు తగ్గిస్తాడేమో కనుక్కుందాం" అంటూ బేరం కుదుర్చుకోడానికి లాయరు గారి గదిలోకి వెళ్ళబోయింది మాణిక్యాంబ.

ఆపాటికే లాయరుగారు మరో క్లైంట్‌తో మాట్లాడుతూ ఆమె ప్రవేశానికి అనుమతించలేదు.

ఆమెను వెళ్ళనివ్వకుండా గుమాస్తా గుర్నాథం సైంధవుడిలా అడ్డుకున్నాడు. లాయరుగారు ఎలాగూ నానేపిండం కాదని తెలుసుకుంది మాణిక్యాంబ.

"హమ్మో అయ్యో... వాడి నోరుబడ. వీడిజిమ్మడ. కోర్టులో రెండు ముక్కలు చెప్పినందుకే ఇన్నివేలా...?. వీడికేనాడు రుణపడి వున్నామో. ఆ మాయదారిముండ ఛస్తూ ఛస్తూ ఆ కూత కూయకపోతే వీడి ఎదాన ఇంత డబ్బు పోయాల్సివచ్చేది కాదు. ఏం చేస్తాం. ఇదంతా నా ఖర్మ. నోట్లో నాలికలేని మొగుడూ... వాజెమ్మ లాంటి కొడుకూ... అంతా నా ఖర్మ" సణుగుతూ, గొణుగుతూ, ముక్కుతూ, మూల్గుతూ, చీదుతూ లాయరుగార్ని సహస్ర శాపనార్థార్చన చేస్తూ ఎట్టకేలకు లాయరుగారు కేసు వాదించేందుకు ఒప్పుకుంది ప్రాణభయంతో.

★ ★ ★

నవీన్‌కు ఆరోజు బద్ధకంగా అనిపించింది.

పక్కమీదినుండి లేవబుద్ధి పుట్టక అలాగే పడుకుండిపోయాడు.

"నవీన్ ఇంకా లేవలేదూ... స్కూలుకు టైం అవుతోంటే" పెద్ద గొంతుతో పనిమనిషిని అడిగింది విజయలక్ష్మి

"చిన్నబాబు ఇంకా లేవలేదమ్మా"

"వెళ్ళి లేపు" గద్దించి చెప్పింది.

మిసెస్ విజయలక్ష్మి రామనాథం ఆజ్ఞాపిస్తుందే తప్ప మాట్లాడదు.

"లేపానమ్మా. ఆ బాబు లేచినట్లే లేచి అటుతిరిగి పడుకుంటే నన్నేం చేయమన్నారు? నాకు తొందరగా అంట్లు వేయండి. నేను మళ్ళీ అచ్చెమ్మగారింటికి వెళ్ళాలి" విసురుకుంది పనిమనిషి తన ధోరణిలో.

అచ్చెమ్మ పేరు వినగానే మిసెస్ విజయలక్ష్మి కోపం అటు మళ్లింది.

అలా జరుగుతుందనే విషయం పనిమనిషికి బాగా తెలుసు.

"అలగా వాళ్ళతో స్నేహంచేసి వీడికీ అలగా అలవాట్లు అబ్బుతున్నాయి. ఆ అలగాజనంతో స్నేహం వద్దురా అంటే వినడు. అలగా..."

తల్లి 'అలగా' దండకం వింటూ లేచి కూర్చున్నాడు నవీన్.

వళ్ళంతా నొప్పులు... చలి.

చెప్దామంటే అన్నీ దొంగవేషాలు... అని తిడుతుంది తల్లి.

నవీన్ నెమ్మదిగా లేచి బ్రష్ చేసుకుని స్నానం చేసి పాలు తాగాడు. వెంటనే కడుపులో తిప్పినట్లయి వాంతి చేసుకున్నాడు.

తల్లి అచ్చెమ్మ పుట్టింటివాళ్ళు ఎంత అలగా వాళ్లో పనిమనిషితో చెప్తూ కొడుకు వాంతిచేసుకోవడం చూసింది కానీ, అట్టే పట్టించుకోలేదు.

నవీన్ లేని ఓపిక తెచ్చుకుని స్కూలుకు బయలుదేరాడు.

మధ్యాహ్నానికల్లా టెంపరేచర్ పెరగడంతో టీచర్ రిక్షాలో ఇంటికి పంపేశారు.

ఇంట్లో ఎవరూ లేరు. తండ్రి కోర్టుకూ, తల్లి క్లబ్‌లో జరిగే ఏదో ఫంక్షన్‌కు చందాలు వసూలు చేసేందుకూ వెళ్ళిపోయారు.




నవీన్ పుస్తకాలు తలకింద పెట్టుకుని వరండాలో ముడుచుకుని పడుకున్నాడు సాయంత్రం వరకూ.

మరో మూడురోజులు గడిచాయి.

నవీన్ శరీరం నిండా దద్దు చూపింది. విపరీతమైన జ్వరంతోపాటు తలపోటూ, వళ్లనొప్పులు.

డాక్టర్ రెండు పూటలూ వచ్చి మందులూ, ఇంజక్షన్లూ ఇచ్చి వెళ్తున్నారు. రామనాథంగారు కోర్టుకు వెళ్లేముందూ, కోర్టునుండి వచ్చాక కొడుకును పలకరించి కాసేపు దగ్గర కూర్చుని వెళ్తున్నాడు.

పనిమనిషి వేరే పనులు మానుకుని నవీన్‌కు తోడుగా రోజంతా ఇంట్లోనే వుండిపోతోంది.

అయినా నవీన్‌కు ఏదో అసంతృప్తి-

వాడి శరీరం ఒక చల్లని ఆత్మీయమైన స్పర్శనూ, మనస్సు ఆత్మీయమైన పలకరింపునూ కోరుకుంటున్నాయి.

పగలంతా ఇంట్లో ఎవరూ వుండరు. ఇంట్లో తనకుతోడుగా వుంచిన పనిమనిషి హాల్లో వున్న టి.వి. ఆన్ చేసుకుని సినిమా చూడ్డంలో మునిగిపోయి తను పిలిచినా వినిపించుకోదు. వినిపించినా పలకదు. పలికినా రాదు. వచ్చినా ధుమధుమలాడుతూ తను అడిగింది ఇచ్చి మళ్ళీ వెళ్ళి టి.వి. ముందు కూర్చుంటుంది.

తన తలను నిమురుతూ, తనకు కబుర్లు చెప్తూ, తన పక్కనే తోడుగా ఎవరైనా వుంటే బాగుండును.

మిసెస్ విజయలక్ష్మి రామనాథం ఉదయం భోజనంచేసి ఇంట్లోంచి బయట పడితే, మళ్ళీ ఏ రాత్రికో ఇల్లు చేరుతుంది అలసటగా.

ఆమెకు బయట ఊపిరి తీసుకోలేనంతగా పనివుంటుంది.

క్లబ్‌లో "ఇందిరాగాంధీ జన్మదిన" సందర్భంగా ఘనంగా ఫంక్షన్ ఏర్పాటు చేయాలని సంకల్పించింది విజయలక్ష్మి రామనాథం.

ఇదివరలో మిసెస్ అచ్చెమ్మ హయాంలో అలాంటి ఫంక్షన్ జరగలేదు. ఇప్పుడీ ఫంక్షన్ సక్సెస్ అయితే ఆమె ప్రతిష్ఠ పెరుగుతుంది.

అన్నింటినీ మించి మిసెస్ అచ్చెమ్మ ముఖాన కొట్టినట్లు వుంటుంది. ఆమె ముఖం ఈ ఫంక్షన్ చూసి మాడిపోవాలి.

అదే విజయలక్ష్మి రామనాథం ధ్యేయం. ఏకైక లక్ష్యం.

ఇంత గొప్ప ధ్యేయంతో మిసెస్ విజయలక్ష్మి రామనాథం మరో నలుగురు సభ్యుల్ని వెంటేసుకుని పగలనక రాత్రనక ఫండ్స్ కొరకు శ్రమిస్తోంది.

ఫంక్షన్ సందర్భంగా భారీగా అన్నదానం చేసేందుకూ, పేదస్త్రీలకు చీరల పంపకం, పిల్లలకు మిఠాయిలు పంచడం రాత్రి టౌన్ లోని పెద్దలకు గ్రాండ్‌గా డిన్నరు... ఆపైన సినీమాతార డాన్స్ ప్రోగ్రాం...

ఈమధ్యలో మంత్రిగారితోపాటు గ్రామ పెద్దల సన్మాన కార్యక్రమం ఓహో... అద్భుతమైన ప్రోగ్రాం ఫిక్స్ చేసింది.

అయితే ఈ ప్రోగ్రాం కండక్ట్ చేసే విషయమై, చందాలు వసూలు దగ్గర్నుండీ ఆహ్వానపత్రాల ముద్రణవరకూ, క్లబ్ అలంకరణనుండి వందన సమర్పణవరకూ సమస్తమైన పనులూ, తన చేతిమీదుగా, తన ఆధ్వర్యంలో, తన ఆధిపత్యంలో జరగాలనేది విజయలక్ష్మి రామనాథం తాపత్రయం.

రావలసిన కీర్తిలో వీసమంతయినా ఇతరులకు చెందడం అనేది ఆమె సహించలేని విషయం.

ఇంత కార్యభారం ఆమె భుజాలమీద వుండగా నవీన్ జ్వరం తెచ్చుకోడం పెద్ద

న్యూసెన్సులా తయారయ్యిందామె ప్రాణానికి.

ఛీ... ఛీ... వెధవ పిల్లలు. అలగా వాళ్ళతో తిరిగి జ్వరాలు తెచ్చుకుంటారు. అంటూ విసుక్కుపోయేది ఇంట్లో వున్న కాసేపూ.

"మావాడికి మూసిన కన్ను తెరవకుండా జ్వరం కాస్తోంది. అయినా నాకీ చాకిరీ తప్పడంలేదు. ఒప్పుకున్నాక తప్పుతుందా చెప్పండి. ఇటు ఇంట్లోనూ, బైటా ఒక్కర్తినీ చూసుకోలేక సతమతమైపోతున్నానంటే నమ్మండి" అంటూ నలుగురి ముందూ ఆపసోపాలు పడేది.

ఆ రాత్రి విజయలక్ష్మి నవీన్

వెధవ జ్వరం తెచ్చుకోడం కారణంగా చాలా త్వరగా అంటే పదిగంటలకే ఇల్లు చేరుకుంది.

నవీన్ జ్వరతీవ్రతతో మంచంమీద అసహనంగా దొర్లుతున్నాడు. కొడుకు మంచం మీద కదలడం చూసి, "ఏరా... ఇంకా జ్వరం తగ్గలా" అంది ముడిపిన్నులు తీసి డ్రస్సింగ్ టేబిల్ మీద వుంచుతూ.

నవీన్ మగతగా కళ్లు విప్పి చూశాడు.

జ్వరతీవ్రతలో తల్లి నవీన్ కళ్లకు అందంగా, మనోహరంగా, లలితంగా దేవతలా కనిపించి, "అమ్మా" అని పిలిచాడు ఆర్తిగా.

"అన్నట్లు డాక్టర్ వచ్చి వెళ్ళాడా? మందు వేసుకున్నావా...?" తల్లిని కౌగలించుకోవాలనీ, ఆమె ఒడిలో తల పెట్టుకుని పడుకోవాలనీ తపించిపోతోంది నవీన్ హృదయం.

"మందు వేసుకున్నావా... అంటే మాట్లాడవేంరా?" అని తర్వాత "మంగమ్మా, నవీన్ మందు వేసుకున్నాడా... జావకాచి ఇచ్చావా..." అని గట్టిగా అడుగుతూ ఆ





గదిలోనుండి వెళ్ళిపోయింది విజయలక్ష్మి.

అమ్మ తనను ఒక్కసారి ఒడిలోకి తీసుకుంటే ఎంత బాగుంటుంది. అమ్మ ఒక్కసారి చల్లగా, హాయిగా తన శరీరాన్ని నిమిరితే ఎంత హాయిగా వుంటుంది. హార్లిక్స్ అమ్మ తాగిస్తే ఎంత రుచిగా వుంటుంది. అమ్మ... అమ్మ... అమ్మ... ఒక్కసారి తనను ఒడిలోకి తీసుకుంటే... నవీన్ మగతలోకి జారిపోతూ కలవరించాడు.

అమ్మా... అమ్మా... అమ్మా.

అతని కలలో అమ్మ-

ప్రశాంతమైన చిరునవ్వుతో శాంతిదేవతలా అమ్మ...

ఆప్యాయంగా తనను పొదివి పట్టుకుని లాలిస్తూ, బుజ్జగిస్తూ మందు తాగిస్తోన్న అమ్మ.

అమ్మ నవ్వు ఎంత మధురంగా వుంది.

నవ్వుతూ కమ్మగా తనకు కథలు చెప్తూ హార్లిక్స్ తాగిస్తోంది అమ్మ. ఈ అమ్మ అస్తమానం పక్కవాళ్లను "అలగా వాళ్లు" అని తిట్టడంలేదు.

ఎవరినీ చూసి చిరాకు పడ్డంలేదు.

తన స్నేహితుల్ని "అలగా వాళ్లు" అని తిట్టడంలేదు.

తన స్నేహితుల్ని కూడా ప్రేమగా పిలిచి తనతోపాటు టిఫిన్స్ పెడుతోంది. స్నేహితులంతా మీ మదర్ ఎంత మంచిదిరా నవీన్... అని పొగుడుతోంటే తనకెంత సంతోషంగా వుందో. అమ్మ పొద్దస్తమానం "అచ్చెమ్మా రెడ్డిని తిట్టడంలేదు. అంతే కాదు... వేణుతో స్నేహంగా వుండమని తనను ప్రోత్సహిస్తోంది.

గాడిదా... పీనుగా... ఒరేయ్ నవీన్. అంటూ గొంతు చించుకుని అరవడం లేదు.

సరళంగా, మృదువుగా తేనె ప్రవాహంలా మధురంగా మాట్లాడుతోంది. ఈమె స్వరం కటువుగా భయంకరంగా లేదు.

ఈమె ముఖం ధుమధుమలాడుతూ చిరుతపులి ముఖంలా కనిపించడంలేదు.

అమ్మ ముఖం ప్రశాంతమైన చిరునవ్వుతో, శాంతితో ప్రేమతో మెరిసిపోతోంది.

మరీ మరీ చూడాలని పించేలా కాంతిగా, అందంగా వుంది.

అమ్మ... అమ్మ... అమ్మా...

కలవరిస్తున్నాడు నవీన్.



**వే**ణుకూ, నవీన్‌కూ పడకపోవడానికి కొంత బ్యాక్‌గ్రౌండ్ వుంది.

వేణూ, నవీన్‌ల ఇళ్లు ఒకే వీధిలో వున్నాయి.

నవీన్ మదర్ మిసెస్ విజయలక్ష్మీ రామనాథం.

వేణు మదర్ మిసెస్, అచ్చెమ్మారెడ్డి... టౌన్‌లేడీస్ క్లబ్‌మెంబర్స్. ఆ క్లబ్ పేరు "ఇందిరా ప్రియదర్శినీ క్లబ్"

స్త్రీల మనోవికాసానికి కావలసిన పుస్తకాలు, గేమ్సు ఇతర కార్యక్రమాలు ఈ క్లబ్బులో వున్నాయి.

టేబిల్ టెన్నిస్, ఛెస్, క్యారమ్స్, బ్యాట్‌మింటన్, వంటి ఆటలు, టి.వి. రేడియో వంటి వినోదాలూ వున్నా ఇక్కడికి వచ్చే స్త్రీలు మాత్రం ఇవేవీ పెద్దగా ఉపయోగించుకోరు.

ఎప్పుడో ఓసారి చుక్క తెగిపడ్డట్లుగా నలుగురూ కలిసినరోజు ఆరోజు తమ ఇంట్లో చేసిన వంటకాల గురించీ, క్రితం నెలలో తమ ఇంట్లో జరిగిన ఫంక్షన్‌లో అత్తగారు ముఖం గంటు పెట్టుకోవడం గురించీ, పోయిన వారం షాపింగ్‌లో ఖరీదు చేసిన వస్తువుల గురించీ చాలా ఇష్టంగా మాట్లాడుకుంటారు.

ఈ స్త్రీలకు ఇంతకంటే ఇష్టమైన విషయం మరొకటి కూడా వుంది.

తాము కట్టుకున్న చీరలను, పెట్టుకున్న నగలను ఇతరులతో పోల్చిచూసుకోవడం, వాటి పుట్టుపూర్వోత్తరాలూ, వాటిని ఎలా సాధించగలిగినదీ వినేవారికి బోర్ కొట్టకుండా చెప్పడం.

అలా చెప్పలేనివారిని, అవి లేనివారిని వెలివేసినట్లు చూడటం... ఈ స్త్రీలకు అంతకంటే కూడా ఆనందం కలిగించే విషయం మరోటి వుంది.

అదేమంటే-

తమ మధ్యలేని మిసెస్ బుచ్చెమ్మా నీలకంఠం గురించో లేక మిసెస్ వెంకాయమ్మా సుబ్బారావును గురించీ అవాకులూ, చెవాకులూ చెప్పుకోవడం.

అయితే ఇందిరాప్రియదర్శినీ క్లబ్‌మెంబర్స్‌కు ఇవే పనులా అంటే కాదు. మరికొన్ని అదనపు బాధ్యతలు కూడా వున్నాయి. క్లబ్ యానివర్సిరీకి ముందు మూడు నెలలుగా పరిచయస్తుల ఇళ్లపై దాడిచేసి, మొహమాట పెట్టి చందాలు దండుకోడం.

ఆ డబ్బుతో రెండు కుట్టుమిషన్లు, నాలుగు అప్పడాల కర్రలూ, రెండు పీటలూ, పది పలకలూ, ఇరవై బలపాలూ, ఓ రెండు పాకెట్ల పంచదార బిళ్ళలూ ఖరీదుచేసి, యానివర్సిరీకి క్లబ్‌ను అందంగా ముస్తాబు చేసి, అంతకంటే కూడా ఘనంగా

డిన్నరు ఏర్పాటుచేసి ఏ మంత్రినో, మంత్రిణినో క్లబ్‌కు ఆహ్వానించి వారి సమక్షంలో పేదస్త్రీలకు, వారి పిల్లలకు చేసే సహాయం పేరిట అప్పడాల పీట ఒకరికి, కర్ర వేరొకరికీ, పలక ఒకరికి, బలపం మరొకరికీ పంచుతూ ఫొటోలకు చక్కని ఫోజులు ఇస్తూ మంత్రిగారితోసహా ఆర్భాటంగా డిన్నరు ఆరగించి ఆనాటికా కార్యక్రమం పూర్తిచేసుకుని, మరునాటికల్లా ఫొటోలను ఫ్రేం కట్టించేసి గోడలకు తగిలించేస్తుంటారు. ఫ్రేం కట్టించని వాటిని ఆల్బంస్‌లో అమర్చుకుని తృప్తిపడిపోతుంటారు.

ఇది ప్రతి సంవత్సరమూ జరిగే తంతే. లేడీస్ క్లబ్‌లంటే అంతకంటే గొప్ప అభిప్రాయాలు ఏర్పరచుకోని ప్రజలు వాటిని అట్టే పట్టించుకోరు.

ఇందిరా ప్రియదర్శినీ క్లబ్‌కు గత మూడు సంవత్సరాలుగా మిసెస్. అచ్చెమ్మ ప్రెసిడెంట్‌గా ఏకగ్రీవంగా ఎన్నికవుతోంది. అయితే క్లబ్ కార్యక్రమాలవల్ల మిసెస్ అచ్చెమ్మకు పెరుగుతోన్న ఇన్‌ఫ్లుయన్స్ మిసెస్ విజయలక్ష్మి రామనాధానికి రంపపు కోత అయ్యింది.

ప్రతి ఫొటోలోనూ మంత్రిగారితో కనిపించే అవకాశం ప్రెసిడెంట్ అయితే తప్ప వుండదు.

అందుకే మిసెస్ విజయలక్ష్మి రామనాధం ఆ సంవత్సరం ప్రెసిడెంట్ పదవికి పోటీ చేయడానికి నిశ్చయించుకుంది.

రాజకీయాలలో తనకు ఎదురు వుండకూడదని భర్త ఎలా అనుకుంటాడో అలాగే క్లబ్ ప్రసిడెంట్ పదవి విషయంలో తనకు ఎదురు వుండటం సహించలేదు మిసెస్ అచ్చెమ్మ.

మిసెస్ విజయలక్ష్మి రామనాధం పోటీ చేస్తుందని తెలుసుకుని ఉగ్రురాలయింది.

అంతే... ఇద్దరి మధ్యా ప్రచ్ఛన్న యుద్ధం ప్రారంభమయింది. మిగిలిన మెంబర్స్ ఆమెకు చెప్పేవి ఆమెకు చెప్తున్నారు, ఈమెకు చెప్పేవి ఈమెకు చెప్తున్నారు.

ఎన్నికల డేట్ దగ్గర పడుతోన్నకొద్దీ ఇరు పక్షాల మధ్యా వేడి పుంజుకుంది.

దాంతో మధ్యవారికి ఇక్కడి మాటలు అక్కడా, అక్కడి మాటలు ఇక్కడా చేరవేసే కార్యక్రమం ముమ్మరం కావడంతో ఇంట్లో మగవాళ్ళు, పిల్లల తిండీ తిప్పల విషయం వెనక్కు పెట్టి ఇతోధికంగా సేవచేస్తున్నారు.

దానికితోడుగా ఇద్దరి ఇళ్ళల్లోనూ పనిచేసే పనిమనిషి ఒక్కతే కావడంతో ఈ ఎలక్షన్ తంతు మరీ ఊపు అందుకుంది. వైర్‌లెస్ సెట్‌కంటే కూడా వేగంగా వార్తలు చేరిపోతున్నాయి. మిసెస్ విజయలక్ష్మి రామనాధం ఇంట్లో చాలా పొదుపుగా వుంటారని తెలిసిన మిసెస్ అచ్చెమ్మ తినడం, ఒకళ్లకు పెట్టడం వాళ్లకేం తెలుసు? ఎన్నడయినా తిన్న మొహాలు అయితేగా? అంటూ ఈసడించింది.

మిసెస్ అచ్చెమ్మ ఇంట్లో తిన్నంత తిని పారేసినంత పారేసి దుబారా చేస్తారని తెలిసిన మిసెస్ విజయలక్ష్మి రామనాధం, తిండిపోతు ముఖాలు. కష్టపడి సంపాదించేది అయితేగా విలువ తెలీడానికి. ఊరి మీదపడి దండుకు తెచ్చిందేగా...? అంటూ చెరిగిపోసింది. మిసెస్ విజయలక్ష్మి రామనాధం ఉదయం పేపరు వాడితో పోట్లాడిన విషయం మిసెస్ అచ్చెమ్మ ఇంట్లో తెలిస్తే సాయంత్రం మిసెస్ అచ్చెమ్మ చాకలాడితో యుద్ధం చేసిన వైనం మిసెస్ విజయలక్ష్మి రామనాధం గారింట్లో తెలిసిపోతోంది.

మిసెస్ అచ్చెమ్మ అత్తగార్ని వెళ్లగొట్టిన విషయం మిసెస్ విజయలక్ష్మి రామనాధానికీ, మిసెస్ రామనాధం ఆడపడుచుకు నాసిరకం చీర పెడ్తే ఆవిడ దాన్ని వదిన గారి మొహాన విసిరేసి వెళ్లిన వార్తలు మిసెస్ అచ్చెమ్మకీ నిముషాల మీద అందుతున్నాయి.





ఏ మాటకామాటే చెప్పుకోవాలి. ఇంత సేవ చేస్తోన్న పని మనిషి మాత్రం తన సేవల నిమిత్తం కూరలూ, పచ్చళ్లూ, పాతచీరలూ తప్ప అదనంగా ఏమీ డిమాండ్ చేయడంలేదు.

మిసెస్ విజయలక్ష్మి రామనాథం అచ్చెమ్మని ఆమె మద్దతుదార్లను 'అలగావాళ్లు' అని తిడితే, మిసెస్ అచ్చెమ్మ మిసెస్ విజయలక్ష్మి రామనాథాన్నీ ఆవిడ మద్దతుదార్లనూ లేకివాళ్లు అని తిట్టిపోస్తోంది.

మిసెస్ విజయలక్ష్మి రామనాథం, మిసెస్ అచ్చెమ్మని గూర్చి 'కల్చర్‌లెస్ బ్రూట్' చదువా... సంధ్యా... ఒట్టి ఎద్దు మొద్దు అవతారం' అని ప్రచారం చేస్తే, మిసెస్ అచ్చెమ్మ మిసెస్ విజయలక్ష్మి రామనాథాన్ని గూర్చి, చిన్నదా చితకదా ఏమిటా బోగం వేషాలు.. నాలుగు ఇంగ్లీషు ముక్కలు వచ్చినంత మాత్రాన అంత మిడిసిపాటా? సంస్కారం లేని చదువు ఎందుకూ? తగలెయ్యనూ?" అంటూ ఎదురు దాడి ప్రారంభించింది.

మిసెస్ అచ్చెమ్మ క్రితం సంవత్సరం వసూలు చేసిన చందాలు, అందులో కుట్టు మిషన్ తన అనుయాయులకే ఇచ్చిన వైనం, అప్పడాల కర్రలు కొనడంలో చేసిన ఫ్రాడ్, అప్పడాల పీటలు ఖరీదు చేయడంలో జరిగిన అవకతవకలు, బలపాలు కొనడంలో జరిగిన అవినీతి భాగోతం వివరాలను సభ్యులందరికీ విసుగూ విరామం లేకుండా చెప్పిన తీరులో చెప్పకుండా చెప్పింది.

ఎట్టకేలకు ఇందిరా ప్రియదర్శినీ లేడీస్ క్లబ్ ఎన్నికల కార్యక్రమం విజయవంతంగా ముగిసి రెండు ఓట్ల మెజారిటీతో మిసెస్ విజయలక్ష్మి రామనాథం క్లబ్ ప్రెసిడెంట్ పదవికి ఎన్నికయింది.

ఎలక్షన్ పూర్తి అయినప్పటినుండీ పరిస్థితి మరీ దారుణంగా మారింది.

"దొంగలనూ, కేడీలనూ, లుచ్ఛాలనూ గెలిపించి దాని మొగుడు లక్షలకు లక్షలు పోగుచేస్తున్నాడు" అంది మిసెస్ అచ్చమ్మ అక్కసు పట్టలేక.

"అవును నా మొగుడే రాజకీయాల్లో రోజుకో పార్టీ మారుస్తూ ప్రజల సొమ్ము అప్పనంగా లక్షలకు లక్షలు మింగుతున్నాడు. సిగ్గులేకపోతేసరి" అంటూ తిప్పికొట్టింది మిసెస్ విజయలక్ష్మి రామనాథం.

"చూశారా... చూశారా... అది ఎంత మాట అందో" భర్త దగ్గర వాపోయింది అచ్చెమ్మ.

"ఎవరు?"

"అదేనండీ మిసెస్ విజయలక్ష్మి. రామనాథం పెళ్లాం ముండ"

"ఎవరు లాయర్‌గారి భార్యా...?"

"ఆc లాయరుగారి భార్యే. బడిత. ఆషోకూ.. ఆ వేషం ఛీఛీ సిగ్గు బిడియాలు ఏ కోశానలేవు. తగుదునమ్మా అని నలభై ఏళ్లు పెట్టుకుని వాలుజడ, జార్జెట్ చీరలతో తయారవుతుంది"

"ఇంతకూ ఏమిటి విషయం?" విసుగు దాచుకుంటూ అడిగాడు భర్త.

"మనం రోజుకోపార్టీ మారుస్తూ ప్రజలను దోచుకుతింటున్నామట"

వద్దనుకున్నా రెడ్డిగారికికోపం వచ్చింది.

"వాళ్లాయనే అంత నీతిగా సంపాదిస్తున్నాడటనా? అడక్కపోయావ్"

"అడక్క ఊరుకుంటానా ఏమిటి?" అంది. కానీ అసలు వాళ్లాయన్ను తనే ముందు అన్న విషయం భర్తకు చెప్పలేదు.

"నీతో అందా ఆ మాట ఆవిడ...!"

"నాతో అని మళ్లా బతికి వుంటుందా? ఉతికి ఝాడించి ఆరేయనూ?"

"మరి ఎవరి దగ్గర అంది? "

"పని మనిషితో అందిట"

"చూడూ! పని మనిషి మాటలు విని గొడవలు పెట్టుకోడం మంచి పద్ధతి కాదు. వాళ్లు అక్కడ చెప్పేవి అక్కడ, ఇక్కడ చెప్పేవి ఇక్కడ చెప్తుంటారు. అయినా నీకెం దుకీ క్లబ్బులూ గొడవలు. హాయిగా ఇంట్లో పిల్లల్ను చూసుకుంటూ కాలక్షేపం చెయ్యక"

"ఊం.. సరి సరి సంబడం. మీకేమ యినా చెప్తే సరి ఉపన్యాసం మొదలు పెడ తారు. ఆ పిచ్చిజనం వింటారు. నాకా ఓపి కలేదు ఇహ పడుకోండి" అంటూ విసురు కుంది అచ్చెమ్మ.

సరిగ్గా అదే రాత్రి అదే సమయంలో,

"చూశారా? !"

"ఊం"

"ఈ విషయం విన్నారా"

"ఊం" పరధ్యానంగా ఊ కొడుతున్నారు లాయరుగారు. ఆయన మనస్సంతా కోడ లిని చంపిన ఆ మాణిక్యమ్మగారి కేసు గెలి పించడం మీదే లగ్నమయి వుంది. ఆ రావు గారి కేసు సరేసరి.. ఆరెండు కేసులు గెలి పిస్తే పెరిగే బ్యాంక్ బ్యాలన్స్ అతన్ని ఊరి స్తోంది.

"ఆవిడ ఎంత మాటందో చూశారా? "

"మాణిక్యమ్మా.. ఏమంది? "

"మాణిక్యమ్మ ఎవరూ? "

"కోడల్ని కాల్చి చంపింది"

"ఖర్మ.. ఖర్మ. నేను చెప్పేదేమిటి? మీరు చెప్పేదేమిటి? "

"ఏమిటి చెప్తున్నావు? "

"మిసెస్ అచ్చెమ్మ లేదూ... ఆ నక్క. అది" మళ్లా పరధ్యానంలోకి జారబడిన లాయరుగారు, "ఏ నక్క? " అన్నారు పర ధ్యానంగా.

"అదేనండీ.. అచ్చెమ్మ"

"ఊం"

"ఖర్మ. మీరు వినడం లేదుకదూ... ఎప్పుడూ ఆ అలగావాళ్లను గురించిన ఆలో చనలేగానీ ఇంటి విషయాలు మీకు పట్టవు" విసురుగా అంది విజయలక్ష్మి.

"సారీ... సారీ... నేనేదో పరధ్యానంలో వున్న మాట నిజమే. ఏమిటి చెప్తున్నావు? ఈసారి జాగ్రత్తగా వింటాను చెప్పు" లాయ రుగారు అనునయంగా అన్నారు.

"మనమట లుచ్చాలనూ, రౌడీలనూ, కేడీ లను, హంతకులను గెలిపించి లక్షలకు లక్షలు సంపాదిస్తున్నామట"

లాయరుగార్కి ఆ మాట చురుక్కున తగి లింది.

"ఎవరన్నారు? డిఫమేషన్ సెక్షన్ క్రింద బొక్కలో తోయించేస్తాను" అన్నారు కోపంగా.

"ఇంకెవరు... మిసెస్ అచ్చెమ్మ" అక్క సుగా చెప్పింది విజయలక్ష్మి.

అచ్చెమ్మ ఎవరో లాయరుగారికి తెలుసు.

"వాళ్లాయన లాగ బినామీ పేర్లతో ప్రభుత్వ స్థలాలు కొట్టేయలేదని, పార్టీలు మార్చి పదవులు సంపాదించలేదనీ చెప్పలే కపోయావ్"

"అన్నాను.. నాకేం భయమా? "

"మనం రౌడీలను గెలిపిస్తున్నామని ఆవిడ నీతో అందా? "

"నాతో అంటే ఊరుకుంటానా? అయిన కాడికి ఉతికి, ఝాడించి, ఇస్త్రీ పెట్టిమరీ వది లేదాన్ని"

"మరి? "

"మన పనిమనిషితో అందిట"

"ప్చ్... పనిమనుషులు సాక్ష్యానికి నిల వరు. వాళ్ల మాటలు పట్టించుకోవద్దు. ఏ కేసయినా గట్టి సాక్ష్యం లేందే ఎలా గెలు





స్తుంది? ఇప్పుడు మాణిక్యమ్మ కేసే చూడు. కోడలు ఛస్తూ్తఛస్తూ తనను అత్తే కాల్చి చంపిందని మరణ వాగ్మూలం ఇచ్చి మరీ చచ్చిపోయింది. అంటే మాణిక్యమ్మ నేరం చేసినట్లు బలమైన సాక్ష్యం వుందన్నమాట. అది మార్చేప్పటికి తలప్రాణం తోకకు వస్తుంది లాయరుకు"

"అబ్బబ్బ... మీకెప్పుడూ సాక్ష్యాలూ కేసులూ, కోర్టులూ తప్ప సంసారం, ఇల్లూ, పెళ్లాం, పిల్లలు మాత్రం పట్టరు" విసుక్కుంది భార్య.

★ ★ ★

లాయరుగారూ, రెడ్డిగారూ లయన్స్ క్లబ్ మెంబర్స్. ప్రతిరోజూ క్లబ్‌లో కలుసుకున్నప్పుడు ఒకరినొకరు చిరునవ్వుతో విష్ చేసుకునేవారు.

ఒకే వీధి కావడంచేత కొంచెం పరిచయం కూడా. ఆ పరిచయంతో ఒక్కోసారి హలో అంటే హలో అని కూడా అనుకుంటుంటారు.

అయితే ఆ రోజు క్లబ్‌లో ఒకరికొకరు ఎదురుపడ్డప్పుడు చప్పున వాళ్లకు రాత్రి తమ తమ భార్యలు చెప్పిన మాటలు గుర్తుకు వచ్చి చిరునవ్వు నవ్వబోయిన పెదవులు బిగుసుకుపోయాయి.

ముఖాలు కందగడ్డల్లా మారిపోగా ముఖాలు తిప్పుకుని వెళ్లిపోయారు. లాయరుగారు తన పరిచయస్తులతో రెడ్డిగారు అన్న మాటలు చెప్పుకుని రెడ్డిగార్ని మరో నాలుగు మాటలు అంటే రెడ్డిగారు లాయరుగారు అన్నమాటలను తన పరిచయస్తులతో చెప్పుకుని లాయరుగార్ని మరో నాలుగు మాటలు అన్నారు.

తక్కువ వ్యవధిలోనే లాయరుగారి మాటలు, రెడ్డిగారికీ, రెడ్డిగారి మాటలు లాయరుగారికీ చేరాయి.

మళ్లా మళ్లా.. మళ్లా మాటల ఈటెలు వేగంగా చేరసాగాయి. ఆడవాళ్లు, మగవాళ్ల మధ్య ఇలా ప్రచ్ఛన్న యుద్ధం సాగుతోండగా ఒకే స్కూల్లో చదువుతోన్న నవీన్, వేణూల మధ్య ప్రత్యక్ష యుద్ధమే జరుగుతోంది.

ఇంట్లోని ఈ వాతావరణం కుర్రవాళ్లను ప్రభావితం చేసింది. ఇద్దరూ ప్రతిచిన్న విషయానికీ ఢీ అంటే ఢీ... అంటూ కయ్యానికి కాలుదువ్వడం ప్రారంభించారు.

స్కూల్లో తాను వేణుతో ఎలా పోట్లాడి గెలిచాడో ఇంట్లో తల్లికి చెప్పేవాడు నవీన్.

మిసెస్ విజయలక్ష్మి రామనాథం కొడుకు ప్రతాపానికి మురిసిపోతూ అలాంటి 'అలగా' వాళ్లకు అలాగే బుద్ధి చెప్పాలి అంటూ ప్రోత్సహించేది.

అదేవిధంగా తాను స్కూల్లో నవీన్‌తో ఎలా తలపడ్డాడో వర్ణించి చెప్పేవాడు వేణు.

మిసెస్ అచ్చెమ్మ సంతోషంతో కొడుకును అభినందించేది. ఆమె తన ఓటమికి అది ప్రతీకారంగా భావించి అలాంటి "లేకి వాళ్లకి" అలాగే బుద్ధి చెప్పాలనీ, వాళ్లను ఏమాత్రం సహించకూడదనీ కొడుక్కు హితవు చెప్పేది.

నవీన్, వేణూ తమతమ తల్లులు ఇస్తోన్న ప్రోత్సాహంతో ఉసిగొలిపిన రెండు కోడిపుంజుల్లా బలాబలాలు తేల్చుకోడానికి ప్రయత్నించేవారు అనుక్షణం.

★ ★ ★

రోజులు గడుస్తున్నాయి... ఇప్పుడు అనిల్‌కు క్రికెట్ గురించి చాలా తెలుసు. ఇండియన్ టీమ్‌లో ప్లేయర్స్ ఎవరైనదీ, టీమ్‌కెప్టెన్ ఎవరైనదీ, ఎవరెవరు ఎలా ఆడగలరన్నదీ, ఫాస్ట్ బౌలర్స్ ఎవరైనదీ, స్పిన్ బౌలర్స్ ఎవరన్నదీ, ఎవరెవరి రన్ రేట్ ఎలా వుండేదీ, ఓవర్‌కు ఎన్ని బాల్స్ వుండేదీ, పిచ్ అంటే ఏమిటి? లాంటి విష

యాల్లో చాలా పరిజ్ఞానం సంపాదించుకున్నాడు.

టి.వి. రుచి మరిగిన అనిల్ ఎలాగోలా వీలు కల్పించుకుని క్రికెట్ మాచెస్‌తోపాటు సినిమాలను కూడా ఎంజాయ్ చేస్తున్నాడు.

యూనిట్ పరీక్షలు అయ్యాయి.

యూనిట్ పరీక్షల డేట్స్ తల్లికి చెప్ప లేదు. తల్లి అడుగుతోంటే ఇంకా డేట్ ఇవ్వ లేదు మమ్మీ అంటూ జరుపుకొచ్చాడు.

యూనిట్ ఎగ్జామ్ డేట్స్ తెలిస్తే తల్లి పరీక్ష... చదువు.. బాగా చదువు... సిల బస్.. అంటూ హడావిడి చేస్తూ చదివే వరకూ ప్రాణాలు తోడేస్తూ బోర్ కొట్టేస్తుంది... అదీ భయం...

పరీక్షలు ఎలాగో రాశాననిపించాడు.

పదిరోజుల తరువాత "యూనిట్ పరీక్షలు ఎప్పుడో అయిపోయేయి మమ్మీ" అంటూ డిక్లేర్ చేశాడు తల్లి అడిగితే.

"ఇంకా డేట్ ఇవ్వలేదని చెప్పావుకదరా?" అంది లక్ష్మి తెల్లబోతూ.

"లేదు మమ్మీ నీకు చెప్పాను. నువ్వు సరిగా వినలేదేమో" అనిల్ స్వరంలో ఎంతో నిజాయితీ.

అనిల్ చెప్తే తాను వినలేదేమో... అనుకోలేకపోతోంది లక్ష్మి. కానీ వాడు చెప్పే ధోరణీ, వాడి మొహంలోని నిజాయితీ అంతే కాకుండా తన కొడుకు అబద్ధం చెప్తాడని ఊహించను కూడా ఊహించలేని వెర్రి నమ్మకం బహుశా వాడు చెప్పే వుండ వచ్చు తను వినలేదేమో.. అనుకునేలా చేశాయి.

ఇంచుమించు ప్రతి రెండుమూడు రోజులకోసారి ఆ విషయం అడుగుతోన్న తను వాడు చెప్తే వినకపోవడం ఏమిటి?

అంతగా గింజుకుంటూ కూడా తనను తను సరిపెట్టుకునేందుకు ప్రయత్నించిందే తప్ప అనిల్ అబద్ధం చెప్తున్నాడేమో అనే ఆలోచన ఊహామాత్రంగా కూడా చోటు చేసుకోలేదు ఆమె హృదయంలో.

అప్పటికా గండం ఎలాగో గడిచింది.

ఇప్పుడు అనిల్ హోంవర్క్ కూడా స్వయంగా చేయడం లేదు. చేసేందుకు ఇష్టపడ్డంలేదు. లెక్కలన్నీ చేసిన నోట్సులు రెడీగా వుంటోంటే రాని లెక్కల కొరకు బుర్రబద్దలు కొట్టుకోడం తెలివి తక్కువగా అనిపించసాగింది.

ఇప్పుడు అనిల్‌కు భారతీదేవి మేడం అంటే కోపం. ఇక యూనిట్ పేపర్స్ ఇవ్వడం ప్రారంభించారు.

ఆ మార్కులు చూస్తోంటే అనిల్ గుండె గుభేల్ గుభేల్ మంటోంది. భారతీదేవి మేడం పేపరు ఇస్తూ కళ్లతో నిప్పులే కురిపించింది. ఆన్సర్ స్క్రిప్ట్స్ మీద సంతకాలు ఎలా? ఏం చేయాలీ... అనే విషయం గురించి ఆ సాయంత్రం వరకూ తీవ్రంగా ఆలోచించాడు. అదే సమస్యతో బాధపడుతోన్న రాజును సంప్రదించాడు. రాజు చెప్పిన ఆలోచనకు మొదటిక్షణం సంతోషించినా వెంటనే భయపడిపోయాడు అనిల్.

మమ్మీకి తెలిస్తే ఇంకేమయినా వుందా? అమ్మో డాడీకి తెలిస్తే చంపేస్తాడు. మేడం గుర్తుపడితే...

కానీ అనిల్‌కు ఆ ఆలోచన ఆచరణలో పెట్టక తప్పదనిపించింది. వెంటనే ఒకరి తండ్రి సంతకం మరొకరు ప్రాక్టీస్ చేశారు. ఫరవాలేదు. అనుకున్న తరువాత ఆన్సర్ స్క్రిప్ట్స్ మీద సంతకాలు చేసి మేడమ్‌కి తిరిగి ఇచ్చేశారు మరునాడు. మేడం మరో మాట లేకుండా పేపర్ తీసుకోడం చేత హమ్మయ్య అంటూ తేలిగ్గా నిట్టూర్చారు.

ఆ తరువాత రెండు మూడు రోజుల్లోనే ప్రోగ్రెస్ కార్డ్లు ఇచ్చారు. ర్యాంక్ చూసుకున్న అనిల్ ముఖం పాలిపోయింది.




ఇరవై అయిదో ర్యాంక్. ఐదునుండి ఇరవై ఐదుకు రాకెట్‌లా దూసుకుపోయింది. ఆ ప్రోగ్రెస్ కార్డులో మొట్టమొదటగా కనిపించింది నిప్పులు చెరుగుతోన్న తల్లి ముఖం. ఆ తరువాత తండ్రి ముఖం.

మైగాడ్... ఈ ప్రోగ్రెస్ కార్డు చూస్తే మమ్మీ చంపేస్తుంది. అనుకున్నాడు భయంగా.

ఆన్సర్ స్క్రిప్ట్సులో అమలు చేసిన ఉపాయాన్నే ప్రోగ్రెస్ కార్డ్ విషయంలోనూ ఇంప్లిమెంట్ చేశారు.

ఈ గండం గడిచిపోతే ఈసారికి బాగా చదివి మంచి ర్యాంక్ తెచ్చుకుంటాడు. ఈ ఆలోచన అనిల్‌కు కాస్త నిబ్బరం కలిగించింది.

కనీసం ఈసారయినా బాగా చదివి మంచి మార్కులు తెచ్చుకోవాలనే పట్టుదలతో పుస్తకాలు ముందు వేసుకుని కూర్చున్నాడు అనిల్ మరునాడు. కానీ అంతకు ముందు రోజు సుభాష్ వాళ్ల ఇంట్లో చూసిన సినిమాలన్నీ అల్లిబిల్లిగా మెదడులో తిరుగుతూ చదువుకోవాలనే అతని ప్రయత్నాన్ని సాగనివ్వలేదు.

దాదాపు ప్రతిరోజూ అదేవిధంగా గడచిపోయింది. నాలుగు రోజుల తరువాత లక్ష్మి అడిగింది,

"నీలూ! యూనిట్ పేపర్స్ ఇవ్వలేదూ? " అని.

"లేదు మమ్మీ" అన్నాడు నిబ్బరంగా.

"అదేం, ఈసారి లేటయ్యాయి? "

"ఏమో"

ఆ తరువాత వరుసగా మార్కుల గురించీ, ప్రోగ్రెస్ కార్డుల గురించీ అడుగుతూనే వుంది లక్ష్మి.

అబ్బ...బ్బ... ఈ మమ్మీకి ఎంత గుర్తో... చచ్చినా మరిచిపోదు. అని మనసులో విసుక్కుంటూ, "ఏకంగా హాఫియర్లీ ఎగ్జామ్స్‌తో కలిపి ఇస్తారట" అని చెప్పాడు.

"అదేం? "

"ఏమో"

"సరి సరి... ఫీజులైతే శ్రద్ధగా వసూలు చేస్తారుగానీ, ప్రోగ్రెస్ కార్డులు ఇవ్వడానికి మాత్రం శ్రద్ధ వుండదు ఛీఛీ... వెధవ స్కూలు.. వెధవ టీచర్స్" గట్టిగా విసుక్కుంది లక్ష్మి.

"నిజమే మమ్మీ! అసలు పాఠాలు కూడా సరిగా చెప్పడంలేదు"

"మరి ఏం చేస్తున్నారేమిటి మీ మేడమ్స్? "

"అస్తమానం కబుర్లు చెప్పుకుంటారు"

"నిజం? "

"నిజం మమ్మీ లెక్కల మేడం అసలు లెక్కలే చెప్పరు. సోషల్, సైన్సుల్లో అసలు సిలబసే కాలేదు"

తన వాదన మరింత ఇంప్రెసివ్‌గా వుండేందుకు పుస్తకాలు తెచ్చి ఏమేం సబ్జక్ట్సులో ఏమేం లెస్సన్స్ అయ్యాయో.. పోర్షన్ ఎంత వెనుకబడివుందో సోదాహరణంగా చూపించాడు.

లక్ష్మి తెల్లబోతూ వింటోంది.

"మీ లెక్కల మేడం ఇదివరకు లెక్కలు బాగా చెప్తారని చెప్పేవాడివిగా? "

అనిల్ గతుక్కుమన్నాడు.

"అదా మమ్మీ... మరేమో ఈమధ్య మాకు లెక్కలకు కొత్త మేడంను వేశారు. ఈ మేడం అసలు లెక్కలే చెప్పరు"

లక్ష్మికి కొడుకు మాటలు నిజమే అనిపించాయి.

ఇదివరలో అనిల్ ఎంతో భయంగా హోంవర్క్ చేసేవాడు. ఏ ఒక్కరోజు కూడా మాథ్సులో హోంవర్క్ ఇవ్వలేదన్న మాటే వుండేదికాదు. కానీ ఇప్పుడు ఎప్పుడు అడి

గినా హోంవర్క్ ఇవ్వలేదనే చెప్తున్నాడు.

సెలవులు వస్తే మరికాస్త ఎక్కువ వర్క్ ఇచ్చే వారావిడ. ఈమధ్య అనిల్ అసలు లెక్కలు చేయగా చూడనేలేదు.

ప్చ్.. ఏం చదువులో. తాము తినీతినకా చిన్నచిన్న కోర్కెలు కూడా నిర్దాక్షిణ్యంగా చంపుకుని ఎంతో డబ్బు వెచ్చించి చదువులు చెప్పిస్తూ తమ బిడ్డల భవిష్యత్తు బంగారమైపోవాలని కలలు కంటోంటే... అక్కడేమో ఇలా... ప్చ్. నిరాశగా నిట్టూర్చింది లక్ష్మి.

"మరి మీరందరూ కలిసి పాఠాలు చెప్పమని అడగరా? "

"అమ్మో" అంటూ కళ్లు పెద్దవి చేసుకుని గుండెలమీద చేతులు పెట్టుకున్నాడు. లక్ష్మి అనిల్ అమాయకమైన ముఖం వంక చూస్తూ ఔను... పిల్లలుకదూ మేడమ్స్‌ను చూస్తే భయపడతారు... అనుకుంది.

"పోనీ మీ హెచ్‌యమ్ సిస్టర్‌కు రిపోర్ట్ చేయాల్సింది"

"మైగాడ్... హెచ్.యమ్.సిస్టర్ దగ్గరకు వెళ్లాలంటేనే మాకు చచ్చేంత భయం"

నిజమే తనలాంటివాళ్లకే ఆవిడ దగ్గరకు వెళ్లాలంటే కాళ్లూ చేతులూ వణుకుతాయి. ఇక పసివెధవలు. వాళ్లేం వెళ్లగలరూ? అనుకుంది. తల్లి తన పట్ల సాఫ్ట్ కార్నర్ తోనూ, అదే సమయంలో స్కూల్లో మేడమ్స్ పట్లకోపంగానూ వుందనే విషయం గ్రహించాడు అనిల్.

"మమ్మీ ఫిఫ్టీ రూపీస్ కావాలి"

"ఫిఫ్టీ రూపీసా? ఎందుకూ? "

"మా హెచ్.యమ్. సిస్టర్ బర్త్‌డే..."

హెచ్‌యమ్ సిస్టర్ బర్త్‌డే అయితే మీరెందుకివ్వాలీ? ఏం ఆవిడ తన డబ్బుతో సెలబ్రేట్ చేసుకోరా? వంటి ప్రశ్నలు వెయ్యలేదు. గత నాలుగైదేళ్లుగా హెచ్‌యమ్ సిస్టర్ బర్త్‌డే పేరుతో తమ నెత్తిన పెనాల్టీ వేయడం ఆనవాయితీగా వస్తున్నదే.

ఈ పద్ధతి నచ్చక మొదట్లో తెగ విసుక్కునేది. కానీ క్రమేపీ ఫీజులో అదీ ఒక భాగంగా అలవాటు పడిపోయింది.

కానీ ఇప్పుడా పెనాల్టీ చెల్లించాలంటే తగని చికాకుగా కోపంగా వుంది. ప్రతి సంవత్సరం ఇరవై రూపాయల పెనాల్టీ ఈ సంవత్సరం యాభైకి పెరగడం ఒకటైతే అసలు స్కూల్లో పాఠాలే చెప్పకుండా వసూళ్లు మాత్రం వదలకుండా దండుకోడం రెండోది.

"పాఠాలు విరగబడి చెప్పేస్తున్నారనా ఇరవైనుండి యాభైకి పెంచారు? " కోపంగా అడిగింది లక్ష్మి.

"ఏమో..."

"ఏమో ఏమిటి నీ మొహం... ప్రతి సంవత్సరం ఇరవైయేగా ఇస్తున్నాం. మీరు అడగలా? "

"అమ్మో..."

లక్ష్మి కొడుకు వంక నిస్సహాయంగా చూసింది.

అప్పటికి ఏదోరకంగా సరిపెట్టుకుని తీసుకుంటోన్నా స్నేహితులు విరివిగా ఇప్పించే ఐస్‌క్రీంలూ, చాక్‌లేట్స్, కూల్‌డ్రింక్స్, చిరుతిళ్లూ తీసుకుంటున్నందుకు కనీసం ఒక్కరోజయినా వాళ్లకు ఐస్‌క్రీం ఇప్పించలేకపోతున్నందుకు అనిల్ మనస్సులో మధనపడుతూనే వున్నాడు. రోజూకాకపోయినా కనీసం ఒక్కరోజయినా తన ఫ్రెండ్స్‌కు పార్టీ చెయ్యలేకపోతున్నందుకు దిగులు పడుతూనే వున్నాడు.

తన ఫ్రెండ్స్ మమ్మీ డాడీల్లా తనకూ ఖర్చుపెట్టుకోమని డబ్బులు ఇవ్వనందుకుగాను మమ్మీ డాడీల మీద వాడికి గొంతువరకూ కోపం వస్తూనే వుంది.

ముఖ్యంగా మమ్మీమీద...





ఆలోచించీ ఆలోచించీ చివరికి డబ్బు సంపాదించే మార్గాలు కొన్ని కనుక్కున్నాడు. మొదట భయం వేసినా 'బి బ్రేవ్ మై బాయ్' అంటూ తనకు తనే ధైర్యం చెప్పుకున్నాడు.

హెచ్.యమ్. సిస్టర్ బర్త్‌డే అందులో ఓ మార్గం.

అంతలోనే లక్ష్మి ఏదో గుర్తుకు వచ్చినట్లు అడిగింది.

"అవునూ! పోయిన సంవత్సరం హెచ్.యమ్. సిస్టర్ బర్త్‌డే అంటూ మార్చి నెల్లో కదూ డబ్బు తీసుకు వెళ్లావ్...?" అంది ఆరాగా.

అనిల్ గొంతులో సున్నుండ అడ్డుపడ్డట్టయింది.

అబ్బ...బ్బ... ఈ మమ్మీలకు ఎంత గుర్తో... అన్నీ మరిచిపోకుండా అడుగుతారు. మనస్సులోనే విసుక్కుంటూ, "ఏమో... మరి... మా క్లాస్ టీచర్ తెమ్మన్నారు..." అన్నాడు ఆ విషయంలో తన బాధ్యత ఏమీ లేనట్లు.

"ప్రతి విషయానికీ ఏమో... ఏమో... అంటావేంరా...? సరిగ్గా కనుక్కోవద్దూ?"

మరోసారి కొడుకుని విసుక్కుంది లక్ష్మి. కానీ, తాను అనవసరంగా వాణ్ని విసుక్కుంటున్నానే... అని మనస్సులో అనుకుంటూనే వుంది. పసివెధవలు... వాళ్ళకేం తెలుసు...? మీ బర్త్‌డే మార్చిలో అయితే అక్టోబర్‌లోనే చేసుకుంటున్నారేం...? అని అడగలేరుగా... స్కూల్లో వాళ్లు ఏది చెప్తే ఇంటికి వచ్చి అదే చెప్తారు చిలక పలుకుల్లా... మధ్య పిల్లల్ని విసుక్కోవడం శుద్ధ దండుగ.

చేసేదిలేక మౌనంగా డబ్బుతీసి కొడుక్కు ఇచ్చి, మరోసారి ఆ స్కూలులోని పాఠాలు చెప్పని పంతులమ్మలను మనస్సులోనే కసిగా తిట్టుకుంది.

ఎలా అయితేనేం... అనిల్ కోరిక తీరింది.

ఆరోజు ఇంటర్వెల్‌లో ఫ్రెండ్స్‌కు ఐస్‌క్రీం ఇప్పించి, ఆనందంతో పొంగిపోయి అందరూ కబుర్లు చెప్పుకుంటూ, తను కొని పెట్టిన ఐస్‌క్రీం తింటుంటే అనిల్ హృదయం మబ్బుల్లో తేలిపోయింది.

అప్పటినుండీ అనిల్ తన ఫ్రెండ్స్‌కు ఏదోవిధంగా పార్టీలు ఇప్పించగలుగుతున్నాడు.

అంతేకాదు...తన పనులేవీ తల్లిదండ్రుల దృష్టికి వెళ్ళని విధంగా జాగ్రత్త పడుతున్నాడు.

తల్లిదండ్రులు తమ కొడుకును చూసి పొంగిపోయే విధంగా మరింత నమ్రతగా, వినయంగా వుంటూ చదువుపట్ల తల్లిదండ్రులు సంతోషించేంత శ్రద్ధ ప్రదర్శించసాగాడు.



అనిల్ ఈసారి బాగా చదివి మంచి ర్యాంక్ తెచ్చుకోవాలనే అనుకున్నాడు. కానీ... ఏంలాభం...? ఏదో ఒక అడ్డంకే... ఫ్రెండ్స్ ఇంట్లో ఒకరోజు మంచి కేసెట్ వేస్తారు. మరోరోజు అద్భుతమైన క్రికెట్ మ్యాచ్...

మరోరోజు అందరూ కలిసి క్రికెట్ ఆడేం

దుకు గ్రౌండ్‌కు వెళ్ళాలనే ప్రోగ్రాం... ఇంకో రోజు ఇంకోటి... అలసిపోయేలా ప్రోగ్రాంస్

అనిల్‌కు రోజులు క్షణాల్లా గడుస్తున్నాయి. అసలు చదివేందుకే టైమ్ దొరకడం లేదని గింజుకుంటున్నాడు.

రేపు తప్పకుండా చదవాలి... అనుకుంటూ రేపు రేపంటూ వాయిదాలు వేస్తున్నాడు.

ఆ రేపు రావడమూ, చదువుకోడానికి క్షణం మిగలకుండా అయిపోవడమూ కూడా జరుగుతోంది.

ఈలోపు పాత పాఠాలూ, లెక్కలూ అర్థం కాకుండానే క్రొత్త పాఠాలు జరిగిపోవడమూ, ఎప్పుడైనా పుస్తకం తెరచినా అన్నీ గందరగోళంగా గ్రీక్ అండ్ లాటిన్‌లా వుండటమూ జరిగి, ఎంతసేపూ తనకు వచ్చిన ముందు పాఠాలే చదువుతూ కూర్చునే వాడు.

పాఠాలు చెప్పక పోతే వాడు మాత్రం ఏం చేస్తాడు... ప్చ్ చెప్దామంటే తనకు కూడా రావాయె... అనుకుంటూ మధనపడుతూంటుంది లక్ష్మి.

మేడంస్‌ను చాలా నిష్ఠూరంగా మనస్సులోనూ బయటికి కూడా అనేది. అదే సమయంలో లక్ష్మి మనశ్శాంతిని భగ్నం చేసే విషయం ఒకటి జరిగింది.

పక్కపోర్షన్ రజనిగారింట్లో టి.వి. వెలసింది.

అనిల్ బోల్డు సంతోషపడిపోయాడు.

ఇక ప్రతి మ్యాచ్‌కూ, సినిమాలకూ ఫ్రెండ్స్ ఇంటికి వెళ్ళక్కర్లేదు. ఏవీ మిస్ కాకుండా అన్నీ ఇంట్లోనే చూడొచ్చు అనిల్ ఆనందోత్సాహాలు చూస్తోన్న లక్ష్మి గుండెను గుండు సూదులతో గుచ్చుతున్నట్లు విలవిలలాడిపోయింది.

ఏమిటి చెయ్యడం...?

కోరికను బలవంతంగా చంపుకుని తమ ఇంట్లోకైతే టి.వి.ని తేవద్దని శాశించిందిగానీ, పొరుగింటివాళ్ళను ఏం చెయ్యగలదు?

సారథి కూడా సంతోషిస్తున్నట్లే కనిపించాడు. కక్కలేకా మింగలేకా ఉడుక్కుపోయింది లక్ష్మి.

పక్కవాళ్ళ టి.వి.లో ఏవేళ చూసినా సినిమాలు... పాటలు... లక్ష్మి శరీరం ఇంట్లోనే వున్నా మనస్సు మాత్రం టి.వి.కే అతుక్కుపోయేది అయస్కాంతానికి అంటుకుపోయిన ఇనుములా. తెలుగు సినిమా అంటే లక్ష్మికి ప్రాణం.

కానీ తానే వెళ్ళి పక్కింటి వాళ్ళ టి.వి. ముందు కూర్చుంటే ఇక అనిల్‌కు ఏం చెప్పి ఆపగలదు...?

అలా చెప్తే మాత్రం పిల్లలు లక్ష్యపెడతారా...?

అంతే... లక్ష్మి టి.వి.లో సినిమా చూడాలనే కోరికను తీసి మనస్సు అడుగు పొరల్లో సమాధిచేసి, టి.వి.పట్ల అయిష్టత ప్రకటిస్తూ వస్తోంది. అంతేకాక అనిల్‌కు పక్కింటివాళ్ళ టి.వి. మీద మనస్సు విరిగే మార్గమేమిటా... అని ఆలోచించసాగింది.

"వెళ్ళొద్దు" అని కోప్పడితే శాశిస్తే వెళ్ళడు గానీ ముఖం మాడ్చుకుని కూర్చుంటాడు.

శరీరాన్ని శాశించగలదు గానీ మనస్సునేం శాశించగలదు?

వాడి మనస్సంతా టి.వి. చుట్టే ప్రదక్షణాలు చేస్తోంటే ఇక్కడ పుస్తకాల ముందు కూర్చుని మాత్రం ప్రయోజనం ఏమిటి? అందుకే వాడి మనస్సునే మార్చాలి.

టి.వి. చూస్తే కళ్ళకెంత ప్రమాదమో వైనవైనాలుగా వర్ణించి మరీ అనిల్ వినేలా భర్తతోనూ, శంతన్‌తోనూ చెప్పేది.

టి.వి.చూస్తూ గంటలు గంటలు గడిపి చదువులో వెనకబడితే భవిష్యత్ ఎంత బాధాకరంగా తయారవుతుందో వివరించడానికి విశ్వప్రయత్నం చేసేది.





ఊహు... తన ప్రయత్నాలవల్ల, ఉపన్యాసాలవల్ల అనిల్‌లో పెద్దగా మార్పేం వచ్చినట్లు అనిపించలేదు లక్ష్మికి.

నేరుగా వాడి మనస్సుమీదే ప్రయోగాలు ప్రారంభించింది.

"నాన్నా నీలూ! అస్తమానం అలా పొరుగింటికి వెళ్ళి టి.వి. చూస్తే ఏం బాగుంటుంది చెప్పు...?" అంది ఓసారి కొడుకుతో లాలనగా.

"ఫో మమ్మీ అస్తమానం రజనీ ఆంటీ మనింట్లో అట్ల పెనం తీసుకువెడుతోంటే బాగుండటంలా... నువ్వు అస్తమానం ఆంటీ వాళ్ళింట్లోంచి కజ్జికాయ చెక్కలు తెస్తుంటే బాగుండటంలా... అయినా మనకూ ఓ టి.వి. తెస్తే పొరుగింటికి వెళ్ళి చూసే ఖర్మ వుండదుగా" అనుకున్నాడు అనిల్ మనస్సులోనే కానీ, పైకి మాత్రం "నిజమే మమ్మీ" అన్నాడు సీరియస్‌గా.

తన శ్రమ ఫలిస్తున్నందుకూ, ఇప్పటి నుండే వాడింత స్వాభిమానం కలిగి వున్నందుకూ, కొడుకు నిజాయితీకి మురిసిపోయింది లక్ష్మి.

మానాన్నే... అనుకుంది ప్రేమగా.

అప్పటినుండీ అనిల్ వరుసగా రెండురోజులు టి.వి. చూసేందుకు వెళ్ళలేదు. టి.వి.లో సినిమా వస్తూండగా కూడా శ్రద్ధగా పుస్తకాలు ముందు వేసుకుని కూర్చునేవాడు.

పక్కింట్లో పిల్లలూ, పెద్దలూ సందడిగా సినిమా చూస్తోండగా కొడుకును మాత్రం అలా కట్టేసినట్లు కూర్చోబెట్టడం అమానుషం అనుకునేది లక్ష్మి.

పైగా గోడ మాత్రమే అడ్డంకాబట్టి మాటలూ, పాటలూ గోలగోలగా వినిపిస్తుండేవి. దానితోపాటు పిల్లాపెద్దల కేరింతలూ ఈ గోలలో వాడ్ని చదువుకోమంటే మాత్రం ఏం చదువుకుంటాడు అనుకునేది నిరాశగా.

"పో నాన్నా... నువ్వు కూడా వెళ్ళి చూడు" అనేది చివరికి.

ఇలా జరుగుతుందని అనిల్‌కు తెలుసు.

పుస్తకాలు సర్దేసి హాయిగా సినిమా చూసేవాడు.

టి.వి. వుంచిన గది చాలా చిన్నది. దగ్గరగా చూడ్డంచేత కళ్ళకు స్ట్రైయిన్ కలిగి కళ్ళు ఎర్రబడేవి.

ఎర్రబడ్డ కళ్ళతో పుస్తకాల ముందు కూర్చుని కణతలు నొక్కుకుంటోన్న అనిల్‌ను చూస్తూ, "రేపు చదువుకుందువుగాన్లే వెళ్ళి పడుకో" అనేది చేసేదిలేక.

★ ★ ★

శనివారం

బ్యాంక్‌కు హాఫ్‌డే...

సారథి త్వరగా ఇల్లు చేరాడు.

భోజనం అయ్యాక రిలాక్స్‌గా మంచం మీద నడుంవాల్చాడు.

లక్ష్మి అతన్ని ఆనుకుని కూర్చుని పత్రిక చదువుకొంటోంది. సారథి లక్ష్మి జడతో ఆడుకుంటూ మధ్యమధ్య జడ చివర్లు ఆమె మెడమీద, చెవులమీద కదుపుతూ చక్కిలిగింత పెడ్తున్నాడు.

"ఇలా అయితే నేను అక్కడికి వెళ్ళి కూర్చుంటాను" దూరంగా వున్న కుర్చీని చూపిస్తూ బెదిరించింది లక్ష్మి.

"ఓ.కే. వెళ్ళు"

లక్ష్మి లేచేందుకు ప్రయత్నించేంతలో సారథి ఆమె కొంగు పట్టుకుని గట్టిగా లాగాడు. ఆ విసురుకు లక్ష్మి అతని గుండెలమీద పడింది విసురుగా. అంతే... అతని బాహుబంధంలో చిక్కిపోయింది.

"ష్... పట్టపగలు ఏమిటీ అల్లరి...?" అంది చిరుకోపంగా.

అల్లరిగా నవ్వేశాడు సారథి, కౌగిలిని మరింత బిగిస్తూ.

"ఎవరైనా వస్తారు..." అంది భయంగా చేరవేసిన తలుపుల వంక చూస్తూ.

"ఇప్పుడు ఎవరూ రారులే" సారథి భార్య పరిష్వంగ సుఖం ఆస్వాదిస్తూ గుసగుసగా అన్నాడు.

అంతలో "ఆంటీ..." అంటూ తలుపులు తోసుకుని వచ్చేసింది పక్కింటి పాప నిశాంతి.

తృళ్ళిపడింది లక్ష్మి. చటుక్కున ఒదిలేసి కళ్ళు మూసుకుని నిద్రనటించాడు సారథి.

లక్ష్మి సర్దుకుని కూర్చుంది.

"ఆంటీ మరేమో..." అంటూ అక్కడి అస్వాభావికమైన పరిస్థితి ఏమిటో పూర్తిగా అవగాహనకు రాని నిశాంతి అనుమానంగా చూస్తోంది ఆలుచిప్పల వంటి పెద్దపెద్ద కళ్ళతో.

"ఏమిటి శాంతీ...?" లక్ష్మి అడిగింది.

"మరేమో ఆంటీ... మమ్మీ... మమ్మీ..."

"మమ్మీ ఏమన్నా తెమ్మందా?"

"అవునాంటీ... అదీ... అదీ..." శాంతికి తల్లి చెప్పిన వస్తువేదో గుర్తుకురాలేదు.

"అట్లపెనమా?" నవ్వుతూ అడిగింది లక్ష్మి.

"ఔను ఆంటీ. మమ్మీ అట్లపెనం తెమ్మంది"

లక్ష్మికి శాంతిని చూస్తే చాలా ముద్దు.

"అన్నట్లు శాంతీ! మొన్న చేసిన డ్యాన్సు పూర్తిగా వచ్చేసిందా?" శాంతిని దగ్గరగా లాక్కుని ముద్దుపెట్టుకుంది.

"మరేమో ఆంటీ పూర్తిగా వచ్చేసింది. చేసి చూపించనా...?"

"ఆ... చెయ్యి..."

మరి ఎక్కువసేపు సారథి నిద్రనటిస్తూ వుండలేకపోయాడు. పైగా అప్పుడు శాంతి డ్యాన్సు మొదలు పెడ్తుందేమో అనే భయం కూడా కలిగింది.. అంతే... లక్ష్మి నడుం మీద గిచ్చాడు ఉక్రోషంగా.

కెవ్వుమంది లక్ష్మి అసంకల్పిత ప్రతీకార చర్యలా. తా...ధి...మి.... తా....ధిమి... అంటూ అడుగులు వేయడానికిసిద్ధమవుతోన్న శాంతి ఉలిక్కిపడి, "ఏమిటి ఆంటీ...?" అంది ఆశ్చర్యంగా.

"అబ్బే... ఏం లేదమ్మా... చీమ... చీమ కుట్టింది"

"ఏది ఆంటీ... ఎక్కడ కుట్టింది...?" ఇద్దరి మధ్యకూ దూకపోయింది శాంతి.

సారథి మళ్ళీ గిచ్చాడు. "అబ్బా..." అంది లక్ష్మి స్వరం తగ్గించి చిన్నగా.

"ఎక్కడ వుందాంటీ చీమ...?" శాంతి లక్ష్మి నడుం దగ్గర వెదుకుతోంది చీమకొరకు.

"చీమ పోయిందమ్మా. దొంగచీమ... పోనీలే... నీకు అట్లపెనం ఇస్తాను రా..." అంటూ శాంతికి అట్లపెనం ఇచ్చి పంపి, సారథి దగ్గరగా వచ్చి కూర్చుంది. సారథి కళ్ళుతెరచి నవ్వుతూ, "చీమ...చీమ గట్టిగా కుట్టిందా..." అన్నాడు.

లక్ష్మి కోపంగా చూడబోయి నవ్వేసింది.

"ఔను... ఎందుకు గిచ్చారు...?"

"నేనెందుకు గిచ్చాను? చీమ కుట్టింది..."

"అబద్ధాలు చెప్తే ఆడపిల్లలు పుడతారు..."

"దేవిగారు కరుణిస్తే. అయినా ఇంత సేపా కబుర్లు అడిగిందేదో ఇచ్చి పంపక... ఎంత టైం వేస్టయిందో చూడు"

లక్ష్మి నవ్వింది.

ఆ నవ్వంటే సారథికి ఎంతో ఇష్టం. లక్ష్మి నడుంచుట్టూ చెయ్యివేసి దగ్గరగా లాక్కోబోయాడు.





"ఆంటీ..."

సారథి చటుక్కున లక్ష్మిని ఒదిలేశాడు.

లక్ష్మి వస్తోన్న నవ్వును ఆపుకుంటూ "ఏమిటి శాంతీ...?" అంది శాంతివైపు చూస్తూ.

"ఆంటీ! జడవెయ్యవూ...?" విప్పుకున్న జుట్టుతో ప్రత్యక్షమైన శాంతిని మింగేసేలా చూశాడు సారథి.

శాంతిని ముద్దుచేస్తూ, ఆప్యాయంగా కబుర్లుచెప్తూ, ఎంతో ప్రేమగా జడవేస్తోన్న లక్ష్మిని చూస్తోన్న సారథికి జాలికలిగింది.

లక్ష్మికి ఆడపిల్లలంటే ఎంతో మక్కువ.

గర్భవతిగా వుండగా కూడా ఆడపిల్లే కలగాలని హృదయపూర్వకంగా కోరుకుంది. ఆడపిల్ల కలగనందుకు నిరుత్సాహపడింది.

తరువాత వెంటనే మరో సంతానం కలగడం ఇష్టంలేక జాగ్రత్తలు తీసుకున్నారు. తరువాత... తరువాత దేశకాల పరిస్థితులు చూస్తూ తమ ఆర్థిక పరిస్థితులకు ఒక్క బిడ్డ చాలనే నిర్ణయానికి వచ్చేశారు.

ఉన్న ఒక్క బిడ్డకూ సరియైన చదువు సంధ్యలు చెప్పించగలిగి ప్రయోజకుడ్ని చెయ్యగలిగితే కన్నందుకు అదే పదివేలనుకున్నారు.

అలా ఆడపిల్ల కావాలనే లక్ష్మి కోర్కె అడుగున బడిపోయి, చిన్నతనంలో అనిల్‌కు ఫ్రాక్ తొడిగీ, బొట్టూ కాటుక పెట్టి మురిసిపోయేది.

చివరికి వాడు బొట్టూ కాటుకా పెట్టుకునేందుకు సిగ్గుపడే స్థితికి వచ్చేవరకూ అలా పెట్టి తన ముచ్చట తీర్చుకుంది.

ఇంకా మోజుతీరక ఇరుగూ పొరుగూ ఆడపిల్లల్ని ప్రేమగా చేరదీసి వాళ్ళకు జడ వేసి పువ్వులు పెట్టీ మురిసిపోతుంటుంది.

ఆమె కోరికను బలవంతంగా తుంపివేయవలసి వచ్చిందే అన్నట్లుగా సారథి బాధపడుతుంటాడు ప్రతిసారీ.

శాంతి జడవేయించుకుని వెళ్ళిపోయింది.

"నాకు జలసీగా వుందోయ్"

"ఎందుకు...?"

"నువ్వా పిల్లను అంత ముద్దు చేస్తోంటే"

లక్ష్మి నవ్వింది.

"నీకు ఆడపిల్లలంటే అంత పక్షపాతమెందుకోయ్"

"పక్షపాతమేమిటి?" లక్ష్మి నవ్వింది.

"అవును నీకు ఆడపిల్లలంటే పక్షపాతమే, వాళ్ళ ప్రశాంత్‌ను ఒక్కసారయినా ముద్దుచేశావా?"

లక్ష్మి నవ్వింది.

"నిజమేనండీ. ఆడపిల్లలంటే నాకు చాలా ఇష్టం. ఆడపిల్లల హృదయాలెంత సున్నితంగా, ఆర్ద్రంగా వుంటాయో మీకు తెలీదు"

"ఎంత ప్రేమగా పెంచి పెద్దచేసినా రేపు పెళ్ళిచేసుకుని అత్తవారింటికి వెళ్ళిపోయే వాళ్ళవల్ల ఏం ఒరుగుతుంది...?"

"పెళ్ళి చేసుకుని అత్తవారింటికి వెళ్ళినా కన్నవారికోసం, తోబుట్టువులకోసం ఆమె హృదయం ఎంతగా తపిస్తుందో మీకు తెలీదు... ఆప్రేమ చాలదూ?" లక్ష్మి స్వరంలో ఒక విధమైన ఆర్ద్రతాభావం తొణికింది.

"పోనీ మనం ప్రయత్నిద్దామేమిటి...?" కొంటెగా అన్నాడు సారథి.

"ఏమిటి...?"

"అదే ఆడపిల్ల కొరకు"

"ఛ... ఇప్పుడా...?" లక్ష్మి సిగ్గుపడింది.

"ఇప్పుడంటే... ఇప్పుడు కాదులే..."

లక్ష్మి అర్థంకానట్లు చూసింది.

"అదేనోయ్... రాత్రికి..."

"ఛీ...ఛీ... సిగ్గులేని మనుష్యులు"



కోపంగా చూడబోయి నవ్వేసింది.

"నిజం లక్ష్మి. ఆలోచించు... మనకో పాప వుంటే బాగుంటుంది కదూ...? అనిల్ కూడా మరీ వంటరివాడు కాకుండా"

లక్ష్మి సారధి మాటలను తెల్లబోయినట్లు వింటూండిపోయింది.

చివరికి, "ఈ వయస్సులోనా...? " అంది సిగ్గు పడుతున్నట్లుగా.

"ఏం... మనం అప్పుడే ముసలివాళ్ళం అయిపోయామా...? "

"అలా అని కాదు"

"మరి...? "

"ఈ పని మనం అనిల్ చిన్నవాడుగా వుండగానే చేయాల్సింది" సాలోచనగా అంది లక్ష్మి.

"నిజమే. కానీ, ఆర్థికపరంగా ఆలోచించి కాదనుకున్నాంగా..."

"ఇప్పుడు మాత్రం ఆర్థికంగా ఏం పెరిగాము...? "

"పెరగలేదు. నిజమే.... ఒకే జీతంతో ముగ్గురు పిల్లలతో, తల్లీ, తండ్రీ, చెల్లి వంటి అదనపు బాధ్యతలతో వున్న కుటుంబాల వారు బతకడంలా? ఎలాగోలా మెయింటన్ అవుతుంది"

"ఎలాగోలా మెయింటెన్ కావడం కాదుగా మనం కోరుకుంది. అనిల్‌ను బాగా చదివించాలి. వాడికో మంచి భవిష్యత్ ఏర్పరచాలి. అని కదూ మనం కోరుకున్నది"

"నిజమే. అలా అని మనం ఈ చిన్న కోరిక కూడా తీర్చుకోకుండా ఎలా? "

"సార్! ఇది చిన్న కోరిక కాదండీ. చాలా చాలా పెద్దకోరిక. ఇక ఆడపిల్ల భవిష్యత్‌ను భద్రంచేయడం అంటే నాటేజోక్" లక్ష్మి నవ్వుతూ అంది.

"నువ్వు మరీ నిరాశగా మాట్లాడకు మన పాప పెద్దది అయ్యేసరికి ఈ కట్నాల సమస్య వుండదు" తనూ నవ్వుతూనే అన్నాడు సారధి.

లక్ష్మి నవ్వింది.

"నేను పుట్టినప్పుడూ మా నాన్న అలాగే అనుకున్నారు"

సారధి మనస్సు చివుక్కుమంది.

నిజానికి కట్నం తీసుకోడం తనకు ఇష్టం లేదు. కానీ, చెల్లెలి పెళ్ళి చేయాల్సిన బాధ్యత వుండటంతో, తప్పనిసరి పరిస్థితుల్లో కట్నం తీసుకున్నాడు.

ఇదో విషచక్రం...

"అయినా మనకు ఈసారయినా ఆడపిల్లే కలుగుతుందని గ్యారంటీ లేదుగా. ఒకవేళ మళ్ళీ మగపిల్లాడే అయితే...? "

"అబ్బ..బ్బ... నువ్వు ఒట్టి అనుమానాల పుట్టవు కదా. టెస్ట్ చేయించుకుని ఆడపిల్ల అయితేనే బర్త్ ఇస్తేసరి"

లక్ష్మికి ఎందుకో అప్పుడు తల్లి అయ్యే ఆలోచన రుచించడంలేదు.

"ఊహు... వద్దండీ..." అంది స్థిరంగా.

'నీకెలా చెప్పాలి' అన్నట్లు విసుగ్గా చూశాడు సారధి.

"అనిల్‌కు పెళ్ళి అయితే వచ్చే కోడలే కూతురు అనుకుంటే సరిపోదా? లేదూ... మరో పన్నెండు పదమూడేళ్ళల్లో మన అనిల్‌కు పిల్లలు పుడ్తారుకదా... మన అదృష్టం బాగుంటే పుట్టే బిడ్డ ఆడపిల్లే కావచ్చు"

లక్ష్మి ఆలోచన సారధికి నచ్చలేదు.

ఉద్యోగాల నిమిత్తం దూర తీరాలకు పోయే సంతానం తమ దగ్గరే వుంటారన్న ఆశ అడియాసే... అనిల్ ఉద్యోగరీత్యా ఎక్కడో సెటిల్ కావచ్చు. ఎప్పుడో చుట్టపు చూపుగా వచ్చి వెళ్ళే అవకాశం తప్ప ఎప్పుడూ కళ్ళముందే వుంటారన్న గ్యారంటీ లేదు. వాళ్ళ సంతానాన్ని వాళ్ళకు దూరంచేసి తమదగ్గర అట్టిపెట్టుకోలేరుగా.




"అయినా లక్ష్మీ! ఎందుకలా అనుమానిస్తున్నావు. మన వయస్సు వాళ్ళు ఇంకా పెళ్ళిళ్ళు కూడా చేసుకోడంలేదు. పైగా మన దేశ ఆచారం ప్రకారం యాభైఏళ్ళవరకూ పిల్లల్ని కన్నా తప్పుపట్టరు"

"అనిల్ గురించి ఆలోచించరేం...? "

"అనిల్ గురించి ఆలోచన ఏమిటి? "

"మనం మరో బిడ్డను ఆహ్వానిస్తే అనిల్‌కు మంచి చదువు చెప్పించలేము. ఆడపిల్ల భవిష్యత్‌ను తీర్చిదిద్దలేకపోయినా, మంచి భవిష్యత్ ఇవ్వలేకపోయినా మనం జన్మంతా బాధపడాల్సివుంటుంది"

"మూడోది- అనిల్ చిన్న వయస్సులో అయితే ఎలా వుండేదో కానీ, ఇంత పెద్దవాడయ్యాక ఇప్పుడు వాడికో చెల్లెలంటే ఎలా రిసీవ్‌చేసుకుంటాడో"

సారధి మౌనంగా వుండిపోయాడు ఆలోచిస్తూ.

"ఏమైనా ఇప్పుడు వాడి ముందు మళ్ళీ వేవిళ్ళూ-కడుపూ ఛీ...ఛీ... అసహ్యంగా వుండదూ? "

లక్ష్మి ఆలోచనా సరళికి ఆశ్చర్యపోయాడు సారధి.

నిజానికి తానీ కోణంనుండి ఆలోచించనే లేదు.

"పోనీ" అంటూ ఏదో చెప్పబోయిన భర్తను వారిస్తూ "ప్లీజ్ టాపిక్ వదిలేయండి. అధికసంతానం మనకే కాదు దేశానికే భారం" అంది.

అనిల్ రాకతో సంభాషణ ఆగిపోయింది.

అలసిపోయినట్లుగా భారంగా వచ్చిన అనిల్ పుస్తకాలు బీరువాలో వుంచి స్నానం చేసి వచ్చాడు.

అనిల్ స్నానం పూర్తి అవుతూనే టిఫిన్ పెట్టి, వేడివేడి పాలు ఇచ్చింది లక్ష్మి. టిఫిన్ చేసి, పాలు త్రాగి ఎవరూ చెప్పకుండానే చాప పరచుకుని పుస్తకాలు ముందు వేసుకుని కూర్చున్న అనిల్‌ను చూస్తోన్న భార్యాభర్తలకు జాలి కలిగింది. ఉదయం అనగా ఇంట్లోంచి వెళ్ళి అలసి, సొలసి ఇల్లుచేరి, మళ్ళీ వెంటనే పుస్తకాలు పట్టుకుని బుద్ధిగా చదువుకొంటోన్న కొడుకు క్రమశిక్షణ చూసి ఎవరికి వారే అది తమ పెంపకంలోని గొప్పతనంగా భావించి లోలోన గర్వపడ్డారు. తృప్తిగా, ఆప్యాయంగా కొడుకు వంక చూసుకుంటూ, ఒక్కడైతేనేం రత్నంలాంటి బిడ్డ. వీడు పదికాలాలపాటు చల్లగా వుండి, వృద్ధిలోకి వస్తే చాలు... తమకు అంత కన్నా ఏం కావాలి...?

తృప్తిపడ్డారు సారధి దంపతులు.

★ ★ ★

ఆదివారం...
ఉదయం పది గంటలయి వుంటుంది.

వివర్ణమైన ముఖంతో లక్ష్మి ఇల్లంతా వెదికి పోస్తోంది. పెట్టెలూ, సూట్‌కేస్‌లూ, డ్రాయర్ సొరుగులూ, బీరువాలూ, వంటగదిలోని పోపు డబ్బాలూ... ఏదీ వదలకుండా వెదికిన చోటనే మళ్ళీమళ్ళీ వెదుకుతోంది. చూసిన చోటనే మళ్ళీ మళ్ళీ చూస్తోంది.

ముందుకు వురకబోతోన్న కన్నీళ్ళను బలవంతంగా ఆపుకునే ప్రయత్నంలో ముక్కు పైకెగబీలుస్తూ వెదికి పోస్తోంది.

వెతకడంలో తమకు చేతనయినంతగా సహాయం చేస్తున్నారు అనిల్, సారధులు.

"ఎక్కడ పెట్టావో బాగా గుర్తుచేసుకో లక్ష్మి" అన్నాడు సారధి పదోసారి. నాకు బాగా గుర్తువుందండీ. వుంగరం ఈ చిన్ని పెట్టెలో . పెట్టి బట్టల అడుగున సూట్‌కేసులో పెట్టాను. వుంగరం పెట్టిన బాక్స్ వుంది కానీ వుంగరం లేదు" ఆపుకుంటోన్న కన్నీళ్ళు మరి ఆగనంటూ జలజలా కురిశాయి. అది పెళ్ళి వుంగరం. ఆ వుంగరం అంటే లక్ష్మికి ఎంతో ఇష్టం.

ఈ విషయం సారధికి తెలుసు.



"నువ్వారికే బాధపడకు, అదే దొరుకుతుంది కానీ... సూట్‌కేస్ బాగా వెదికావా... బట్టలు తీసినప్పుడూ, పెట్టినప్పుడూ బట్టల్లో పడి వుంటుంది"

"ఒక్కొక్కటీ తీసి విదిలించి మరీ చూశానండీ"

"వుండు... నేను కూడా చూస్తాను" అంటూ సూట్‌కేస్ ముందుకు జరుపుకుని, ఒక్కొక్క చీరమడత విప్పుతూ, దులుపుతూ గాలింపు చర్యలు పూర్తిచేసి, లాభంలేకపోగా ఉసూరుమంటూ కుర్చీలో చేరగిలబడ్డాడు.

"మమ్మీ! ఒకవేళ బీరువాలో ఏమైనా పెట్టావేమో" అన్నాడు అనిల్.

"చూశాను. అందులోనూ లేదు..." హీన స్వరంతో చెప్పింది లక్ష్మి.

"నేను కూడా చూస్తాను వుండు" అంటూ బీరువా అంతా ఒక్కొక్క వస్తువే జాగ్రత్తగా తీసి చూశాడు. చివరికి, "లేదు మమ్మీ..." అన్నాడు.

తల్లితోపాటుగా డ్రాయర్ సొరుగులూ, బీరువాలూ సూట్‌కేసులూ మళ్ళీమళ్ళీ వెదుకుతూ, "మమ్మీ! బాగా గుర్తుచేసుకో వేరే ఎక్కడయినా పెట్టి మరిచిపోయావేమో..." అన్నాడు.

లక్ష్మికి విసుగేసింది.

"ఆ... నీ నెత్తిన పెట్టి మరిచిపోయాను సరేనా...? నేను సూట్‌కేస్‌లోనే పెట్టానంటే వినిపించుకోరేం? " అంది కోపంగా.

అప్పటికే ఏదో అడగాలని నోరు తెరిచిన సారధి లక్ష్మికోపం, విసుగూ గమనించి మౌనంగా వుండిపోయాడు.

సూట్‌కేస్‌లో వుంచిన రింగ్ ఎలా మాయమయ్యిందీ అతనికీ అర్థంకాకుండా వుంది.

లక్ష్మిది త్వరగా మరిచిపోయేతత్వం కూడా కాదు.

మరో క్షణంలోనే అనవసరంగా కొడుకును విసుక్కున్నందుకు లక్ష్మికి "అయ్యో" అనిపించింది.

"లేదురా నీలూ! నాకు బాగా గుర్తు. రింగ్ ఈ బాక్స్‌లో వుంచి సూట్‌కేస్‌లో పెట్టాను నాన్నా" అంటూ వుంగరం వుంచిన చిన్న బాక్స్ చూపించింది

"ఈ బాక్సే. మూత కూడా విడిపోయి లేదు. గట్టిగా మూసుకునే వుంది. లోపల వుంగరం లేదు" అంది అనునయంగా.

అనిల్ ఆలోచిస్తోన్నట్లుగా తల పంకించి వెదకడంలో మునిగిపోయాడు. చివరికి ఇంటిల్లిపాదీ వెదకడంలో అలిసిపోయారు గానీ రింగ్ మాత్రం దొరకలేదు.

లక్ష్మి ఏడుస్తూ కూర్చుండిపోయింది. ఆమెకు రింగ్ ఎలా మాయమయ్యిందీ ఎంత ఆలోచించినా అర్థం కావడంలేదు.

ఇంట్లో తాము తప్ప మూడో మనిషి లేరు. బయటివాళ్ళెవరైనా వచ్చినా సూట్‌కేస్‌లోని వుంగరం తీసే అవకాశం అసలే లేదు. తనుగాక ఇంట్లో వున్నది ఇద్దరు. ఈ. ఇద్దరిలో ఎవర్ని అనుమానించగలదు. అసలా వూహే ఎంతో హేయంగా వుందే.

మరి వుంగరం ఎలా మాయమయినట్లు?

తలబద్దలు కొట్టుకొని ఆలోచించినా వుంగరం ఎలా మాయమయ్యిందీ ఊహించను కూడా ఊహించలేకపోయింది లక్ష్మి.

అనిల్ మాత్రం గండం గడిచినట్లుగా నిశ్చింతగా ఊపిరి పీల్చుకున్నాడు. ఏ గొడవా జరగకుండా రింగ్ గొడవ ఫినిష్ అయినందుకు లోలోపలే ఆనందించాడు.

★ ★ ★

మధ్యాహ్నం రెండు గంటలయింది.

అప్పటివరకూ నిరాసక్తంగా కూర్చుండిపోయిన లక్ష్మికి, అనిల్‌కు ఇంకా భోజనం పెట్టలేదనే విషయం హఠాత్తుగా గుర్తుకు





వచ్చి అనిల్ వంక చూసింది. అనిల్ పుస్త కాల మధ్యపడి నిద్రపోతున్నాడు. శోష వచ్చినట్లు పడి నిద్రపోతున్న కొడుకుని చూసి తనను తనే తిట్టుకుంది.

ఉంగరం ధ్యాసలో పడి రెండు గంటలవ రకూ పిల్లాడికి అన్నం పెట్టనందుకు. పిచ్చి సన్యాసి... తను ఉంగరం పోయినందుకు ఏడుస్తోందని అన్నం కూడా అడక్కుండా వుండిపోయాడు. అనుకుంది ప్రేమగా.

"నాన్నా... నీలూ లే... లే. అన్నం తిందువుగాని" అంటూ భోజనం వడ్డించింది.

వారం గడిచినా వుంగరం ఎలా పోయిందన్న ఆలోచన లక్ష్మిని వదిలిపెట్టడం లేదు.

ఎంత ఆలోచించీ ఆమె ఆ పజిల్‌ను సాల్వే చెయ్యలేకపోతోంది.

★ ★ ★

ఉంగరం పోయిన విషయం ఇంట్లో గమనించి వెదుక్కోడం జరిగి వారం గడిచిపోయింది.

ఈ వారం రోజులుగా అనిల్ చాలా టెన్షన్‌తో గడిపాడు. నిజానికి పదిహేను రోజుల కిందటే అనిల్ ఆ ఉంగరం తీసి దాచివుంచాడు. అయితే వెంటనే దాన్ని ఏం చేసేందుకూ ధైర్యం చాలక పెరట్లో వున్న చెట్టుకింద దాచి గుర్తుగా చిన్నరాయి వుంచాడు.

మమ్మీ ఉంగరం చూసుకుని పోయిందనుకుని వెదుక్కుని మరిచిపోతే దాన్ని ఏదో ఒకటి చెయ్యాలని అనుకున్నాడు.

మమ్మీ రింగ్ గురించి ఎప్పుడు వెదుక్కుంటుందోనని ప్రతి క్షణం హడలిపోతూనే వున్నాడు.

అనుమానం తనమీదికి రాకుండా వుండాలని ప్రతిరోజూ ఉదయం సాయంత్రం దేవుడికి దణ్ణం పెట్టుకుంటూనే వున్నాడు. దేవుడి దయవల్ల అనుమానం తనమీదికి రాలేదు.

అయితే ఇప్పుడు మరో సమస్య ఎదురయ్యింది.

రింగ్ అమ్మడం ఎలా? గోల్డ్‌షాపుకు తీసుకువెళ్ళి అమ్మితే ఇంత చిన్న కుర్రాడివి... నీకీ రింగ్ ఎక్కడిది. ఎక్కడో దొంగతనం చేశావు అని పోలీసులకు అప్పచెప్తారేమో...

అసలీ రింగ్ అమ్మితే ఎంత వస్తుందో?

ఐస్‌క్రీం బండివాడికీ, కిళ్ళీ బడ్డీతాతకూ, వేరుసెనక్కాయల ముసలమ్మకూ, సుభాష్‌కూ, రాజుకూ తను బాకీ వున్నాడు.

ఆ బాకీలన్నీ పోను ఎంత మిగులుతుందో... మిగిలిన డబ్బుతో బాగా ఎంజాయ్ చెయ్యాలి. అసలు ఇంతకూ రింగ్ అమ్మడం ఎలా? ఎంత ఆలోచించినా రింగ్ అమ్మడం ఎలాగో అనిల్‌కు అర్థం కాలేదు. వీలు చూసుకుని రింగ్ స్కూలుకు తీసుకువెళ్ళి సుభాష్‌ను అడగాలి అనుకున్నాడు. రింగ్ విషయంలో లక్ష్మి, అనిల్ చెరోవిధంగా టెంక్షన్‌లో వున్నారు. ఆ సమయంలో చంద్రం రాక కుటుంబసభ్యులకు అమితమైన ఆనందాన్నిచ్చింది.

చెల్లెలికి పెళ్లి నిశ్చయం అయ్యిందనే విషయం తెలియచేసేందుకు వచ్చాడతడు. చాలాకాలం తరువాత వచ్చిన తమ్ముడ్ని చూసి లక్ష్మి చాలా ఆనందించింది. "ఇంట్లో అందరూ బాగున్నారా...?" కళ్ళనిండుగా తమ్ముడ్ని చూసుకుంటూ ఆప్యాయంగా ప్రశ్నించింది.

"మీ తమ్ముడు మనల్ని పెళ్లికి తీసుకువెళ్ళేందుకు వస్తే బాగున్నారా అని అడుగుతావేమోయ్" సారథి బావమరిదిని జోక్ చేశాడు.

"బావగారు భలే చెప్పారే" చంద్రం నవ్వాడు.

"ఎందుకు చెప్పరూ... ఎప్పుడెప్పుడు పిలుస్తారా. అల్లుడి హోదా ఎప్పుడెప్పుడు వెలిగిద్దామా అని ఆయన ఎదురుచూస్తోంటే" దెబ్బ కొట్టింది లక్ష్మి.

పెళ్లి ఇంకా నెలపైనే వుంది. అక్కా బావగార్లకి విషయం తెలియచేసి పెళ్లికి ముందుగా రమ్మని ఆహ్వానించేందుకే వచ్చాడు చంద్రం.

"పెళ్లికొడుకు ఎలా వున్నాడురా?" కుతూహలంగా ప్రశ్నించింది లక్ష్మి. చంద్రం జేబులోనుండి ఫొటోతీసి ఇచ్చాడు.

పెళ్లికొడుకు చాలా సామాన్యంగా వున్నాడు. పెళ్లికొడుకు స్థితిగతుల గురించీ, ఒప్పుకున్న కట్నాలు, లాంఛనాలను గురించీ వివరంగా అడిగి తెలుసుకుంటూనే కాఫీ-టిఫిన్ రెడీ చేసింది లక్ష్మి.

తమ్ముడికి ఆప్యాయంగా వడ్డిస్తూ కుటుంబ విషయాలన్నీ వివరంగా అడిగి తెలుసుకుంది లక్ష్మి.

ఆ తరువాత లక్ష్మి వంటప్రయత్నంలో వుండగా చంద్రం అనిల్ కొరకు తెచ్చిన స్వీట్స్, బహుమతులు ఇచ్చి అల్లుడితో కబుర్లు చెప్తూ కూర్చున్నాడు. "ఒరేయ్ చంద్రం! కాస్త వాడి చదువు ఎలా వుందో చూడరా... చూద్దామన్నా నాకేమో తెలిసి చావడంలేదు" అంది లక్ష్మి.

చంద్రం నవ్వాడు, కొడుకు చదువుపట్ల అక్క ప్రదర్శిస్తోన్న శ్రద్ధకు.

"వున్న కాసేపూ కబుర్లు చెప్పకుండా మధ్య నీ గొడవ ఏమిటి?" సారధి అన్నాడు.

"ఫరవాలేదు. వాడేమీ పరాయివాడు కాదు. రాత్రికి చెప్పుకోవచ్చులే కబుర్లు" అంటూ భర్తకు చెప్పి "నీలూ! నీకు రాని లెక్కలూ అవీ మామయ్యతో చెప్పించుకో... ఊc... వెళ్ళి పుస్తకాలు తెచ్చుకో" అంది కొడుకుతో.

నిశ్శబ్దంగా వెళ్ళి పుస్తకాలు తెచ్చుకుని కూర్చున్నాడు అనిల్.

రాకరాక వచ్చిన మామయ్యతో కబుర్లు చెప్తూ హాయిగా ఆడుకోకుండా ఇప్పుడీ లెక్కల గోల ఏమిటీ? అన్న భావంగానీ, సహజంగా పిల్లల్లో చదువంటే కనిపించే అయిష్టతగానీ, కనిపించని నిర్వికారంగా వున్న వాడి ముఖం చూసి ఆశ్చర్యపోయాడు చంద్రం.

అరగంట గడిచాక చంద్రం అడిగాడు-

"అక్కా! అనిల్ క్లాసులో ఎన్నో ర్యాంక్?"

"థర్డ్, ఫోర్త్ ర్యాంకుల్లో వుంటుంటాడు" లక్ష్మికి తన గొంతులో కించిత్ గర్వం తొంగి చూసిందని ఆమెకే అనిపించింది.

"థర్డ్... ఫోర్తా...?" ఆశ్చర్యంగా అడిగాడు.

"ఆc... పాపం వాడు స్వంతంగా చదువుకోడం కదురా" ట్యూషన్స్ లేకగానీ వుంటే వాడు ఫస్ట్ర్యాంక్ వచ్చేవాడు అనే శ్లేష వుంది.

"ఏమో... నువ్వేమో ఫోర్త్ర్యాంక్ అంటున్నావుగానీ వీడు చూస్తే మరీ హోప్‌లెస్‌గా వున్నాడు" నిరాశగా అన్నాడు చంద్రం.

తమ్ముడు వెలిబుచ్చిన అభిప్రాయానికి విస్తుపోయింది లక్ష్మి.

చంద్రం అనిల్ చదువు సంధ్యలపట్ల సంతృప్తి వ్యక్తపరుస్తాడనీ, వాడి చదువుపట్ల తన శ్రద్ధను అభినందిస్తాడనీ ఆశిస్తోన్న లక్ష్మి, చంద్రం హోప్‌లెస్ అనడంతో తెల్లబోయింది.

తెల్లబోయినట్లు చూస్తోన్న అక్కవంక చూస్తోంటే, ఆమె వాడి చదువుపట్లా వాడి తెలివితేటలపట్లా ఎంత నమ్మకం పెంచుకుందో అర్థం అయ్యింది.

"లేదక్కా! వీడు మరీ హోప్‌లెస్‌గా వున్నాడు. ఇలా అయితే ర్యాంక్ కాదుకదా,




మినిమమ్ పాసే కష్టం"

అనిల్ పుస్తకంలో తలవంచుకుని ఏకాం తంగా ఏదో లెక్క చేస్తూ తల్లి, మామయ్య మాటలు వింటున్నట్లే లేడు. కానీ, నిజానికి అనిల్ వాళ్ళ ప్రతి మాటా జాగ్రత్తగా వింటున్నాడు.

"ఒక్క లెక్కలేనా... అన్నింటిలోనూ అలాగే వున్నాడా ఇదివరలో బాగానే చేసే వాడు మరి. ఇప్పుడా మాయదారి స్కూల్లో పాఠాలే చెప్పడం లేదట" లక్ష్మి తన దండ యాత్ర స్కూలుపై సాగించింది.

"పాఠాలు చెప్పడం లేదా? " ఆశ్చర్యంగా అడిగాడు చంద్రం.

"లేదట్రా చంద్రం. లెక్కలు చెప్పడంలేదు. ఏ పుస్తకంలో చూడు... రెండు మూడు లెస్సన్స్‌కన్నా ఎక్కువ కాలేదు. ఇదేం మాయదారి స్కూలో మళ్ళీ ఫీజులు మాత్రం గోళ్ళూడగొట్టి మరీ వసూలు చేస్తారు"

"ఏరా నీలూ! సిలబస్ కాలా? "

"లేదు మామయ్యా..."

"నీలూ! నీ పుస్తకాలన్నీ తీసి మామ య్యకు చూపించు"

అనిల్ సంచిలోంచి అన్ని పుస్తకాలూ తీసి బయటపెట్టి ఒక్కొక్క సబ్జెక్ట్‌లో అయిన పాఠాలు చూపిస్తున్నాడు.

అర్ధ సంవత్సరం గడుస్తున్నా సోషల్‌లో రెండు పాఠాలూ, సైన్సులో మూడు, లెక్కలు అయితే ఒకటి రెండు ఛాప్టర్స్... ఇలా వున్నాయా పోర్షన్స్. చూస్తోన్న చంద్రానికి మతిపోయినట్లయింది. అయో మయంగా వింటున్నాడు.

ప్రైవేట్ కాన్వెంట్స్‌లో అధికంగా ఫీజులు వసూళ్లు వుంటాయే తప్ప పాఠాలు చెప్పక పోవడం అనేది వుండదు.

ఇదేం స్కూలో... ఇంత అధ్వాన్నంగా వుందా?

"ఇంతవరకూ ప్రోగ్రెస్ రిపోర్ట్స్ అయినా ఇవ్వలేదంటే ఇంకా ఆ స్కూల్లో పాఠాలేం చెప్తున్నట్లు...? ఏదో మన తాపత్రయం కొద్దీ బోలెడు ఫీజులు కట్టి మంచి స్కూలని అక్కడ చేరుస్తాంగానీ, అవీ గవర్నమెంటు బళ్లను మించిపోతున్నాయి..." లక్ష్మి ఆవేద నగా చెప్తోంటే, ఆశ్చర్యంగా వింటున్నాడు చంద్రం.

తనకు తెలిసినంతవరకూ అంత పేరున్న కాన్వెంట్స్ పిల్లల స్టడీస్ విషయంలో అంత రెక్‌లెస్‌గా వుండవు. అక్కడ పేరెంట్స్ అంతా ఎడ్యుకేటెడ్ కాబట్టి అన్నీ ఫార్మాలి టీగా జరిగిపోవాల్సిందే. ఏదిఏమైనా తమ తప్పులేకుండా చూసుకుంటుంటారు స్టాఫ్... సుపీరియర్స్‌కు భయపడి. పిల్లలు నేర్చుకోక పోతే అది వాళ్ళ ఖర్మ... అంతే"

"చంద్రం ఇది చూడరా. నోట్సు ఇలాగా వ్రాయించేది. ఇలా వ్రాస్తే ఎన్ని నోట్సులైతే సరిపోతాయి చెప్పు"

"ఇంత పేపరు వేస్ట్ చేయించేందుకు ఆవి డకు బుద్ధి ఎలా లేకపోయింది? ఇలా అయితే మధ్యతరగతికి చెందిన మావంటి తల్లిదండ్రులు ఏమైపోవాలి? అసలు మా సంపాదన అంతా వాడి చదువుకే పోస్తున్నాం. ఏం తింటున్నామో? ఏంలేదో... ఎవరికి తెలుస్తాయి? " తన గోడు వెళ్ళబోసుకుంది లక్ష్మి.

చంద్రం అనిల్ నోట్సు తీసుకుని చూశాడు.

పేజీ మొత్తానికీ కలిపి మూడు లేక నాలుగు మీనింగ్స్‌కంటే ఎక్కువ లేవు. ప్రతి వర్డ్ తరువాత మూడు నాలుగు లైన్స్ వేస్ట్‌గా వదిలిపెట్టివున్నాయి. నీట్‌నెస్ పేరుతో ఎంత వేస్ట్... వ్రాసినంతవరకూ నోట్సంతా అలాగే వుంది. పోనీ పిల్లలు అలా తెలియక వ్రాశారేమో అనుకునేందుకు వీల్లేదు. కారణం నోట్సుమీద టీచర్ సిగ్నే

చర్స్ వున్నాయి. చదువులు కాస్ట్‌లీ అయ్యాయంటే అవ్వవూ మరి... సామాన్యుడు ఈ చదువుల స్థాయిని ఎలా అందుకోగలడు?

ఆ రాత్రి...

భోజనం, చదువు అయ్యాక అనిల్ నిద్ర పోతున్నాడు.

సారధి, లక్ష్మి, చంద్రం భోజనాలు ముగించి తీరిగ్గా కూర్చున్నారు.

చంద్రం అసలు విషయం కదిపాడు.

"అయితే బావగారూ! కనీసం పదిహేను రోజులు ముందుగా రావాలి"

సారధి నవ్వాడు.

"బ్యాంక్ ఆఫీసరు మా మామగారయితే అలాగే వచ్చేవాడ్ని" అన్నాడు నవ్వుతూ.

"మరి మీరు ఎప్పుడొస్తున్నారు? " చంద్రం నవ్వుతూ అడిగాడు.

"పదిరోజులు ముందుగా మీ అక్కయ్యను, అనిల్‌ను పంపిస్తాను. పెళ్ళి రెండురోజులుందనగా నేను వస్తాను" సారధి చెప్పాడు.

చంద్రం అక్కవైపు చూశాడు.

"మీ బావగారు అలాగే అంటార్రా చంద్రం. నాకు మాత్రం పదిరోజులు ముందంటే ఎలా వీలవుతుంది?

"వీలు కాకపోవడానికి ఏముంది? " ఆశ్చర్యంగా అడిగాడు చంద్రం.

"నీలూకు స్కూలు పోతుంది. మీ బావగారికి భోజనానికి ఇబ్బంది పడ్తారు"

సారధి నవ్వాడు. "చంద్రం! మీ అక్కయ్య చెప్పిన రెండు కారణాల్లో మొదటి కారణం మాత్రమే నిజం"

లక్ష్మి భర్తవంక మింగేసేలా చూసింది.

"పదిరోజులు ఆబ్సెంటయితే ఏమవుతుందక్కా...? "

"ఇంకా నయం ఈ నాలుగు రోజుల్లోనే వాడి ఐ.ఏ.ఎస్. చదువంతా పాడయిపోయినట్లు బెంగ పెట్టుకుంటుంది మీ అక్క" సారధి సరదాగా అన్నాడు.

"చంద్రం నీ బావగారి ఎగతాళి మాటలకేంగానీ, నిజంగా నేను వెళ్తాను అని అంటే ఆయనే వద్దనేవారు."

"నువ్వు నెలరోజులు కాదు.. మూణ్ణెల్లు వెళ్ళి వుండు నాకేం అభ్యంతరంలేదు" ఆమె ఎలాగూ వెళ్ళదన్న ధీమాతో అన్నాడు సారధి.

లక్ష్మి కొరకొరలాడుతూ చూసిందే తప్ప మాట్లాడలేదు.

నిజానికి సారధికి ఇంటికి వచ్చేప్పటికి భార్యాబిడ్డలు కనిపించకపోతే పదిలంఖణాలు చేసినవాడిలా డీలాపడిపోతాడు.

నువ్వు లేకుండా నాకేం బాగోదోయ్. నేనుండలేను అంటూ పురుషాహంకారం లేకుండా ఫ్రాంక్‌గా చెప్పేస్తాడు.

తప్పనిసరై ఓ నాలుగు రోజులు పుట్టింటికి వెళ్ళినా, నీకేం మీ వాళ్ళ మధ్య హాయిగా వున్నావు. నాకు మాత్రం తెగబోర్ కొట్టింది. అసలు నామీద నీకేమీ ప్రేమ లేదు. వుంటే, అయ్యో... నా కోసం ఎంత బెంగ పెట్టుకున్నాడో. అని తెల్లారేపాటికల్లా వచ్చేసి వుండేదానివి. అంటూ సాధిస్తాడు.

ఈ సాధింపు అంతా లక్ష్మికి ఆనందాన్నే కలిగిస్తుంది. భర్తకు తనమీద గల ప్రేమకు మురిసిపోతుంటుంది.

"ఇదిగో చంద్రం. పంపలేదనే నెపం నామీద ఎందుకు? ఇప్పుడే చెప్తున్నాను. మీ అక్కను నీతోనే తీసుకువెళ్ళు. సరేనా...? " సారధి నవ్వుతూ అన్నాడు.

నిజానికి లక్ష్మికి అప్పటికప్పుడే తమ్ముడితో కలిసి పుట్టింటికి వెళ్ళాలనే కోరిక వుంది. పుట్టింటికి వెళ్ళి చాలాకాలం అవడం చేత ఎప్పుడెప్పుడు వెళ్ళి అందర్నీ చూద్దామా అని వుంది.




అమ్మా... నాన్న, తమ్ముడు, చెల్లితో సరదాగా కాలక్షేపం చెయ్యాలనీ వుంది. కానీ, ఎలా? తను వెళ్తే అనిల్‌ను కూడా తీసుకు వెళ్ళాలి.

హాఫియర్లీ ఎగ్జామ్స్ దగ్గర పడుతోండగా పదిరోజులు ఆబ్సెంట్ అంటే మాటలా?

ఇవన్నీ ఆలోచించిన లక్ష్మి తన కోరికను అదుపులో వుంచుకుని, "చంద్రం నేనూ, మీ బావగారూ కలిసి పెళ్ళి మూడురోజుల ముందు వస్తాం. ఇక్కడ పరిస్థితి అంతా చూస్తున్నావుగా. అమ్మా... నాన్నలకు సర్ది చెప్పు..." అంది.

చంద్రానికి చిన్నక్క లక్ష్మితోపాటు చిన్న బావ సారధి అంటే ఎంతో ప్రేమా, గౌరవం. వాళ్ళిద్దరి అన్యోన్యత అతడ్ని ముగ్ధుడ్ని చేస్తుంటుంది.

పెద్దక్క తనకంటే చాలా పెద్దది కావడం చేత తను చిన్నవాడిగా వుండగానే ఆమెకు పెళ్ళయి అత్తగారింటికి వెళ్ళిపోవడం జరిగింది. అందుకే ఆమె దగ్గర పెద్దగా చనువులేదు.

పైగా పెద్దక్క భర్త ఒట్టి అనుమానపు పీనుగు. ఆ అనుమానంతో ఆమెను పుట్టింటికి పంపడు. ఎప్పుడైనా ఇద్దరూ కలిసి వచ్చినా ఏదో విషయంలో పేచీ పెట్టుకుని వున్న రెండు రోజులూ ముటముటలాడుతూ వుంటాడు.

అలాంటి భర్త పక్కనుంటే ఆడదానికి అత్తవారిల్లయినా, పుట్టిల్లయినా, చివరికి స్వర్గమే అయినా ఒక్కలాగే వుంటుంది నరకంలా. పెద్దక్క, పెద్దబావలకు పూర్తిగా వ్యతిరేకంగా, వున్న రెండు రోజులూ ఇంటిని ఆనందభరితం చేసే చిన్నక్క, చిన్న బావ అంటే సహజంగానే ఇంటిల్లిపాదికీ అభిమానం.

ఆ రాత్రే వెళ్తానని ప్రయాణం కడుతున్న చంద్రాన్ని బలవంతంగా ఆపేశారు సారధి-లక్ష్మి.

ఆ రాత్రి-

బావమరిదితో కబుర్లు చెప్పినంతసేపూ చెప్పి సారధి కూడా నిద్రపోయాక తమ్ముడి పక్కనే కూర్చుంటూ లక్ష్మి అడిగింది.

"చంద్రం నీ గురించి ఓ మాట విన్నాను. నిజమేనా? "

"ఏమిటక్కా... నేనెవరినైనా ప్రేమించానా? " నవ్వుతూ అన్నాడు చంద్రం.

"నవ్వులాట కాదురా నీ గురించి విన్నప్పటినుండీ నాకెంతో బెంగగా వుంది"

చంద్రం మౌనంగా ఉండిపోయాడు. ఈసారి అతని ముఖంలో నవ్వులేదు.

"చంద్రం! ఉద్యోగానిదేముందిరా ఇవ్వాళ కాకపోతే మరోనాడు దొరుకుతుంది. అంతగా దొరక్కపోతే ఏదో ఒకటి చేసుకుని బతకొచ్చు. ఉద్యోగం రాలేదన్న నిరాశతో జీవితం నాశనం చేసుకుంటార్రా ఎవరైనా"

అప్పటికీ చంద్రం మౌనంగానే వుండిపోయాడు తప్ప పెదవి విప్పలేదు.

"చంద్రం నా మాట విను. లేనిపోని తిరుగుళ్ళతో జీవితాన్ని ధ్వంసం చేసుకోకు. విప్లవం అంటూ తిరుగుతూ ఇందులో నువ్వు ఏం సాధిద్దామనుకుంటున్నావు? " ఆవేశంగా అడిగింది లక్ష్మి.

ఆ సంఘాలపైనగానీ, వాటిని ప్రోత్సహించే పార్టీల మీదగానీ, ఆ సంఘాల ఆశయాలమీదగానీ, ఆచరణ మీదగానీ ఎలాంటి సానుభూతీ, సానుకూలమైన అభిప్రాయాలూ లేవు లక్ష్మికి.

"చంద్రం ఈ విప్లవాలూ, సంఘాలూ ఏం ఉద్ధరిస్తున్నాయని నువ్వు వాటిపట్ల ఆకర్షితుడవవుతున్నావు చెప్పు. ఉద్యోగం రాకపోతే ఏ కొట్లో అయినా గుమాస్తాగా చేరు. నెమ్మదిమీద నీ కాళ్ళమీద నువ్వు నిలబడగలుగుతావు. చంద్రం నా మాట వినవూ? ఈ విప్లవాలూ, సంఘాలూ మనకు వద్దు" అనునయంగా చెప్పింది లక్ష్మి.

"అదేం లేదక్కా. నువ్వు అనవసరంగా భయపడకు. ఓ స్నేహితుడితో కలిసి రెండుసార్లు వెళ్ళానంతే" చంద్రం అక్క చేతిని తన చేతిలోకి తీసుకుంటూ నమ్మకంగా చెప్పాడు.

లక్ష్మి అనిల్‌ను విశ్వసించినట్లే చంద్రాన్ని కూడా విశ్వసించింది.



ఉదయం ఎనిమిదిగంటలు కావొస్తోంది.

అనిల్ స్కూలుకు వెళ్ళేందుకు రెడీ అయ్యాడు. స్కూలు బ్యాగ్ చేతిలోకి తీసికొని చుట్టూ చూశాడు.

తల్లి వంటగదిలో ఏదో పనిలో వుంది. తండ్రి కూరలు తెచ్చేందుకు మార్కెట్‌కు వెళ్ళాడు.

మామయ్య ఇంట్లో ఎక్కడా కనిపించలేదు.

అనిల్ మెల్లగా పెరట్లోకి నడిచాడు. వెనక్కు తిరిగి ఇంటివైపు చూశాడు తనను ఎవరైనా గమనిస్తున్నారేమో అని. ఎవరూ లేరు. అనిల్ ధైర్యం తెచ్చుకున్నాడు. నెమ్మదిగా తాను గుర్తు పెట్టిన చోటుకు వెళ్ళి గుంట తవ్వి రింగ్ బయటకు తీసి మట్టి దులుపుతున్నాడు.

అక్కకు కనిపించకుండా సిగరెట్ తాగే ప్రయత్నంలో చెట్టు చాటుకు వచ్చిన చంద్రం అనిల్‌ను గమనించి అక్కడికి వచ్చాడు.

మామయ్యను చూసి తుళ్ళిపడ్డాడు అనిల్. చంద్రం అనిల్ చేతిలోని వుంగరాన్ని చూశాడు. పాలిపోయిన ముఖంతో చటుక్కున పిడికిలి మూశాడు కంగారుగా.

"ఏమిటి అనిల్?" మూసివుంచిన వాడి పిడికిలివైపు చూస్తూ అడిగాడు చంద్రం. అనిల్ క్షణంలో సర్దుకుని, "రింగ్ మామయ్యా..." అంటూ అరచేతిని అతని వైపు చాపాడు.

"ఉంగరమా? ఎక్కడిది."

"మొన్న మమ్మీ రింగ్ పోయింది. ఇప్పుడు మట్టిలో దొరికింది"

అంతలో "ఏమిటి? అనిల్ ఇంకా వెళ్లలా?" అంటూ లక్ష్మి వచ్చింది.

అనిల్ సంతోషంగా ఉంగరం తల్లికి చూపాడు.

"ఉంగరమా? ఎక్కడుంది?" లక్ష్మి అనిల్ చేతిలోనుండి ఉంగరం తీసుకుంది ఆతృతగా.

"ఈ మట్టిలో దొరికింది మమ్మీ..."

లక్ష్మి సంతోషంతో తలమునకలయింది. ఆనందంతో ఉక్కిరి బిక్కిరి అవుతూ ఉంగరం పోవడమూ, తామంతా ఎంతగా విచారపడిందీ, ఎంతగా వెదుక్కుందీ వివరంగా చెప్తూండగానే అనిల్ మెల్లగా అక్కడ్నించి వెళ్ళిపోయాడు.

"సూట్‌కేస్‌లో పెట్టిన ఉంగరం మట్టిలోకి ఎలా వచ్చిందో నాకు అర్థం కావడం లేదురా..." అంది చివరిగా.

చంద్రానికి అనిల్ తనను చూడగానే తృళ్ళిపడటం, వాడి ముఖం పాలిపోవడం గుర్తుకు వచ్చింది.




సూట్ కేస్‌లో అంత భద్రంగా వుంచిన ఉంగరం మట్టిలో దొరికిన నైనంలో ఏదో అపశృతి తోచింది.

కానీ ఆ అపశృతికి రూపం ఏమిటో, అది అక్కకు ఎలా వివరించాలో అతనికి అర్థం కాలేదు.

అనిల్ ఉంగరం చేతిలో వుంచుకుని దులుపుతుండగా తను చూశాడు. అసలు స్కూలుకు వెళ్ళేందుకు తయారైన అనిల్ ఇటువైపు ఎందుకు వచ్చాడు?

తనను చూస్తూనే వాడెందుకలా తృళ్ళిపడ్డాడు? వాడి మొఖం ఎందుకలా పాలిపోయింది?

పజిల్‌లా అనిపించింది చంద్రానికి.

ఇంతలో సారధి రావడంతో, "ఏమండీ. ఉంగరం దొరికింది" ఉద్వేగంగా చెప్పింది లక్ష్మి.

"ఉంగరమా? ! ఎక్కడ? " ఆనందాశ్చర్యాలతో అడిగాడు సారధి.

"మన అనిల్‌కు మట్టిలో దొరికిందట. ఎక్కడ దొరికిందిరా? " అంటూ అనిల్‌కొరకు చూసి, "అన్నట్లు వాడేడీ? " అంది.

"వాడు వెళ్ళిపోయాడు" చంద్రం చెప్పాడు.

"ఔనుకదూ... స్కూల్ బస్ టైం అయ్యింది. ఉంగరం దొరికిన సంతోషంతో వాడు వెళ్ళడం నేను గమనించనేలేదు"

"లక్ష్మి! ఉంగరం సూట్ కేస్‌లోకదూ పెట్టానన్నావ్. మరి మట్టిలో ఎలా దొరికింది? "

"అదే నాకూ విచిత్రంగా వుందండీ. నాకు బాగా గుర్తు"

"ఎప్పుడైనా బట్టలతోపాటు బయటపడి వుంటుందిలే. నువ్వు చూసుకోకుండా ఊడ్చేసి వుంటావు" సారధి అన్నాడు.

"అలా జరిగేందుకు అవకాశం లేదండీ. ఉంగరం బాక్స్ మూత గట్టిగా వుండి ఊడలాగితే తప్ప తెరుచుకోదు. అంతేకాదు. బాక్స్ మూత పెట్టింది పెట్టినట్లే వుంది.

ఉంగరం ఎవరూ తీయకుండా బయటికి వచ్చే ప్రసక్తేలేదని ఆమె లోపలి మనస్సు చెప్తోంది.

"కానీ... మరి ఎవరు తీస్తే బయటికి వచ్చింది? "

ఆ ప్రశ్నకు జవాబు దొరక్కా భర్త చెప్పిన, ఆర్గ్యుమెంటుకు అంతేనేమోలే అని సరిపెట్టుకుంది లక్ష్మి.

అంతటితో ఆ ప్రసక్తి ఆగిపోయింది.

ఆ రాత్రి చంద్రం ప్రయాణమైవెడుతూ అక్కనూ, బావనూ వీలయినంత త్వరగా వచ్చేయమని మరీ మరీ హెచ్చరిస్తూ, అనిల్ చదువులో మరీ పూర్‌గా వుండటాన్ని గుర్తుచేసి వాడి విషయంలో తగిన శ్రద్ధ తీసుకోమని చెప్తూ, అనిల్ చుట్టూ చేతులు చుట్టి,

"అనిల్ బాగా చదువుకోవాలిరా" అన్నాడు.

అలాగే అన్నట్లుగా చిరునవ్వుతో తల ఊపుతూ "టా... టా..." చెప్పాడు అనిల్

★ ★ ★

రాత్రి పదకొండు గంటలయివుంటుంది.

ఇంటిముందు కారు ఆగిన చప్పుడయి, అరే... మమ్మీ-డాడీ ఈవేళ త్వరగా వచ్చేశారే... అనుకుంటూ ఎందుకైనా మంచిదని తను చదువుతోన్న "రాత్రి విందు" పుస్తకాన్ని దాచేసి, తను శ్రద్ధగా ఇంత రాత్రివరకూ చదువుతున్నందుకు మమ్మీ, డాడీ సంతోషించేవిధంగా క్లాసు పుస్తకాలు తీసి శ్రద్ధగా చదువుతున్నట్లు నటిస్తున్నాడు సుభాష్.

ఎందుకో ఒక్కసారి డాడీని చూడాలనిపించి చదువు నటన ఆపి లేచి కిటికీలో



నుండి బయటికి చూశాడు.

ప్రతిరోజూ సుభాష్ లేచేవేళకే తల్లీ, తండ్రీ టిఫిన్ చేసి హాస్పిటల్‌కు వెళ్ళిపో తుంటారు. సుభాష్ బద్ధకంగా ఎనిమిదింటికి లేచి తయారయ్యేవేళకు కాంపౌండర్ స్కూటర్‌తోసహా రెడీగా వుంటాడు స్కూల్లో డ్రాప్ చేసేందుకు.

తిరిగి సాయంత్రం గేమ్స్ తరువాత ఇల్లు చేరేవేళకు తల్లీ, తండ్రీ హాస్పిటల్‌లోనే వుంటారు.

రాత్రి ఎయిట్‌కు ఇల్లు చేరిన డాక్టర్స్ కాస్త రిఫ్రెష్ అయి మళ్ళీ ఏవో ఎంగేజ్ మెంట్స్, క్లబ్ అంటూ వెళ్ళిపోతుంటారు. మళ్ళీ రాత్రి ఇల్లు చేరడం అర్థరాత్రి దాటిన తరువాతే.

అప్పటికి సుభాష్ నిద్రపోతుంటాడు.

ఈమధ్య ఏదైనా అవసరం వస్తే సుభాష్ హాస్పిటల్‌కు వెళ్తాడు. అయితే డాక్టర్సుగా ఇద్దరూ ఎప్పుడూ బిజీగానే వుంటారు. ఏవో ముఖ్యమైన ఒకటి రెండు మాటలే.

సుభాష్‌కు మమ్మీ-డాడీలతో కలిసి సినిమాకు వెళ్ళాలనీ, స్కూలు కబుర్లు చెప్పాలనీ కలిసి కబుర్లు చెపుతూ భోంచేయాలనీ ఇలా ఎన్నెన్నో చిన్ని చిన్ని కోరికలు.

ఎప్పుడో ఓసారి తప్ప అతని కోరికలు కోరికలుగానే మిగిలిపోతుంటాయి.

డాక్టరు దంపతులకు సుభాష్‌ను తమతో సినిమాలకు, షికార్లకు తిప్పే వీలు కుదరక అతనికి పూర్తి స్వేచ్ఛ ఇచ్చేశారు.

అందుకే కాబోలు సుభాష్ వయస్సుకంటే పెద్దరికం పెంచుకున్నాడు. వాడి మానసిక వయస్సు కాలేజీ పిల్లల స్థాయిని చేరుకుంది అనేక విషయాల్లో.

సుభాష్‌కు తండ్రి అంటే అమితమైన ప్రేమ.

తండ్రి అతని కంటికి "హీమాన్"లా కనిపిస్తాడు.

కిటికీలోనుండి బయటికి చూస్తోన్న సుభాష్‌కు తల్లీ-తండ్రీ కారుదిగి లోపలికి వస్తూ కనిపించారు.

అయితే తల్లి ముఖం ధుమధుమ లాడుతోంది కోపంతో.

హాల్లోకి వస్తూనే ఇహ ఆగలేనట్లు, "మీ ప్రవర్తన నాకేం నచ్చడంలేదు" అంది ఆగ్రహంగా.

అక్కడే వున్న ఓ ఛైర్‌లో రిలాక్స్‌డ్‌గా కూర్చుని, "ఏ విషయంలో?" అంటూ చాలా కూల్‌గా ప్రశ్నించాడు డాక్టర్ మూర్తి.

తాపీగా అతను ప్రశ్నిస్తున్న తీరుకు ప్రేమలత మరింతగా మండిపోయింది.

"పార్టీలో మిసెస్ సుషమారావుతో మీ ప్రవర్తన విషయంలో"

"అంటే?"

"అంటే కూడా నేనే చెప్పాలా?"

"చెప్పకుండా ఎలా తెలుస్తుంది?"

"లోకమంతా చెప్పుకుంటున్నారు... ఛీ..ఛీ... ఎంత సిగ్గుచేటు"

"అంత సిగ్గుచేటయిన విషయం ఏమిటట?"

"మిసెస్ సుషమారావుతో మీ రాసక్రీడలు" కోపంగా అంది ప్రేమలత.

"అంతేనా? మరింకేమీ చెప్పుకోడం లేదా?"

"అంటే మీ ఉద్దేశ్యం?" క్రోధంగా అడిగింది ప్రేమలత.

"డాక్టర్ మోహన్‌తో డాక్టర్ మిసెస్ ప్రేమలతా మూర్తి కామక్రీడల గురించి"

ఒక్క క్షణం దెబ్బతిన్నట్లు అయ్యింది ప్రేమలత. ఆ వెంటనే రెట్టించిన క్రోధంతో "వాడ్డూ యూ మీన్?" అంది అరుస్తూ.

తల్లీ తండ్రీ మధ్య గొడవంతాభయంగా వింటోన్న సుభాష్ అప్పటి తల్లి ఆకారం




చూసి మరింత భయపడిపోయాడు.

"కూల్ డౌన్... అలా గొంతు చించుకోకు. అద్దాల మేడలో వుంటూ ఇతరుల మీద రాయి విసరడానికి సాహసించడం అంత క్షేమం కాదు"

ప్రేమలత కళ్లు రక్తాన్ని చిందుతున్నాయి.

పార్టీలో డాక్టర్ మిసెస్ సుషమారావుతో భర్త అతి చనువు చూసి జలసీ ఫీలయి అడిగింది. అంత మాత్రాన భర్త తనను ఇలా నిలదీస్తాడని ఆమె ఊహించలేకపోయింది. తానేమిటో భర్తకు తెలిసిపోయిందే అన్న ఉక్రోషం, తెలిసిన విషయాన్ని నిలదీసి అడిగినందుకు కలిగిన క్రోధంతో నిలువునా ఊగిపోతోంది ప్రేమలత.

"చూడు డార్లింగ్! ఆట్టే ఆయాసపడకు. మనం భార్యాభర్తలుగా ఒకరి మీద నమ్మకాన్ని ఒకరం ఏనాడో పోగొట్టుకున్నాం. నిన్ను డాక్టర్ సురేష్ ఒడిలో చూసిన నాడూ నిన్ను ప్రశ్నించలేదు. డాక్టర్ మోహన్‌రావుతో నీ స్నేహం తెలిసిన నాడూ నిన్ను ప్రశ్నించలేదు ప్చ్. అదంతా పోనీ. మన భార్యాభర్తల సంబంధం కేవలం ఒక అగ్రిమెంట్. ఒకరి అవసరం ఒకరికి డాక్టర్స్‌గా వుందికాబట్టి, ఇలా బతకడంవల్ల సంఘంలో ఇద్దరికీ గౌరవం కాబట్టి, అన్నింటినీ మించి సుభాష్ భవిష్యత్ కోరుకునే వాళ్లంకాబట్టి ఇలా బతుకుతున్నాం. అంతకుమించిన అనుబంధాలూ, విలువలూ, పవిత్రతలూ మన ఈ బంధంలో లేవు. సో... ఒకరిని ఒకరు ప్రశ్నించుకోడం మానేస్తే ఇద్దరికీ ఆరోగ్యం.. ఏమంటావ్?"

భర్త దీర్ఘమైన మాటల సారాంశం అర్ధమయినకొద్దీ ప్రేమలత ముఖం కందగడ్డలా అయ్యింది.

మితిమీరిన కోపంతో నేలను తన్నుతూ బెడ్‌రూంలోకి వెళ్లిపోయింది.

సుభాష్‌కు ఎందుకో అప్రయత్నంగా కళ్లల్లో నీళ్లు తిరిగాయి. అర్ధరాత్రి గడిచేవరకూ అలా హాల్లోనే మౌనంగా కూర్చుండిపోయాడు డాక్టర్ మూర్తి.

సుభాష్ పడుకున్నాడన్న మాటేగానీ చాలా రాత్రివరకూ నిద్రపట్టలేదు.

ఏ విషయం గురించి ఆలోచిస్తోందీ కూడా తెలీకుండా రకరకాల భావాలతో ఆ పసి హృదయం ఒత్తిడికి లోనయ్యింది.

తల్లిమీద విపరీతమైన అసహ్యం కలిగింది.

ఛీ.. ఛీ మమ్మీ అనుకున్నాడు తల్లిని గురించి చీదరగా. కానీ అదే తప్పు చేస్తోన్న తండ్రిమీద మాత్రం వాడికేమీ కోపం రావడంలేదు. పైగా బోలెడు జాలి కూడా కలిగింది.

'పాపం డాడీ డాడీ ఎంత మంచివాడు' అనుకున్నాడు జాలిగా. పనిలో పనిగా వాడికి తన స్కూలు, క్లాస్, నవీన్, వేణూ, పద్మజారాణి, తను అప్పటివరకూ చదివిన 'రాత్రివిందు' నవల, క్రికెట్ తారలు సచిన్, చిరంజీవి కూడా దూసుకు వచ్చారు. ఆలోచనలతో అలసిపోతూ ఎప్పటికో నిద్రలోకి జారుకున్నాడు.

ఆ మరునాడు స్కూల్లో ఇంటర్వెల్ అయింది.

పిల్లలంతా బిలబిలలాడుతూ బయటకు పరిగెత్తారు.

"సుభాష్"

"ఊఁ" పరధ్యానంగా పలికాడు సుభాష్.

"ఎందుకురా అలా వున్నావ్?" వేణు అడిగాడు.

"ఏం లేదు" ఇబ్బందిగా అన్నాడు సుభాష్.

"ఏం కాదు..ఏదో వుంది మాకు చెప్పవా?"

"ఏం లేదురా" బలవంతాన నవ్వాడు సుభాష్.

"మీ మమ్మీ కోప్పడిందా?" అనిల్ అడిగాడు.

"లేదు"

"అయితే మీ డాడీ కోప్పడ్డారన్న మాట"

"మా డాడీ ఎంత మంచివారో... ఎప్పుడూ కోప్పడరు తెలుసా?"

"మరి ఎందుకలా వున్నావ్?" రాజు అడిగాడు.

"మరి మా మమ్మీ..."

ఏదో చెప్పబోయిన వాడల్లాఎవరో గొంతు నొక్కినట్లు ఠక్కున ఆగిపోయాడు సుభాష్.

ఎందుకో ఆ విషయం ఎవ్వరికీ చెప్పగూడనిదిగా తోచింది వాడికి. హఠాత్తుగా "ఊఁ మీ మమ్మీ" ఆసక్తిగా అడిగాడు అనిల్ చెప్పమన్నట్లు.

సుభాష్‌ను వాళ్ల మమ్మీ కోప్పడిందనే తన ఊహ కరెక్టే అవుతుందన్న ఉత్సాహంతో.

సుభాష్‌కు వెంటనే ఏం చెప్పేందుకూ తోచలేదు.

"అవునూ ఈ వేళ నీలూ డ్రెస్ చూశారా.. బాగుందికదూ?" అన్నాడు ఆ విషయం అత్యవసరం అయింది అన్నట్లుగా.

"అవును" అన్నారు అందరూ ఉత్సాహంగా.

"సుభాష్! నీలూ స్కర్ట్ మీద రెడ్ ఇంక్ వేద్దామా?" రాజు రహస్యంగా అడిగాడు.

"అమ్మో హెచ్.యమ్. మేడమ్‌కి తెలిస్తే చంపేస్తారు" వేణు భయపడ్డాడు.

"వద్దులేరా" అనాసక్తంగా తేల్చేశాడు సుభాష్.

స్నేహితులంతా సుభాష్ వంక వింతగా చూశారు.

అసలు ఇలాంటివి మొదటిగా ప్రపోజ్ చేసి నాయకత్వం వహించేది సుభాషే.

"సుభాష్ మారిపోయాడు..." వేణూ అన్నాడు.

"ఏం మారిపోలేదు" నవీన్ వెంటనే అందుకున్నాడు.

"మారిపోయాడు"

"మారిపోలేదు"

"అవును'

"కాదు"

"అవునూ అవునూ" వేణు కచ్చగా అన్నాడు.

"కాదు.. కాదు...కాదు" అంతే పట్టుదలగా చెప్పాడు నవీన్.

"మారిపోయాడు బెట్"

"మారిపోలేదు... బెట్"

"బెట్"

"బెట్"

నవీన్, వేణులు అలవాటుగా పోట్లాడుకుంటున్నారు.

"మారిపోయాడంటే"

"మారిపోలేదంటే"

"బెట్"

"బెట్"

"ఎంతెంత..?"

"ఎంతెంత..?"

"అరేయ్ మీరెందుకు పోట్లాడుకుంటారు. సుభాష్‌నే అడగండి" రాజు సర్ది చెప్పాడు.

"మనం సుభాష్‌నే అడుగుదాం." వేణుకు ఈ ఆలోచన నచ్చి అన్నాడు.

"అడుగుదాం"

"ఏరా సుభాష్! నువ్వు మారిపోలేదూ?" వేణు అడిగాడు. సుభాష్‌కు తాను మారిపోయాననడం గొప్ప నామోషీగా తోచింది. తను హీరో. తను ధైర్యవంతుడు... తనెప్పుడూ మారిపోడు. పిరికివాళ్లే మారిపో





తారు.

"నేనేం మారలేదు" సుభాష్ చెప్పాడు.

"అయ్యిందా నేను చెప్పలా?" నవీన్ ముఖం ఆనందంతో వెలిగిపోగా వేణు ముఖం అవమానంతో కందిపోయింది.

"ప్రొద్దుటినుండీ సుభాష్ అదోరకంగా మారిపోయినట్లు కనిపించడంలే రాజూ?" రాజును మాట సహాయం కొరకు అర్థిం చాడు వేణు.

"అవును" అన్నట్లుగా తల ఆడించాడు రాజు.

"ఏం కాదు... నేనేం మారిపోలేదు" సుభాష్ మొండిగా అన్నాడు.

"అయితే నీలూ స్కర్ట్ మీద రెడ్ ఇంక్ చల్లుతావా?"

"ఓ..." గర్వంగా అన్నాడు సుభాష్.

అంతే క్షణాల్లో అంతా కలిసి నీలూ వైట్ స్కర్ట్‌మీద రెడ్ ఇంక్‌చల్లే ప్లాన్ అల్లేశారు.

ఆపైన నిముషాల్లో అమలు పరిచారు.

ఆ మధ్యాహ్నం... లంచ్ అవర్‌కు ముందు సుభాష్ అండ్ పార్టీ హెచ్‌ఎమ్ సిస్టర్‌తో ఒక్కొక్కరూ నాలుగు కేన్ దెబ్బలు రుచి చూశారు.

గుడ్లనీరు గుడ్లకుక్కుకుంటూ "దెయ్యం... ఎంత గట్టిగా కొట్టిందో" అని చాటుగా తిట్టుకున్నారు.

★ ★ ★

ఫోర్త్ పిరియడ్...

ఎప్పటిలాగే రజని మేడం తీరిగ్గా కుర్చీలో కూర్చుని నేరేడు పండు ఛాయలో కొత్తగా వేసిన నెయిల్ పాలిష్ తన స్కిన్ ఛాప్‌కు సూటయిందో లేదో సరిచూసుకొంటోంది.

పిల్లలందరూ ఎప్పటిలాగే చిన్నచిన్న గుంపులుగా డివైడ్ అయి ఎవరి గొడవలో వాళ్లున్నారు.

సుభాష్ చేతిలో ఏదో పత్రిక వుంది. రాజు సుభాష్ తలలు వంచి పత్రిక వంక ఆసక్తిగా చూస్తున్నారు.

"సుభాష్! ఏం బుక్ అది?" అనిల్ అడిగాడు.

సుభాష్ పత్రిక కొంచెం అనిల్‌వైపుజరిపి, "చదువు" అన్నాడు.

ఆ పత్రికలో బొమ్మలు చూస్తూ "ఛీ" అన్నాడు అనిల్ అప్రయత్నంగా.

"నాకూ మొదట్లో అట్లాగే అనిపించింది. కానీ చదివితే భలే మజాలే"

మొదట ఛీ అన్నా ఆ బొమ్మలవంక ఆసక్తిగా చూస్తూ అనిల్ అడిగాడు.

"సుభాష్ ఈ బుక్ ఎక్కడిది నీకు?"

"ఓ మా ఇంట్లో ఇలాంటి బుక్స్ చాలా వున్నాయి తెలుసా?"

"ఎక్కడివి?" బ్రా... కట్ డ్రాయర్‌తో వున్న అమ్మాయి ఫొటోవంక తదేకంగా చూస్తూ అడిగాడు అనిల్.

వాడి కళ్లల్లో ఎంతో కుతూహలం ఇదీ అని చెప్పలేని ఏదో భావం హృదయమంతా నిండిపోగా రెప్పవేయకుండా చూస్తున్నాడా బొమ్మల్ని.

"సుభాష్! మీ ఇంట్లో ఎవరు చదువుతారీ పుస్తకాలు?"

"మా డాడీ మా మమ్మీ.. అంకుల్"

"నువ్వు చదివితే మీ మమ్మీ డాడీ ఊరుకుంటారా?"

"వాళ్లకు తెలీకుండా చదువుతాను. నాకు చదువుకునేందుకు వేరే గది వుందిగా"

వేణు, అనిల్, రాజు, నవీన్, ప్రకాష్ నిశ్శబ్దంగా ఆ శృంగార పత్రిక చదవడంలో లీనమైపోయారు.

"రమేష్ జానకిని గాఢంగా హృదయానికి హత్తుకుని ఫాలభాగాన్ని ముద్దులతో ముంచెత్తాడు"

పుస్తకం చదువుతోన్న నవీన్ హఠాత్తుగా తల ఎత్తి "ఫాలభాగం అంటే ఏమిట్రా?" అని అడిగాడు అనుమానంగా.

ఆ విషయమేదో తనకు తెలుసుగానీ తప్పో రైటో తెలుసుకోవాలని అడిగినట్లుగా వుందా ధోరణి.

"ఫాల భాగం అంటే తెలీదూ?"

"నీకు తెలుసా?"

"ఓ"

"చెప్పు చూద్దాం"

"ఫాలభాగం అంటే మరేమో..." వేణు ఎందుకో కాస్త సిగ్గుపడ్డట్లయ్యాడు.

"చెప్పరా!"

"మరేమో... మరేమో... ఫాలభాగం అంటే అదే ఆడవాళ్లు..."

"ఫాలభాగం అంటే ఆడవాళ్లా?" అనిల్ అడిగాడు.

"అదేరా.. ఆడవాళ్లు... ఊ వుండు చూపిస్తాను" అంటూ ఓ చిన్న ఆడ బొమ్మగీసి మధ్యలో రెండు వృత్తాలు గీసి చుక్కలు పెట్టి ఫాలభాగం అంటే ఇదీ" అంటూ చూపెట్టాడు.

"నేనూ అదే అనుకున్నాను" అన్నాడు నవీన్.

"నేను కూడా అదే అనుకున్నాను" అన్నాడు సుభాష్ గర్ల్స్ స్టూడెంట్స్ గుండెల వైపు ఓరగా చూస్తూ.

"నేను కూడా" ప్రకాష్.

"నేను కూడా" అన్నాడు రాజు సుభాష్‌ను అనుకరిస్తూ. అందరూ దొంగదొంగగా గర్ల్స్ వైపు చూస్తూ గుసగుసగా మాట్లాడుకోసాగారు.

రజనీ మేడం కష్టాలకు ఫుల్‌స్టాప్ పెట్టినట్లుగా హోల్‌బెల్ మ్రోగింది. లంచవర్‌లో అందరూ వాటర్ బాటిల్స్, లంచ్‌బాక్సులతో చెట్లకిందకు చేరారు. సుభాష్ తన లంచ్ బాక్స్ ఓపెన్ చేస్తూ అడిగాడు, "వేణూ నీదేం డిష్?"

వేణూ బాక్స్ తెరచి చూసి చెప్పాడు, "బాదం హల్వా, క్యాజునట్ పకోడా మరి నీది"

"కోవా విత్ సమోసా"

"నాది సేమ్యా ఉప్మా" నవీన్ చెప్పాడు.

"నాది పరోటా విత్ మటన్ ఫ్రై" రాజు చెప్పాడు.

"నావి కేక్స్..." ప్రకాష్ అన్నాడు...

అందరూ తమ టిఫిన్ ఒకరితో ఒకరు షేర్ చేసుకుంటూండగా "అనిల్ మరి నీ డిష్ ఏమిటి?" అని అడిగాడు సుభాష్.

అనిల్‌కు తన బాక్స్‌లో వున్నదేమిటో చెప్పడానికి సిగ్గు వేసింది.

"రైస్" అన్నాడు నెమ్మదిగా.

"రైసా?" అదోలా అన్నాడు రాజు.

"కర్రీ ఏమిటి?" వేణు అడిగాడు.

అనిల్‌కు చెప్పక తప్పడం లేదు "దోసకాయ" అన్నాడు మెల్లగా.

"దోసకాయను ఇంగ్లీష్‌లో ఏమంటారు?" వేణు అడిగాడు.

అందరూ దోసకాయను ఇంగ్లీష్‌లో ఏమంటారు? అనే విషయం గురించి తీవ్రంగా ఆలోచించారు. అయితే అనిల్‌కు ఈ విషయం ఏమీ నచ్చలేదు. చివరికి దోసకాయను ఇంగ్లీష్‌లో ఏమంటారో ఎవరికీ తెలీలేదు.

"అనిల్! నువ్వూ మాలాగా టిఫిన్ తెచ్చుకోకూడదూ?" స్పూన్‌తో సేమ్యా ఉప్మా తింటూ అన్నాడు నవీన్.

"నిజమే... రైస్ తినాలంటే బోర్..." వేణు.

"నాకూ అంతే" రాజు.

"నాకూ అంతే..." ప్రకాష్.





"నాక్కూడా..." సుభాష్

అనిల్ అభిమానంగా వంచిన తల ఎత్త కుండా కూర్చున్నాడు.

అనిల్‌కు కూడా స్కూలుకు అన్నం తెచ్చు కోడం ఇష్టం వుండదు.

అందరూ హాయిగా టిఫిన్స్ తింటూంటే తనొక్కడే అన్నం తినడం అంటే వాడికి అభిమానం. తనకూ బాక్స్‌లో టిఫిన్ పెట్ట మని తల్లి దగ్గర చాలాసార్లు మారాం చేశాడు.

"ఉన్నవాళ్లతో మనకు ఏమిటి? మనకు వున్నంతలో మనం ఖర్చు చేయాలి. ప్రతి రోజూ టిఫిన్ అంటే చాలా ఖర్చు అవు తుంది. అయినా నీల్! మనం మనకంటే వున్నవాళ్లతో పోల్చుకుని మనకు లేదే.. అని బాధ పడకూడదు నాన్నా! మనకన్నా లేని వాళ్లకన్నా మనం బాగున్నందుకు ఆనందిం చాలి. తృప్తిపడాలి. ఎంతోమంది తినడానికి ఈ అన్నం కూడా లేక గంజి తాగీ పస్తులు పడీ వుంటున్నారు. వాళ్లందరికంటే మనం ఎంతో నయం కదూ?" అంటూ అరగంట క్లాస్ తీసుకుంది.

టిఫిన్ లేకపోగా ఆ క్లాస్ వినలేక చచ్చాడు. అందుకే మమ్మీని ఏమీ అడగడు. అన్నింటికీ ఏదో చెప్తుంది.

అందరూ కబుర్లు చెప్పుకుంటూ టిఫిన్ తినడం పూర్తి చేస్తే అనిల్ తల్లిని గురించి కోపంగా ఆలోచిస్తూ అన్నం తినడం పూర్తి చేశాడు.

భోజనం పూర్తి అయ్యాక, లాస్ట్ పిరియడ్ పూర్తి చెయ్యకుండా వదిలేసిన పత్రిక కళ్ల ముందు కదులుతోండగా త్వరగా చదివే యాలని ఆతృతపడ్డారు.

అందరూ ఒక్కచోట గుమిగూడి పుస్త కాన్ని క్లాస్ బుక్ చాటుగా పెట్టి చదవడం ప్రారంభించారు.

ఇదీ అని చెప్పలేని ఆనందం, అసహ్యం, భయం, కుతూహలం, తొందరపాటు ఊపి వేస్తోండగా పుస్తకం పూర్తిగా చదివారు.

మళ్ళీ మళ్ళీ చదివారు.

వ్యసనం వంటి భయంకరమైన లక్షణం హృదయాన్ని వశపరచుకోగా సాయంత్రం పిరియడ్స్ జరుగుతోండగా కూడా క్లాసు పుస్తకాల అడుగున పెట్టుకుని మళ్ళీ చది వారు.

ఫ్రెండ్స్‌కు అంత థ్రిల్ అందించినందుకు సుభాష్ ఆనందపడుతూ అన్నాడు, "రేపు ఇంకో పుస్తకం తెస్తాను. అది దీనికంటే కూడా బాగుంటుంది"

"మరిచిపోకుండా తీసుకురా..."

"మరిచిపోను"

"ఆ పుస్తకం పేరేమిటి...?" అనిల్ అడి గాడు.

"కామరంజని"

అనిల్ చటుక్కున తన చేతిలోని పుస్తకం పేరు చూశాడు.

"శృంగార రాణి"

"సుభాష్! మొన్న పద్మజా రాణి పది కొండు రోజులు స్కూలుకు రాలేదు... ఎందుకో తెలుసా...?" మెల్లని స్వరంతో అడిగాడు రాజు.

"ఎందుకు...?"

"మరేమో..." అంటూ సిగ్గుపడ్డట్టు ఆపే శాడు రాజు.

"అరేయ్! వీడు ఆడపిల్లలా సిగ్గుపడ్తాడే మిత్రా?" నవీన్ అన్నాడు. తనను ఆడపిల్ల అన్నందుకు చాలా కోపం తెచ్చుకున్నాడు రాజు. అయినా పద్మజా రాణి స్కూలుకు ఎందుకు రాలేదో చెప్పాలనే ఉత్సాహంతో కోపాన్ని ఆపుకున్నాడు.

"ఎందుకు రాలేదురా...?" కళ్ళనిండుగా కుతూహలం నింపుకుని అడిగాడు వేణు.

"మరేమో... పెద్దమనిషి అయ్యిందట..."

"పెద్దమనిషి కావడం అంటే ఏమిట్రా?" అనిల్ ప్రశ్నించాడు.

"అంటే ఆడవాళ్ళు పెద్దవాళ్లు అవుతారన్న మాట..."

"ఎలా అవుతారు...?"

ఎలా అవుతారో చెప్పడం రాలేదు రాజుకు.

"ఏమోరా... మరీ..." అన్నాడు క్షణం తరువాత.

"పద్మజారాణి పెద్దమనిషి అయినట్టు నీకెలా తెలుసు...?" నవీన్ అడిగాడు.

"మా మమ్మీ వాళ్ళింటికి పేరంటానికి వెళ్ళింది తెలుసా...?"

"ఊహుం..."

ఇక ఆ తరువాత ఆ విషయాన్ని గురించి ఏం మాట్లాడుకోవాలో తెలీనట్లు రెండు నిముషాలు మౌనంగా వుండిపోయారు.

చేతిలోని పుస్తకం పేజీలు తిప్పుతూ అనిల్ అడిగాడు,

"సుభాష్ ఈ పుస్తకాలు ఎక్కడ అమ్ము తారు?"

"కిళ్లీ షాపుల్లో బోలెడు వుంటాయిరా. కామరంజనిలో ఒక కథ భలే గమ్మత్తుగా వుంటుంది చెప్పనా?"

"చెప్పు"

అందరూ కథ వినేందుకు ఉత్సాహం ప్రక టించారు.

సుభాష్ కథ చెప్పడం ప్రారంభించాడు. వర్ణించి మరీ చెప్తున్నాడు.

"భలే... అప్పుడు అతనేం చేశాడు" పట్ట లేని ఉత్సాహంతో కథలోని ఘట్టాన్ని గూర్చి అడుగుతున్నారు.

"ఆ అమ్మాయిని గట్టిగా ముద్దుపెట్టుకుని పైట..."

రాజు, వేణు, నవీన్, అనిల్, ప్రకాష్, సుభాష్ చెప్పేకథను ఒళ్లంతా చెవులు చేసు కుని వింటూ చేతనయినంతగా ఊహించు కుంటున్నారు. పిరియడ్ పూర్తయింది.

ఇక ఆ తరువాత సుభాష్ ఆ కథను స్థిమితంగా పూర్తి చేసేందుకు కుదరనేలేదు.

ఆ రాత్రి అనిల్ పుస్తకాలముందు కూర్చు న్నాడన్న మాటేగానీ పూర్తికాని కామరంజని కథే అతని మనస్సులో రింగ్ అవుతోంది.

ఆ తరువాత వాళ్లిద్దరూ కలిసి ఏం చేసి వుంటారు. ఇదే ధ్యాస. రేపెలాగయినా సరే ఆ పుస్తకం చదవాలి అనుకున్నాడు.

ఒకవేళ సుభాష్ మరిచిపోయి వస్తా డేమో... ఎలా? సుభాష్ కామరంజని పుస్తకం మరిచిపోయి రాకపోతే బాగుం డును.. అనుకున్నాడు పదేపదే...

ఆ రాత్రి అనిల్ కలల్లో శృంగారరాణి, కామరంజని కలగా పులగంగా కలిసిపోయి ఉక్కిరిబిక్కిరయ్యాడు.

మరునాడు...

ఫస్ట్‌పిరియడ్ జరుగుతుండగానే అనిల్ అడిగాడు,

"సుభాష్! కామరంజని తెచ్చావా?"

"కామరంజనా?"

"ఆం.. నిన్న చెప్పావుగా... ఆ పుస్తకం"

"ఓ అదా?"

"అవును... తెచ్చావా?"

"లేదు"

"ఏం...?"

"మరిచిపోయాను"

అనిల్ నిరుత్సాహపడ్డాడు.

అనిల్ నిరుత్సాహం చూసిన సుభాష్, "రేపు తప్పకుండా తీసుకువస్తాను"




అన్నాడు.

"తప్పకుండా తేవాలి"

"గాడ్‌ప్రామిస్ తప్పకుండా తెస్తాను"

గాడ్‌ప్రామిస్ పెట్టుకున్న సుభాష్ మరునాడు మరిచిపోకుండా ఆ పుస్తకం తెచ్చాడు.

ఆ తరువాత వరుసగా రాత్రిరాణి, మొగుడంటే, ప్రేయసి, మొదటిరాత్రి వంటి పుస్తకాలు ఎన్నో కంబైండ్‌గా చదివి ఆనందించారు.



హాఫియర్లీ ఎగ్జామ్స్ జరుగుతున్నాయి.

ఏం రాస్తున్నాడో కూడా తెలీకుండా పేపర్లు రాస్తున్నాడు అనిల్. వాడికా క్వశ్చన్ పేపరు గ్రీక్ అండ్ లాటిన్‌లా కనిపిస్తోంది. ఆ పోర్షన్ వాడు అసలు చదవలేదు. కనీసం క్లాసులో విన్న గుర్తయినా లేదు. ఫస్ట్ యూనిట్‌లో చదివిన ఒకటి రెండు ప్రశ్నలు వస్తే రాసి పేపరు ముందు పెట్టుకుని కూర్చున్నాడు.

ఏం రాయాలో తోచక కాసేపు క్వశ్చన్ పేపరు మీద తన పేరును పెయింట్ చేసుకున్నాడు. ఆ తరువాత కాసేపు పిచ్చిగీతలు గీశాడు.

ఏం చేసినా టైం అరగంటకు మించి గడవలేదు.

పేపరు ఇచ్చి బయటికి వెళ్ళిపోయేందుకు వీల్లేదు. చివరిగా బిట్ పేపరు చేయాల్సి వుంటుంది.

ఛీ.. ఛీ.. ఫూల్స్ మనస్సులోనే విసుక్కుంటున్నాడు అనిల్. ఇలా గోళ్ళుగిల్లుకుంటూ గడపాలంటే ఎంత బోరో వాళ్ళకేం తెలుస్తుంది? బిట్ పేపరు ముందు ఇచ్చి చావకూడదూ?

ఈలోగా ముందు కూర్చున్న వాడి పేపర్లో చూసి రాద్దామని ప్రయత్నించాడు గానీ ఎదురుగా దయ్యంలా ఇన్‌విజలేటర్ కూర్చుని చూస్తుండటంతో సాధ్యం కాలేదు.

రెండు గంటలూ రెండు యుగాల్లా గడిపి చివరి అరగంట బిట్ పేపర్ పది నిముషాల్లో పూర్తిచేసి ఎగ్జామ్ హాల్లోంచి బయటపడి గొప్ప రిలీఫ్ ఫీలయ్యారు అనిల్ అతని ఫ్రెండ్స్.

"నీలూ! పరీక్ష ఎలా రాశావు? " అన్న తల్లి ప్రశ్నకు, "బాగానే రాశాను మమ్మీ..." అని ఎందుకైనా మంచిదని "చెప్పని సిలబస్ నుండి కూడా క్వశ్చన్స్ ఇచ్చారు మమ్మీ" అన్నాడు ముందు జాగ్రత్తగా.

"అయ్యో! మరి ఎలా రాశావ్రా? "

"చాయిస్‌లో కొన్ని ప్రశ్నలు వదిలేశాను మమ్మీ"

లక్ష్మి క్వశ్చన్ పేపరు తీసుకుని ఏయే ప్రశ్నలు రాసిందీ ఏవి రాయందీ వివరంగా అడిగి తెల్సుకుంది.

అయితే అనిల్ ఛాయిస్ పోగా రాయమన్న ప్రశ్నలకన్నా ఒక్కటి మాత్రం తక్కువగా రాసినట్లు, సిలబస్ పూర్తికాకపోవడమే అందుకు కారణం అయినట్లు నమ్మకంగా చెప్పాడు.

ఎప్పటిలాగే లక్ష్మి, "పోర్షన్స్ కంప్లీట్ చేయకుండా పిల్లల్ని పరీక్షలు రాయమంటే ఏం రాస్తారనీ..." కాసేపు పిల్లల మీద జాలిపడి ఆపైన ఫీజులు మాత్రం ఠంచనుగా వసూలు చేస్తారనీ, పాఠాలు మాత్రం చెప్పరనీ స్కూలునూ, స్టాఫునూ తన ధోరణిలో కాసేపు తిట్టుకుంది.

పోర్షన్ కంప్లీట్ చేసివుంటే తన కొడుకు ఆ ఒక్క ప్రశ్నకు కూడా తృప్తిగా సమాధానం రాసి వుండేవాడుకదా అని కాసేపు వాపోయింది.

దాదాపు పరీక్షలన్నీ అలాగే జరిగిపోయాయి. ఒక్క సైన్సు పరీక్ష రోజు మాత్రం నిద్రమొహం మేడం ఇన్విజిలేటర్‌గా రావ

డంచేత ముందువాడి పేపర్లో కొంత కాపీ చేయగలిగాడు బిట్ పేపర్‌తో సహా.

ఆరోజు అలా రాయగలిగినందుకు మహా ఉత్సాహంగా ఫీలయ్యాడు అనిల్.

మరునాడు సోషల్ పేపరు అయిపో తూనే సెకండ్ టర్మ్ హాలీడేస్ ప్రారంభమ వుతాయి.

అనిల్ పరీక్షలైపోతూనే ఎలాగూ హాలీ డేస్ కాబట్టి ముందుగానే పుట్టింటికి వెళ్లా లనే ప్లాన్‌లో వుంది లక్ష్మి.

అనిల్‌కి కూడా ఇదివరలో అమ్మమ్మగారి ఊరు వెళ్లాలంటే సంబరంగానే వుండేది. కానీ స్నేహితులతో ఎంజాయ్ చేయడం అలవాటు పడ్డాక ఇప్పుడు వాడికా వూరు వెళ్లడం అంటే డామ్ బోర్‌గా అనిపిస్తోంది. అందుకే వాడికా హాలీడేస్ ఎంత మాత్రం ఇష్టంగా లేవు. ఆ గ్రూప్ మొత్తంలో హాలీ డేస్‌పట్ల ఇంటరెస్ట్ చూపిస్తోంది సుభాష్ ఒక్కడే.

"హాలీడేస్‌లో నేను మా అంకుల్ దగ్గరకు వెడతాను" సుభాష్ చెప్పాడు.

"ఏ ఊరు? "

"మెడ్రాస్" గర్వంగా చెప్పాడు సుభాష్.

"ఛీ ఛీ... మామయ్యావాళ్లు కూడా అలా మెడ్రాస్‌లో వుంటే ఎంత బాగుండేది. వెళ్లి వెళ్లి డొక్కు పల్లెటూళ్లో వున్నారు. అక్కడికి వెళ్లాలంటే బోర్" మనస్సులోనే విసుక్కు న్నాడు అనిల్.

"ఛీ హాలీడేస్ అంటే నాకు బోర్" వేణు అన్నాడు.

"ఎంచక్కా ఎంజాయ్ చెయ్యొచ్చుగా? "

"ఎంజాయా నా తలకాయా? ఎక్కడికి బయల్దేరినా మా మమ్మీ ఎక్కడికీ అని మొదలెడ్తుంది. ఎందుకు వెళ్తున్నానో, ఎప్పుడు వస్తానో అన్నీ చెప్పాలి. కాస్త ఆలస్యం అయితే ఇంత ఆలస్యం అయ్యిందేం అంటూ ఆరాలు తీస్తుంది. డామ్‌బోర్"

ఫ్రెండ్స్‌కు అర్థం అయ్యింది.

హాలీడేస్‌లో వేణూ మీద వాళ్ల మమ్మీ నిఘావుంటుంది.

"నువ్వు రా రాజూ? " సుభాష్ అడిగాడు.

"ఈ హాలీడేస్‌లో మా డాడీ ఇంకో ట్యూషన్ పెట్టిస్తారట" ఏడ్పు ముఖంతో చెప్పాడు రాజు.

"నిజంగానే హాలీడేస్ మహాబోర్. అసలు ఫ్రెండ్స్‌ను కలవడానికే కుదర్దు" నవీన్ అభి ప్రాయపడ్డాడు.

"మా మామయ్య వాళ్ల ఊరు వెళ్లాలి. నాకా పల్లెటూరు వెళ్లాలంటే మహాబోర్" చికాగ్గా ముఖం చిట్లిస్తూ చెప్పాడు అనిల్.

పిల్లలు హాలీడేస్‌లో ఎవరి సాధక బాధ కాలు వాళ్లు చెప్పుకున్నారు. చివరికి ఒక్క సుభాష్ తప్ప మిగిలిన వాళ్లంతా హాలీడేస్ బోర్ అని తేల్చేశారు.

ఈ హాలీడేస్ బోర్‌నుండి తప్పించుకోడా నికి ఉపాయాలు చెప్పడంలో దిట్ట అయిన నవీన్ అనిల్‌కు ఓ మంచి ప్లాన్ చెప్పాడు. ఆ ప్లాన్ తప్పనిసరిగా సక్సెస్ అవుతుంది. అయితే నిరాఘాటంగా ఫ్రెండ్స్‌ను ప్రతి రోజూ కలుసుకోవచ్చు.

అనిల్ కూడా ఆ ప్లాన్ విని సంతోషిం చాడు. ప్రమాదరహితమైన సక్సెస్‌ఫుల్ ప్లాన్.

మరునాడు...

మధ్యాహ్నం ఎగ్జామ్ పాడ్ తీసుకుని మెట్లు ఎక్కి ఇంట్లోకి వస్తోన్న కొడుక్కు ఎదురు వెళ్లి "ఎగ్జామ్ ఎలా రాశావు నాన్నా? " అంది లక్ష్మి ఎప్పటిలా.

అనిల్ లోపలికి వచ్చి అక్కడేవున్న వాలు కుర్చీలో కూలబడుతూ, "ఎగ్జామ్ కండక్ట్ చేయలేదు. మమ్మీ..." అన్నాడు నీరసంగా.




"ఎగ్జామ్ కండక్ట్ చేయలేదా? " ప్రపంచపు వింత విన్నంత ఆశ్చర్యంగా అంది.

"ఔను మమ్మీ"

"అదేం? "

"సిలబస్ కాలేదుగా? " వంగి షూ విప్పు కుంటూ అన్నాడు అనిల్.

"అయితే? "

"హాలీడేస్ తరువాత కండక్ట్ చేస్తారట ఎగ్జామ్"

"హాలీడేస్ తరువాతా? "

"ఆc"

లక్ష్మికి అంతా అయోమయంగా వుంది.

"అప్పుడు మాత్రం సిలబస్ ఎలా అవుతుంది? "

"హాలీడేస్‌లో ప్రైవేట్ క్లాసులు తీసుకుని చెప్తారట"

"ప్రైవేట్ క్లాసులా? "

"ఆc బోర్ మమ్మీ! హాలీడేస్‌లో కూడా ప్రైవేట్ క్లాసులంటే"

విసుగ్గా అన్నాడు అనిల్.

లక్ష్మి దిగాలు పడ్డట్టుగా అయ్యి అయోమయంగా చూస్తోంది కొడుకువంక. "ఎవరికీ పెట్టలేదా? " అయోమయపు ప్రశ్న.

అనిల్ నవ్వి, "మా క్లాసు వాళ్లకు ఎవరికీ పెట్టలేదు మమ్మీ" అన్నాడు.

"మీకు కామన్ ఎగ్జామ్స్ కదూ? "

"ఏమో"

"క్వార్టర్లీ, హాఫియర్లీ, యాన్యువల్ ఎగ్జామ్స్‌కు డిస్ట్రిక్ట్‌వైజ్‌గా ఒకే పేపరు వుంటుంది. అలాంటప్పుడు ఒకచోట ఎగ్జామ్ కండక్ట్‌చేసి మరో చోట కండక్ట్ చేయకపోవడం ఎలా కుదురుతుంది? "

"ఏమో మమ్మీ" అనిల్ లేచి బాత్‌రూం లోకి వెళ్లిపోయాడు. లక్ష్మి దిగాలు పడ్డట్టు అలా కూర్చుండిపోయి, అసలు పరీక్ష పెట్టకపోవడం ఏమిటీ? అనుకుంది నూటపద హారోసారి.

ఏమో ప్రైవేట్ మేనేజ్‌మెంట్స్ గవర్నమెంట్ రూల్స్ ఖాతరు చేయడంలేదు.

ఈ స్కూలు వాళ్లయితే మరీను... నిజంగా సిలబస్ అయ్యాక వేరే పేపర్ ఇస్తారేమో అనుకుంది కొంత ఆలోచన తరువాత.

అనిల్‌కు ప్రైవేట్ క్లాసు వుంటే తను ఊరికి ఎలా వెళ్తుంది? అనుకున్న ప్రయాణం క్యాన్సిల్ అయినందుకు బాధపడింది. అంతకుమించి అనిల్ చదువు సంధ్యలు ఆమెకు పజిల్‌గా అనిపించసాగాయి.

రోజురోజుకూ తగ్గిపోతున్న స్టాండర్డ్స్... పెరిగిపోతున్న ఫీజులు... శూన్యంగా కనిపిస్తోన్న భవిష్యత్... ఆమెను తెలీని బాధకు గురిచేస్తున్నాయి.

★ ★ ★

ఆ రోజు అనిల్ బర్త్‌డే.

ఉన్న ఒక్క కొడుకు పుట్టినరోజునూ ఎంతో అపురూపంగా ,సంతోషంగా జరుపుకుంటారు సారధి, లక్ష్మి.

లక్ష్మి అనిల్‌కు ఉదయమే తలంటి కొత్త డ్రస్ వేసింది.

తలంటుతూనే అనిల్‌కు ఇష్టమైన జీడిపప్పులు ఎక్కువగా వేసితయారు చేసిన సేమ్యా పాయసం వడ్డించింది.

ఇక ఆ రోజంతా అనిల్ తింటూ తిరుగుతూ ఆడుతూ జాలీగా గడిపేయడమే! రోజు మొత్తంలో ఒక్కసారి కూడా బుక్స్ ముట్టుకునే అవసరమే లేదు.

సాయంత్రం మమ్మీ డాడీతో కలిసి సినిమా. అందుకే అనిల్‌కు తన బర్త్‌డే అంటే ఇష్టం. కానీ ఇంత సంతోషంలోనూ ఒక అసంతృప్తి. తన బర్త్‌డే ఎప్పుడూ హాలీ



డేస్‌లోనే వస్తుంది.

చక్కగా కొత్తడ్రస్ వేసుకుని స్కూలుకు వెళ్లేందుకు వుండదు. క్లాస్‌మేట్స్ అందరికీ చాక్లెట్స్ పంచేందుకు లేదు... చక్కగా గుప్పెడు చాక్లెట్స్ ఇచ్చి నా బర్త్‌డే మేడం అని చెప్తే మేడమ్స్ విషెస్ చెప్తారు నవ్వుతూ. అదీ వుండదు. ఛ.. ఈ వెధవ హాలీడేస్ నా బర్త్‌డే రోజే రావాలా? ప్రతి సారీ తిట్టుకుంటూనే వుంటాడు అనిల్.

"మమ్మీ! మా ఫ్రెండ్స్‌ను కలసివస్తాను" గారంగా అడిగాడు అనిల్. వంటగదిలో అనిల్ బర్త్‌డే సందర్భంగా స్పెషల్స్ చేయ డంలో తలమునకలై వుంది లక్ష్మి.

"ఊ త్వరగా వచ్చేయ్" అంటూ తిరిగి ఏదో జ్ఞాపకం వచ్చినట్లు "నాన్నా నీలూ! ఆ బాక్స్‌లో చాక్లెట్స్ వున్నాయి! పట్టుకెళ్లి మీ ఫ్రెండ్స్‌కి ఇవ్వు" అని చెప్పేసి తన పనిలో మునిగిపోయింది.

అనిల్ బాక్స్‌లోని చాక్‌లెట్స్ గుప్పిళ్లతో జేబులో పోసుకున్నాడుకానీ తృప్తి కలగ లేదు... ఛీ... ఛీ... చిన్న పిల్లాడిలా చాక్‌లెట్స్. సుభాష్ తన బర్త్‌డేకు ఫ్రెండ్స్ అందరికీ కేక్స్ ఇప్పించాడు.

నవీన్ క్వాలిటీ అయిస్‌క్రీం ఇప్పించాడు.

వేణు కూల్ డ్రింక్స్ ఇప్పించాడు.

ప్రకాష్ మిరపకాయ బజ్జీల పార్టీ చేశాడు.

రాజు క్యాడ్‌బరీస్ చాక్‌లెట్స్ తెచ్చాడు. తనే మరీ లీస్ట్ ఈ ఛీప్ వెరైటీ చాక్‌లెట్స్ ఇస్తే వాళ్లంతా నవ్వరూ?

అనిల్ ఎప్పుడో జాగ్రత్త చేసి వుంచుకున్న ట్వంటీ రూపీస్ నోట్ కొరకు పుస్తకాల అట్ట లన్నీ విప్పుతూ వెదుకుతున్నాడు ముందు గదిలో. కిచన్‌లో వున్న లక్ష్మి అనిల్ పుస్త కాలవద్ద వుండటం చూసి, "నాన్నా నీల్! ఇవ్వాళ్టికి చదువూ, గిదువూ ఏమీ వద్దు. హాయిగా ఫ్రెండ్స్‌తో ఎంజాయ్ చెయ్యి. రేప టినుండీ శ్రద్ధగా చదువుకుందువుగానీ" అంది ప్రేమగా.

"అలాగే మమ్మీ.." అన్నాడు అనిల్.

ఈలోపు ఇంగ్లీష్ టెక్స్ట్ బుక్ అట్టలో దాచిన ట్వంటీ రూపీస్ నోట్ దొరికింది. తీసి జాగ్రత్తగా జేబులో పెట్టుకుని "వెళ్లొస్తా మమ్మీ" అంటూ మరోసారి తల్లికి చెప్పి వెళ్లి పోయాడు అనిల్.

పన్నెండు గంటలయ్యింది.

లక్ష్మి వంట పూర్తిచేసి బయటకు వెళ్లిన భర్త కొరకూ, కొడుకు కొరకూ ఎదురు చూస్తూ కూర్చుంది.

మరో అరగంట తరువాత సారధి వచ్చాడు.

"అనిల్ ఇంట్లో లేడా? " అన్నాడు బట్టలు మార్చుకుంటూ.

"లేడు... ఫ్రెండ్స్‌ను కలిసి వస్తానని వెళ్లి చాలా సేపయింది. ఎదురు చూస్తున్నాను" అంది లక్ష్మి వీధివైపు చూస్తూ.

సారధి కొడుక్కు బర్త్‌డే ప్రజంటేషన్‌గా ఇవ్వడానికి చక్కని ఇంగ్లీష్ బుక్ ఒకటి తీసుకు వచ్చాడు.

అనేక రకాల సముద్రపు చేపల రకాలూ, వాటి జీవిత విశేషాలూ చాలా సింపుల్ లాంగ్వేజ్‌లో, చక్కని బొమ్మలతో వుందా పుస్తకం.

కొడుకుతో కలిసి భోంచేయాలని సారధి, లక్ష్మి మరో గంట వెయిట్ చేశారు. కానీ అనిల్ జాడలేదు. బ్యాంక్ టైం అయిపో తుండటంతో సారధి భోంచేసి బ్యాంకుకు వెళ్లిపోయాడు.

ఇంట్లోకీ బయటికీ కాలుకాలిన పిల్లిలా తిరుగుతూ అనిల్‌కొరకు ఎదురు చూస్తోంది లక్ష్మి.

క్రమంగా భోజనం వేళ దాటుతున్నా భోజనానికి కూడా రాకుండా తిరుగుతోన్న





కొడుకు మీద కోపం వస్తోంది.

వదిలిపెడితే చాలు ఈ పిల్లలు గాలిప టాలే.. తిరిగి చేతికి చిక్కరు. తిండీ తిప్పలూ లేకుండా ఎండనబడి ఎక్కడ ఆడు తున్నాడో... అనుకుంది లక్ష్మి కోపంగా.

మూడు గంటలయ్యింది... మధ్యాహ్నం సాయంత్రంగా మారుతోన్నా భోజనం చేయ కుండా పుట్టినరోజున పస్తున్న కొడుకును తలచుకుని నిట్టూర్చింది.

నాలుగు గంటలయ్యింది. లక్ష్మిలో ఆందోళన తారాస్థాయికి చేరుకొంటోంది. కన్నీళ్ల పర్యంతమై కొడుక్కోసం ఎదురు చూస్తోంది.

సమయం ఆరు గంటలయ్యింది.

కొడుకు జాడలేదు. అనిల్ ఈ రోజంతా అభోజనంగా వున్నాడనే విషయం గుర్తొ స్తున్న కొద్దీ కళ్లు నిండుకుంటున్నాయి. ఇంతసేపూ ఎక్కడ తిరుగుతున్నాడో అనే కోపానికి, ఏమయ్యాడోననే ఆందోళనకు జత కలిసింది.

ఆరున్నర అవుతుండగా ఇల్లంతా చీకట్లు ముసురుకొంటోండగా దీపం వెలిగించేం దుకు లోపలికి వెళ్లింది లక్ష్మి.

"మమ్మీ" అంటూ పెద్దగా కేకపెడుతూ ఇంట్లోకి పరుగెత్తుకు వచ్చిన అనిల్ తల్లి కాళ్లకు గట్టిగా చుట్టుకుపోయాడు.

నిలువెల్లా గజగజా వణుకుతోన్న అనిల్ తల్లి ఒడిలో రక్షణ పొందడానికే అన్నట్లు ఆమె కాళ్లను గట్టిగా వాటేసుకుని ఒడిలో ముఖం దాచుకున్నాడు.

లక్ష్మి విస్తుపోతూ, "ఏమిటి నాన్నా? ఏం జరిగింది? " అంది అనిల్ ముఖాన్ని పైకె త్తుతూ.

అనిల్ కళ్లనుండి అవిరామంగా కన్నీళ్లు కారుతున్నాయి. భయంతో పెదవులూ శరీరం ఒణికిపోతోంది.

"మమ్మీ మమ్మీ" అంటున్నాడు ఏడుస్తూ వణికిపోతూ.

"ఏమిటి నీల్? ఏం జరిగింది? చెప్పు నాన్నా! భయంలేదు. మీ ఫ్రెండ్స్ దెబ్బలా డుకున్నారా? " అంటూ అనిల్‌ను కూర్చో బెట్టి ప్రక్కనే కూర్చుని లాలనగా తల నిము రుతూ మళ్లీ మళ్లీ అడిగింది.

అనిల్ విడిగా కూర్చోలేనట్లు తల్లి వడి లోకి జారిపోయి కౌగలించుకుంటున్నాడు.

అనిల్ ఎందుకో తీవ్రంగా భయపడుతు న్నాడనే విషయం గ్రహించింది లక్ష్మి.

వాడి భుజం చుట్టూ చెయ్యివేసి ఒళ్లోకి లాక్కుంది ఆర్తిగా.

"నేనున్నాగా.. భయంలేదు... ఏం జరి గింది చెప్పునాన్నా..." అంటూ బుజ్జగిస్తూ మళ్లీ మళ్లీ అడిగింది.

"వేణు.. నవీన్ " వెక్కుతూ వణుకుతూ ఏదో చెప్పేందుకు ప్రయత్నించాడు అనిల్.

"ఆ వేణూ" అంతవరకే అర్థం అయ్యింది లక్ష్మికి.

"వేణూ నువ్వూ దెబ్బలాడుకున్నారా? " అడిగింది నెమ్మదిగా.

"మమ్మీ" ఏదో గుర్తుకు వచ్చినట్లు తల్లిని కౌగలించుకుని గట్టిగా ఏడ్చేస్తున్నాడు అనిల్.

లక్ష్మికి కంగారుగా వుంది. అనిల్ ఇంత భయపడగా ఎప్పుడూ చూడలేదు. సహ జంగా చిన్నపిల్లలు, చిన్నతనంలో చీకటి అనీ, బూచి అనీ, దయ్యం అనీ, పాము అనీ ఇలా దేనికో దానికి భయపడుతుంటారు.

కానీ అనిల్ చిన్నతనంనుండీ ఏ విషయా నికీ భయపడడు.

ఎంత చీకటిలోనైనా ఎంత దూరమైనా వెళ్లిరాగలడు. అనిల్‌కు అలా అలవాటు చేశారు తామిద్దరూ.

మరి ఈ రోజు ఇంతగా భయపడేందుకు ఏం జరిగి వుంటుంది. లక్ష్మి అనిల్‌కు ధైర్య

మిస్తున్నట్లుగా, వెన్ను నిమురుతూ భయం లేదనీ ఏం జరిగిందీ చెప్పమనీ బుజ్జగిస్తూ అడిగింది మళ్లీమళ్లీ. అనిల్ శరీరంలో ఒణుకు తగ్గలేదు. కన్నీళ్లు తగ్గలేదు.

హీస్టీరియా పేషంట్‌లా ఎగ్జైట్ అవుతూ, "మ... మ్మీ. వేణు న...వీ...ను... చం... మమ్మీ..." వెక్కిళ్లమధ్య అన్నాడు అనిల్.

ముద్దముద్దగా అస్పష్టంగా వున్న అనిల్ మాటలు లక్ష్మికి అర్థం కాలేదు. "ఏమిటి నీలూ... వేణు ఏంచేశాడు...?"

అనిల్‌ను కదుపుతూ అడిగింది.

కానీ అప్పటికే అనిల్ స్పృహ తప్పిపోయాడు.

★ ★ ★

మూడు రోజులుగా అనిల్ మూసిన కన్ను తెరవకుండా జ్వరంతో మంచంమీద పడివున్నాడు.

మధ్య మధ్య భయంతో కలవరించడం... ఏడవడం.

మూడు రోజులుగా ఇస్తోన్న మందులేవీ పనిచేయడంలేదు.

లక్ష్మి, సారధి భయపడిపోయారు.

తమ పంచప్రాణాలూ అనిల్‌మీద పెట్టుకుని బతుకుతున్న ఆ దంపతులు అనిల్‌కు ఏ చిన్నదెబ్బ తగిలినా, ఏ కొంచెం ఒళ్లు వెచ్చబడినా విలవిలలాడుతుంటారు. డాక్టర్ భయంలేదనీ, కేవలం భయం మూలకంగానే కుర్రాడు అప్‌సెట్ అయ్యాడనీ, ప్రమాదం లేదనీ చెప్పి ట్రీట్‌మెంట్ ఇస్తున్నాడు.

అయినా లక్ష్మికి ధైర్యం కలగడంలేదు. కొడుకు మంచం దగ్గర్నుండి కదలడంలేదు. ఆమె కళ్ళతడి ఆరడంలేదు.

వళ్లు తెలీని జ్వరంతో అనిల్ ఎగిరెగిరి పడుతున్నాడు.

వేణూ... వద్దురా.. న...వీ...న్... మమ్మీ వేణు చూడు. నవీన్‌ను చంపేస్తున్నాడు. వద్దు... వద్దుగా. వేణూ నాకు నాకేం తెలీదు. న...వీ...న్. వద్దురా" అనిల్ కలవరింతలు వింటోన్న లక్ష్మికి ఆపుకుందామన్నా కన్నీళ్లు ఆగకుండా స్రవిస్తున్నాయి.

జ్వరతీవ్రతవల్ల కందిపోయిన ముఖం మీద ఉంగరాల జుట్టు చిందర వందరగా పడివుంది.

మంచంమీద అసహనంగా కదులుతున్నాడు అనిల్.

తల్లిదండ్రులలోని అందమైన లక్షణాలన్నీ పుణికిపుచ్చుకుని జన్మించాడు అనిల్. అందుకే వాడి పసిముఖం ముద్దులు మూటగడ్తూ, అమాయకంగా చూసేవాళ్ళకు, ఎంత చక్కని పిల్లాడు అనిపించేలా వుంటాడు. లక్ష్మికి, సారధికి అది కూడా ఓ గర్వకారణమైన అంశం.

లక్ష్మి కొడుకు నుదిటిపైన పడుతోన్న ముంగురులు సవరిస్తూ కన్నార్పకుండా వాడి పసిముఖాన్ని చూస్తుండిపోయింది.

నవీన్ మరణవార్త పట్టణంలో సంచలనం కలిగించింది. పట్టణం మొత్తం అట్టుడికినట్లుడికిపోయింది.

క్రికెట్ ఆట పుణ్యమా అంటూ ఒక కుర్రాడి ప్రాణం నిలువునా గాలిలో కలిసిపోయింది అనుకున్నారు సానుభూతిగా.

ఆ రెండు క్షణాలూ క్రికెట్టునూ, ఆ ఆటపై ప్రజలకు పెరుగుతోన్న క్రేజ్‌నూ తూర్పారపట్టారు.

ఆ మరుక్షణం అప్పుడు జరుగుతున్న "వరల్డ్ క్రికెట్ కప్" ఎవరికి దక్కబోతోంది అనే విషయంపై వాదోపవాదాలు పడ్డారు.

పందాలు కాయడం ఆగలేదు.

స్కోరును గురించిన ఎంక్వయిరీ ఆగలేదు.




క్రికెట్ తారలపై అభిమానం తరగడం లేదు.

ఆ క్రికెట్ తారలు అవకతవకగా ఆడిన సందర్భాల్లో నోటికి వచ్చిన బూతులు తిట్టడం మానలేదు.

అన్నీ యధావిధిగానే జరుగుతున్నాయి.

కోట్లు ఖర్చుపెట్టి నిర్వాహకులు ఆ క్రీడలను నిర్వహిస్తున్నప్పుడు ఆ పాటి ఉత్సాహం చూపించడం తమ ధర్మం అని భావిస్తున్నట్లున్నారు ప్రజలు.

పాఠశాలల్లో తమ బిడ్డలకు క్రీడలపై ఎలాంటి సౌకర్యాలు, ప్రోత్సాహాలు లేకపోయినా శాంతిప్రియులైన మన పౌరులు పట్టించుకోరు.

ప్రభుత్వ, ప్రైవేట్ విద్యా సంస్థలలో పి. ఇ. టి. లు లేకపోయినా, కనీసం పిల్లలు గంతులు వేసేందుకు చిన్నపాటి ఆటస్థలం లేకపోయినా తల్లిదండ్రుల దృష్టికి రాదు. వచ్చినా పట్టించుకోరు.

కోట్లు ఖర్చుచేసి నిర్వహించే ఆసియా క్రీడలతోను, ప్రపంచ కప్ కొరకై జరిపే క్రికెట్ మ్యాచ్‌లతోను సంతృప్తి చెంది తమ వంతు ఉత్సాహం ప్రదర్శిస్తుంటారు. ప్రభుత్వ అసమర్థతపై విమర్శలూ, అవినీతి భాగోతాలూ బయటపడే సమయాలలో ప్రజల దృష్టి మళ్లించేందుకు ఇలాంటి ఆటలూ, ఉత్సాహాలూ అంటూ గిమ్మిక్స్ చేస్తుంటుంది ప్రభుత్వం అంటుంటారు.

అయితే అది గిట్టనివాళ్లు చేసే విమర్శగా తీసేస్తుంటుంది ప్రభుత్వం.

అర్ధరాత్రి-

మగతలోనుండి కళ్లు విప్పాడు అనిల్.

ఒక్కక్షణం తాను ఎక్కడ వున్నదీ అర్థం కాలేదు. దాహంతో నాలుక పిడుచకట్టుకుపోతోంటే నాలుకతో పెదవులు తడుపుకున్నాడు.

అనిల్‌కు జరిగిన సంఘటనలు క్రమంగా ఒక్కొక్కటే గుర్తుకువస్తున్నాయి. తన బర్త్‌డే రోజున ముందుఅనుకున్న ప్రకారం అందరూ రాజు ఇంట్లో కలుసుకున్నారు.

తన బర్త్‌డే పార్టీగా అందరికీ ఐస్‌క్రీం ఇప్పించాడు.

ఆవేళ పిల్లలంతా ప్లేగ్రౌండ్‌లో క్రికెట్ ఆడుకునే ప్రోగ్రాం వేసుకున్నారు. ఆటలో అలసిపోయేవరకూ ఆడారు. ఆకలి, టైం కూడా తెలీడంలేదు. పూర్తిగా అలసిపోయాక చెమటలు కక్కుతూ చెట్లకిందికి చేరుకున్నారు. అనిల్ తన దగ్గర మిగిలిన డబ్బుతో వేరుసెనగకాయలు కొన్నాడు.

అందరూ కబుర్లు చెప్పుకుంటూ కాయలు తింటున్నారు.

వరల్డ్ క్రికెట్ కప్ ఏ దేశానికి వస్తుంది? అనే అంశంమీద చర్చ నడుస్తోంది.

"ఏమైనా ఇండియా పాకిస్తాన్‌ల మధ్య పోటీ అయితేనే మజాగా వుంటుందిరా" రాజు అభిప్రాయపడ్డాడు.

"ఇండియా గెలుస్తుందా? పాకిస్థాన్ గెలుస్తుందా?" ప్రకాష్ సందేహం.

"పాకిస్థానే ఫాంలో వుంది. వరల్డ్ కప్ పాకిస్థాన్‌కే వస్తుంది" వేణు అన్నాడు.

"ఏంకాదు కప్పు మన ఇండియాకే వస్తుంది" నవీన్ ఖండించాడు.

"మన ఇండియాకు వచ్చేది కప్పు కాదు... కప్ప"

వేణు చేసిన జోక్‌కు పిల్లలంతా పగలబడి నవ్వారు.

నవీన్ ముఖం కోపంతో ఎర్రబడింది.

"పాకిస్థాన్‌కు వచ్చేది కప్పు కాదు... చిప్ప..." కసిగా అన్నాడు నవీన్.

పిల్లలంతా మళ్ళీ నవ్వారు.

"ఇండియాకే చిప్ప వస్తుంది" రోషంతో అన్నాడు వేణు.

"పాకిస్థాన్‌కే కప్పు వస్తుంది" అంతకంటే రోషంగా బదులిచ్చాడు నవీన్.

"బెట్ కప్ ఇండియాకే వస్తుంది" నవీన్ పట్టుదలగా అన్నాడు.

"బెట్... కప్ పాకిస్థాన్‌కే పోతుంది" వేణు జవాబు.

"ఛాలెంజ్"

"ఛాలెంజ్"

"బెట్..."

"బెట్..."

"ఎంతెంత...?"

"ఎంతెంత...?"

"అన్నమాట అంటే ఆడపిల్ల..." రోషంగా అన్నాడు నవీన్.

"నువ్వే ఆడపిల్ల. మీ నాన్న ఆడపిల్ల. మీ తాత ఆడపిల్ల. మీ మమ్మీ ఆడపిల్ల" ఎగతాళిగా అన్నాడు వేణు.

"మా మమ్మీ ఆడపిల్లే... మరి మీ మమ్మీ మొగవాడా...?"

నవీన్, వేణుల గొడవను పిల్లలంతా ఉత్సాహంగా చూస్తున్నారు. "ఛీ... ఛీ... అలగావాళ్ళతో మాట్లాడ్డం నాదే బుద్ధి తక్కువ"

వాళ్ళ అమ్మభాషలో జవాబు చెప్పాడు నవీన్.

"ఛీ..."

"ఛీ...ఛీ..."

"ఛీ...ఛీ...ఛీ..."

"ఛీ...ఛీ...ఛీ...ఛీ..."

"కుక్క మొహం"

"నక్క మొహం"

"ఎద్దు"

"మొద్దు"

"గాడిద మొహం"

"పంది మొహం"

"నువ్వు పాకిస్థాన్ ఏజంటువురా..."

"నువ్వే రష్యా ఏజంటువు..."

"అందుకే మా నాన్నే రాజకీయాల్లో రోజుకో పార్టీ మారుస్తున్నాడురా..."

ఎకసెక్కంగా అన్నాడు నవీన్.

ఈ ఆరోపణకు ఏం జవాబు చెప్పాలో వెంటనే తోచలేదు వేణుకు. ఉక్రోషంతో పళ్లు నూరుకోడం తప్ప వెంటనే ఏం మాట్లాడలేకపోయాడు.

ప్రత్యర్థి ఆటకట్టించిన ఉత్సాహంతో నవీన్ రెచ్చిపోయాడు.

"అధికారం ఏ పార్టీకి వుంటే ఆ పార్టీ తొత్తురా మీ నాన్న..."

"రేయ్... నవీన్‌గా మాటలు జాగ్రత్తగా రానీ..." ఆవేశంగా అరిచాడు వేణు.

"అందుకే మొన్న మీ నాన్న మీటింగ్‌లో జనం చెప్పులు విసిరారు. షేమ్... షేమ్" రెట్టించిన ఉత్సాహంతో కేకలు పెట్టాడు నవీన్. ఆవేశంతో వేణూ పిడికిళ్ళు బిగుసుకున్నాయి. దౌడలు బిగించి ఊపిరి బలంగా ఒదులుతున్నాడు.

"ఒరేయ్! వీడూ వాళ్ళ నాన్నలా పొలిటీషియన్ అవుతాడురా. అందుకే మాటలు మారుస్తున్నాడు"

"ఒరేయ్ నవీన్‌గా నిన్ను చంపేస్తానురా' ' అంటూ నవీన్ మీదికి ఒక్కదూకు దూకాడు వేణు.

ఇద్దరి చేతులూ కలిశాయి.

భీకరంగా కొట్టుకున్నారు.

గిచ్చుకున్నారు.

జుట్టు పీక్కున్నారు.

చొక్కాలు చింపుకున్నారు.

ఒకరిమీద ఒకరు పడ్తూ కిందపడి దొర్లారు.





ఒకరి తల ఒకరు నేలకేసి బాదుకున్నారు.

హోరాహోరిగా, బాహాబాహి, ముష్టాముష్టి, నఖానఖి పలురకాలుగా సాగే పోరు ఉధృతంగా మారింది. చుట్టూ వున్న స్నేహితులు సర్కిల్‌లా మారి, వాళ్ళిద్దరూ ఫ్రీగా కొట్టుకునేందుకు కావలసిన స్థలం కేటాయించారు.

ఈలలు వేస్తున్నారు... చప్పట్లు చరుస్తున్నారు. హుర్రే... వెల్‌కమ్... క్యాచ్... వంటి మాటలతో కొట్టుకుంటూ రక్తాలు ఓడుతున్న స్నేహితులకు హుషారిస్తూ ఆట విక ఆనందం పొందుతున్నారు.

ఇద్దరి శరీరాలూ గాయాలతో రక్తాలు ఓడుతున్నాయి. నవీన్ కింద వున్నాడు. నవీన్ గుండెలమీద ఎక్కి తల నేలకేసి కొడ్తున్నా కక్షతీరని వేణూ ఎవ్వరూ ఊహించని విధంగా వేగంగా పరుగెత్తుకెళ్లి క్రికెట్ బ్యాట్ అందుకుని నవీన్ తలమీద దెబ్బమీద దెబ్బగా కొట్టడం ప్రారంభించాడు.

మొదటి దెబ్బకే నవీన్ పెట్టిన కేక దిగ్దిగంతాలవరకూ వ్యాపించింది.

దుమ్మూ ధూళితో నిండిన రక్తం మడుగులో నవీన్ కొట్టుకొంటున్నాడు. అంతే. అప్పటివరకూ కేరింతలు కొట్టిన పిల్లలు భయంతో గజగజ వణుకుతూ ఎవరికి తోచిన దిక్కుకు వాళ్లు పారిపోయారు.

ఆ దృశ్యం అంతా మూడు రోజుల క్రితం ఆటస్థలంలో జరిగిందికాక అప్పుడే తన కళ్ళ ముందే జరుగుతున్నట్లుగా భ్రమించాడు అనిల్.

రక్తం... రక్తం... రక్తం... రక్తంలో నవీన్ కొట్టుకుంటున్నాడు. అనిల్ ఆ దృశ్యాన్ని చూడలేనట్లు. కెవ్వు... కెవ్వుమంటూ అరుస్తూ విరుచుకుపడిపోయాడు.

గోడకు చేరగిలబడి మగత నిద్రలోకి జారిపోయిన లక్ష్మి మొదటి కేకకే ఉలిక్కిపడి లేచింది భయంగా.

అనిల్‌కు తిరిగి స్పృహ తప్పింది.

★ ★ ★

సెలవుల తరువాత పాఠశాలలు తెరిచారు.

తమతోపాటుగా వుండే ఇద్దరు స్నేహితులు ఇప్పుడు లేరనే విషయం పిల్లలను బాధించినా క్రమంగా మరిచిపోయి తిరిగి తమ తమ ఆట పాటల్లో పడ్డారు.

చెల్లెలి పెళ్ళి దగ్గర పడుతూంది. పోస్ట్‌పోన్ చేసిన సోషల్ ఎగ్జామ్‌కు సంబంధించిన వివరాలు తెలీటంలేదు. ఒకసారి స్కూలుకు వెళ్ళి ఎగ్జామ్ విషయం కనుక్కొని అనిల్‌కు వారంరోజుల సెలవు కావాలని అడగాలని నిశ్చయించుకుంది లక్ష్మి.

అనిల్ స్నేహితుడి మరణం కళ్ళారా చూసిన షాక్‌నుండి క్రమక్రమంగా కోలుకుని తిరిగి మామూలుగా అవుతున్నాడు.

★ ★ ★

ఎత్తైన ప్రహరీ గోడలూ...

వాటికి తగినట్లుగా పెద్ద ఇనుపగేటూ... లోపల కొన్ని ఎకరాల విశాలమైన ఆవరణా.

అందులో విశాలమైన గదులతో వున్న పెద్ద పెద్ద కట్టడాలు.

అది పట్టణాలలోకెల్లా మొదటిది అయిన కాన్వెంట్ స్కూలు. క్రమశిక్షణకు మారుపేరుగా పేరుతెచ్చుకున్న స్కూలు. చూసేవాళ్ళకు అది పిల్లలకొరకు కట్టిన స్కూలులా కాక పిల్లల జైలుగా కనిపిస్తుంటుంది.

ఆటస్థలమూ, పెద్దగా వున్న ఆడిటోరియమూ పిల్లలు ఆ జైలును కాస్త ఇష్టపడేలా చేస్తాయి తప్ప పూర్తిగా, ఆహ్లాదకరంగా మాత్రం వుంచవు.

ఏమాత్రం జీవకళ లేకుండా యాంత్రి

కంగా తిరిగే యంత్రాల్లా భారంగా, దిగులుగా, కోపంగా, విసుగ్గా, నిరాశగా... వెలువరించడానికి స్వేచ్ఛ కరువైన తమ భావాలను లోలోన అణచుకుంటూ తిరిగే సిస్టర్స్.

వాళ్లను చూస్తోన్న ఆ పిల్లలకు తమ స్వాభావికమైన ఉత్సాహం, చిలిపితనం, అల్లరి, కుతూహలం నశించిపోతుంటుంది.

స్కూలు గేట్లో అడుగుపెట్టానే లక్ష్మి మొహం తెల్లగా పాలిపోయింది ఓ రకమైన భయంతో.

అంతకుపూర్వం ఆమె చాలాసార్లే ఆ స్కూలుకు వచ్చింది. అయినా ఎప్పటికప్పుడు నెర్వస్‌నెస్ ఫీలవుతూనే వుంటుంది.

కారులో వచ్చే స్తోమత వున్న పేరెంట్స్‌కు తప్ప మామూలు మధ్యతరగతి పేరెంట్స్‌కు ఆ స్కూల్లో గౌరవం లభించదు.

ధనవంతులై వుండి, అడిగినప్పుడల్లా భారీగా డొనేషన్స్ సమర్పించగల పేరెంట్స్‌కే అక్కడ గౌరవ పూర్వకమైన స్వాగతం, మర్యాద నిండిన మంచిమాట లభిస్తుంది. అలాంటి పేరెంట్స్‌ను మాత్రమే ప్రిన్సిపల్ తన రూంలో కూర్చో బెట్టి మాట్లాడుతుంది.

మధ్యతరగతి పేరెంట్స్ ఖరీదయిన ఆ స్కూల్లో అడుగుపెట్టేందుకే భయపడుతుంటారు సహజంగా.

తమ పిల్లల చదువుసంధ్యల గురించీ, ఫీజుల గురించీ ఎంక్వైరీకి వెళ్ళినా అక్కడ పలకరించే దిక్కు వుండదు.

విషయం ఏదైనా సరే... నోరు మెదిపితే చాలు. "మీ పిల్లాడికి టి.సి. ఇచ్చేస్తాం. వేరే ఎక్కడయినా చేర్చుకోండి" అనేస్తుంది ప్రిన్సిపాల్.

అనిల్ క్లాస్‌టీచర్ కొరకు వరండాలో కనిపించిన టీచర్‌ను అడిగింది బిడియంగా.

ఆమె ఓసారి ముఖం చిట్లించి, "సారీ! నాకు తెలీదు..." అనేసి వెళ్ళిపోయింది.

అలా మరో ఇద్దర్ని అడిగిన తరువాత అనిల్ క్లాస్ టీచర్ను కలుసుకోగలిగింది. ఆవిడ లీజర్ పీరియడ్‌లో స్టాఫ్‌రూంలో కూర్చుని కాంపోజిషన్ పేపర్లు దిద్దుకుంటోంది సీరియస్‌గా.

"నమస్తే"

మేడం ఒకసారి తల ఎత్తి చూసి, "నమస్తే" అనేసి తిరిగి తన పనిలో మునిగిపోయింది. ఆమె ఎందుకు వచ్చారు? ఎవరు కావాలి అని అడుగుతారేమో తను చెప్పాలి అని చూసింది లక్ష్మి. కానీ ఆమె ఒకే ధ్యానంతో బుక్స్ దిద్దుకొంటోంది.

"మేడం" రెండు నిమిషాల అనంతరం లక్ష్మి మెల్లగా పిలిచింది.

"చెప్పండి" తల ఎత్తకుండా బుక్స్ దిద్దుతూనే అంది మేడం.

"మా అనిల్ ఎలా చదువుతున్నాడు మేడం? " భయపడుతూనే మెల్లగా అంది. మేడం చురుగ్గా తల ఎత్తి చూసింది.

"మీ పిల్లవాడు ఎలా చదువుతున్నాడూ అనే విషయం మీకు తెలియాలి" అంది కరుగ్గా.

కొందరు టీచర్స్‌కు పేరెంట్స్‌పట్ల అంతర్గతంగా వైరభావం వుంటుంది. పేరెంట్స్ పిల్లల చదువు సంధ్యల గురించి ఎంక్వయిరీ చేసినా సిలబస్, ప్రోగ్రెస్, ర్యాంకుల గురించి పట్టించుకున్నా మా పిల్లాడ్ని కొట్టారట అంటూ నిలదీసినట్లు అడిగినా... ఆ వైరభావం క్రోధంగా మారి అప్పటినుండీ ఆ పిల్లలపట్ల ఉదాసీనత వ్యక్తపరుస్తూ కూడా ఆ పిల్లల తప్పొప్పులను ఓ కంట కనిపెడ్తూంటారు.

పిల్లలు చేసే ఎంత చిన్న తప్పయినా వాళ్ళ కంటికి పెనుభూతంలా కనిపించి నానా విధాలుగా పిల్లల్ని అవమానపరచేందుకు ప్రయత్నిస్తుంటారు.





అలాగని ఏదో బళ్లో వేశాం, వాళ్ళే బుద్ధిగా చదువుకుంటారు అనుకునే పేరెంట్స్‌ను కూడా ఉపాధ్యాయులు క్షమించరు. మీ పిల్లాడు ఎలా చదువుతున్నాడు? వాడి బిహేవియర్ ఎలా వుంది? అని తెలుసుకో వలసిన బాధ్యత కన్నవాళ్లకు మీకు లేదా? అంటూ పేరెంట్స్‌ను నిలదీస్తుంటారు.

తరుచూ వెళ్ళి కనుక్కుంటుంటే "అబ్బ... వీళ్ళకేగాక గొప్ప పిల్లాడు వున్నట్లు... పొద్దుగూకులూ స్కూలుకు పరుగెత్తుకు వస్తుంటారు చిరాగ్గా" అని విసుక్కుపోతుం టారు.

"మేడం నేను మా చెల్లి పెళ్లికి వెళ్ళాలి" నెమ్మదిగా అంది లక్ష్మి.

"అయితే..." ఆమె మాట పూర్తి కాకుం డానే అందుకుంది మేడం.

"మా అనిల్‌ను కూడా తీసుకువెళ్ళాలను కుంటున్నాను"

"తీసుకువెళ్లండి. మీరు పెళ్ళికి వెళ్ళడం కూడా మా పర్మిషన్‌తోనే వెడతారా?" విసు గును దాచుకుంటూ అంది మేడం.

"ఎగ్జామ్ ఎప్పుడు కండక్ట్ చేస్తారో తెలు సుకుందామని వచ్చాను"

"యూనిట్ ఎగ్జామ్సా? మేం డేట్స్ ఇస్తాంగా"

"యూనిట్ ఎగ్జామ్ కాదు మేడం హాఫి యర్లీ. సోషల్ పేపరు"

"హాఫియర్లీ సోషల్ పేపరా?" ఆశ్చ ర్యంగా అడిగింది మేడం.

"అవునండీ. హాఫియర్లీలో సోషల్ ఎగ్జామ్ కండక్ట్ చేయలేదటగా?"

"సోషల్ ఎగ్జామ్ కండక్ట్ చేయలేదా?"

భయపడుతూనే ఔనన్నట్లు తల ఊపింది లక్ష్మి.

"ఎవరు చెప్పారు?" ఆమె స్వరంలో కోపం వుంది.

"మా అనిల్"

"నాన్సెన్స్ ఎగ్జామ్ కండక్ట్ చేయకపో వడం ఏమిటి...?"

"సోషల్ ఎగ్జామ్ పోస్ట్‌పోన్ అయ్యిందని చెప్పాడు"

"నాన్‌సెన్స్... ఏ ఎగ్జామూ పోస్ట్‌పోన్ కాలేదు"

"అయితే సోషల్ ఎగ్జామ్ జరిగిందా మేడం?" లక్ష్మి నమ్మలేనట్లు ఆశ్చర్యంగా అడిగింది

"జరిగింది... ఒకవేళ మీ అనిల్ ఆబ్సెంట్ అయ్యాడేమో..."

లక్ష్మి మొహం పాలిపోయింది.

దీన్ని ఎలా అర్థం చేసుకోవాలో కూడా తెలీనంతగా అప్‌సెట్ అయ్యిందావిడ. ఆమె కెందుకో సోషల్ ఎగ్జామ్ కాలేదనే అనిపి స్తోంది. ఈమె సోషల్ టీచర్ కాదుగా ఈమెకు సరిగా తెలీదేమో. కానీ ఆమాట అనేందుకు భయం వేసింది. "పోనీ మేడం నన్నోసారి సోషల్ మేడంను కలుసుకోమం టారా?" అంది నెమ్మదిగా.

"సారీ మేడం...నేను అబద్ధంచెప్తున్నా ననా మీ వుద్దేశం?"

"సారీ మేడం, అలా అని కాదు"

క్లాస్‌టీచర్ వెంటనే సోషల్ టీచర్‌ను కలిసి ఆమెను వెంటపెట్టుకుని వచ్చింది.

"ఈమె మీ అనిల్ క్లాస్, సోషల్ మేడం..."

"ఏమిటి?" అంది సోషల్ మేడం.

"ఈవిడ అనిల్ అనే కుర్రాడు వున్నాడు చూడు.. వాళ్ళ మదర్. సోషల్ ఎగ్జామ్ పోస్ట్‌పోన్ అయ్యిందని చెప్పాడట. అడిగేం దుకు వచ్చారు"

"అదేం లేదండీ. ఎగ్జామ్ కండక్ట్ చేయడం... పేపర్ వాల్యుయేషన్... అన్నీ

యాజ్ యూజువల్‌గా జరిగిపోయాయి..."

★ ★ ★

వింటోన్నకొద్దీ లక్ష్మి మొహం మరీ పేల వంగా తయారవుతోంది.

"మీవాడు ఆబ్సెంట్ కూడా కాలేదే. పేపరు దిద్దినట్లే గుర్తు. ఉండండి" స్టాఫ్‌రూం బీరువాలో వున్న పేపర్ల కట్టలో నుండి ఓ కట్ట వెదికి తీసి అందులోనుండి అనిల్ పేపరు బయటకుతీసి, "ఇదిగోనండీ మీ అబ్బాయి ఆన్సర్ స్క్రిప్ట్..." అని లక్ష్మి చేతికి ఇచ్చింది.

వణికే చేతులతో అందుకుంది లక్ష్మి.

పేపరు నిండా రెడ్ ఇంక్‌తో కొట్టివేతలే. మార్కులు... పదహారు

లక్ష్మికి కళ్లు తిరిగినట్లయి, ఒక్కక్షణం కళ్లు గట్టిగా మూసుకుని తననుతాను నిల దొక్కుకుని, వణికే చేతులతో పేపరు టీచ ర్‌కు అందించి నమస్కారం చేసింది.

ఆవిడ క్లాసుకు వెళ్ళిపోయింది త్వరత్వ రగా.

"మూడు నెలలనుండీ ప్రోగ్రెస్ రిపోర్టులు కూడా ఇయ్యడం లేదని చెపుతున్నాడు"

మెల్లగా అంది లక్ష్మి తనలోతను అనుకు న్నట్లుగా.

"ఏమిటి మీరనేది? మూడు నెలలనుండీ ప్రోగ్రెస్ కార్డ్ పంపడం లేదా? ఏం మాట్లా డుతున్నారు మీరు?" అంటూ మేడం గబ గబా డ్రాయరు తెరచి అందులో కట్టగా వున్న ప్రోగ్రెస్ రిపోర్ట్స్ ఎత్తిచూసి "ఇవిగో ఇవన్నీ అప్ టు డేట్‌గా వున్నాయి. కావా లంటే చూసుకోండి" అంటూ ఆమె ముందుకు విసిరింది.

"సారీ మేడం... అనిల్ అలా చెప్పాడ న్నాను"

"మీ పిల్లాడు ఏదో చెప్తే మీరు వచ్చి మమ్మల్ని నిలదీస్తుంటారన్నమాట"

"సారీ... అండీ. నిలదీయడం కాదు... నిజం తెలుసుకుందామని..."

అప్పటికే ముఖాన నెత్తురు చుక్క లేన ట్లున్న లక్ష్మిని చూస్తూ ఆమె మానసిక పరి స్థితిని అర్థంచేసుకుంది మేడం.

ఆ కార్డ్సునుండి అనిల్ కార్డు వెదికి తీసి ఆమెకు అందించింది.

మౌనంగా అందుకున్న లక్ష్మి కార్డు చూసింది.

హాఫియర్లీ ఎగ్జామ్ మార్క్సుతో సహా అప్‌టు డేట్‌గా వుంది కార్డు. ఫాదర్స్ సిగ్నే చర్ కాలంలో సిగ్నేచర్ కూడా చేసివుంది.

అయితే అది సారథి సంతకం కాదని లక్ష్మి గుర్తించింది కానీ, అన్ని వందల కార్డ్సులో ప్రతి స్టూడెంట్ తండ్రి సంతకమూ జాగ్రత్తగా పరిశీలించి, ఫోర్జరీ సంతకాన్ని గుర్తించడం క్లాస్ టీచర్‌కు అసాధ్యమైన విషయం. ఆ విషయం గుర్తించిన లక్ష్మి మరో ప్రశ్న వేయకుండా వుండిపోయింది.

మార్కులు ఏవీ ముప్పై దాటలేదు.

లక్ష్మి కార్డు తిరిగి ఇచ్చివేసింది.

"మేడం... మరో మాట..."

"అడగండి"

"నేను మిమ్మల్ని క్వశ్చన్ చేస్తున్నాననుకో కండి. కేవలం నిజం తెల్సుకుందామని... అంతే..." హీనస్వరంతో అంది లక్ష్మి.

"ఫరవాలేదు. అడగండి" అప్పటికి శాంతించింది మేడమ్.

"అనిల్ ఏ సబ్జెక్ట్‌లోనూ రెండు మూడు పాఠాలకన్నా ఎక్కువ కాలేదని చెప్తు న్నాడు..."

"అదేం లేదండీ. ప్రతి సబ్జెక్ట్‌లోనూ సిల బస్ కంప్లీట్ అయ్యింది.

ఏమాత్రం సిలబస్ వెనకబడినా మా ప్రిన్సిపాల్ ఊరుకోరు. మీవాడు మీకు చాలా అబద్ధాలు చెప్తున్నాడు. ఉండండి,





పిలిపించి మీముందే అడుగుతాను. ఎందుకిలా అబద్ధాలు చెప్తున్నాడో..." అంటూ మేడం అటెండర్‌ను కేకవేసి, "అనిల్‌ను పిలుచుకురా" అని పంపించింది.

ఐదు నిమిషాల్లో అటెండరు తిరిగి వచ్చి "అనిల్ అనే కుర్రాడు ఆబ్సెంటమ్మా" అని చెప్పాడు.

లక్ష్మి కాళ్ళకింద నేల కదిలినట్లయి ఆసరాకొరకు టేబిల్ గట్టిగా పట్టుకుంది. ఫెయింట్ అయ్యేలా కనిపిస్తోన్న ఆమెను సానుభూతిగా చూసి, "అన్నట్లు మీకో విషయం చెప్పడం మరిచాను. ఈమధ్య మీ అనిల్ తరచూ ఆబ్సెంట్ అవుతున్నాడు... అదేం అని అడిగితే 'ఇల్ హెల్త్' అని చెప్తున్నాడు"

లక్ష్మి పేలవమైన ముఖంతో వింటూండిపోయింది. మార్కులు తక్కువ వచ్చినందుకు కాదు ఆమె బాధ. అనిల్... ఎందుకిలా ఎందుకు ఇన్ని అబద్ధాలు చెప్తున్నాడు? తన పెంపకంలో... అనిల్... ప్చ్... తన పెంపకం గురించి ఎంత గర్వపడ్డది...? అనిల్ వినయవిధేయతలు... అణకువ... తెలివితేటలు చూసి ఎంత పొంగిపోయింది.

"మీరు వర్రీకాకండి. అసలు ఎందుకిలా చేస్తున్నాడో నెమ్మదిగా తెలుసుకోండి" లక్ష్మి భావరహితంగా ఆమెవంక చూసింది.

"మరోమాట..."

లక్ష్మి మౌనంగా, శూన్యంగా ఆమెవంక చూసింది.

"మీ అనిల్ విషయం ప్రిన్సిపల్ నోటీస్‌లోకి వెళ్తే ఆమె ఏ మాత్రం సహించరు... క్షమించరు... వెంటనే టి.సి. ఇచ్చి పంపేస్తారు. ఎందుకంటే ఇలా అబద్ధాలు చెప్పే పిల్లలవల్ల స్కూలు గౌరవం పోతుంది" మేడం తాను చెప్పవలసింది చెప్పి తిరిగి కాంపోజిషన్ నోట్సులు దిద్దుకోవడం ప్రారంభించింది.

లక్ష్మి మర్యాదపూర్వకంగా నమస్కరించి బయటికి వచ్చింది. ఆమె మనస్సంతా శూన్యంగా భావరహితంగా వుంది. హృదయం లోలోపలి భాగాలను ఛిద్రం చేస్తున్నప్పటి వేదన... రక్తం కారని గాయం.

ఈ సంఘటన లక్ష్మి హృదయంలో అనిల్‌పైన, తన పెంపకంపైన చివరికి తనపై తనకే గల నమ్మకాలపై అనుకోని దెబ్బకొట్టింది.

ఈ అరగంటలోనే పది సంవత్సరాలు వయస్సు పైబడినట్లు కుంగిపోయిందామె.

★ ★ ★

ఆ సాయంత్రం ఎన్నడూ లేనిది ఎంతో కోపంగా ఇంట్లో అడుగుపెట్టాడు సారధి.

వస్తూనే అనిల్ కొరకు చూశాడు. ఎక్కడా కనిపించక, "అనిల్ రాలేదూ?" అన్నాడు భార్యతో.

లేదు.... అన్నట్లుగా తల అడ్డంగా తిప్పింది లక్ష్మి.

పెదవి కదిపితే హృదయం బద్దలవుతుందేమో... అనే భయంతో ఆమె పెదవి విప్పలేదు.

పేలవంగా, దయనీయంగా వున్న భార్య ముఖం సారధి గమనించి వుండి వుంటే ఏదో జరిగిందనే విషయాన్ని గుర్తించి వుండేవాడు. కానీ, అతడు భార్యను పట్టించుకోకుండా ముందుగదిలోకి వచ్చి కూర్చున్నాడు. ఆ క్షణంలోగానీ లక్ష్మి భర్తముఖం చూసి వుంటే అతని హృదయం ఎంత కోపంతో, ఆవేదనతో రగిలిపోతోందో గ్రహించగలిగి వుండేది. ఒకరిముందు ఒకరు బయటపడటం ఇష్టంలేనట్లు ఎవరికి వారు తప్పుకు తిరుగుతున్నట్లు చెరోగదిలో పనులు కల్పించుకుని వుండిపోయారు.

ఇద్దరి ఆలోచనా ఒకటే... ఇద్దరి ఆలోచనల్లోనూ... ఒక్కరే... ఆ ఒక్కరూ తమ గుండెకు గుండె అయిన అనిల్.

అనిల్ ఇలా చేశాడంటే కళ్ళతో చూస్తేగానీ నమ్మలేని హృదయంతో పెనుగులాడుతున్నారు.

అమాయకంగా ఒద్దికగా వుండే అనిల్ ముఖం కళ్ళముందు కనిపించి ఇదంతా అబద్ధం అనిపిస్తోంది.

కానీ విన్న చెవులూ, చూసిన కళ్ళూ నిష్ఠురమైన నిజాన్ని బయటపెడ్తున్నాయి.

సారధి అసహనంగా అనిల్ రాకకోసం ఎదురుచూస్తున్నాడు.

ఆరోజు-

సారధి కొలీగ్ ఒకరు ప్లాట్ ఖరీదుచేస్తూ, దానిని చూసేందుకు సారధిని రమ్మని కోరాడు.

ఇద్దరూ కలిసి ఊరిచివర్న కాలువగట్టు అవతల వున్న ప్లాట్స్ చూసేందుకు వెళ్ళారు.

కాలువలో కొందరు పిల్లలు పందేలు పెట్టుకుని ఈదుతున్నారు. అంతకుముందు పదిహేను రోజులక్రితమే ఈతకు వెళ్ళి మునిగిపోయిన ఇద్దరు పిల్లలగురించి విన్న సారధి, ఈ పిల్లలకు కొంచెం కూడా భయం వుండదు ఎందుకనో... అనుకుంటూ వాళ్ళ వంక చూశాడు అంతే... అతని ఆశ్చర్యానికి అంతులేదు.

ఆ పిల్లల్లో ఒకడు 'అనిల్'

సారధి ఎంతగా ఆశ్చర్యపోయాడంటే... అతను కళ్ళు నులుపుకుని మరీ ఆ కుర్రాడి వంక చూశాడు.

అనుమానం ఏమీలేదు. వాడు అనిలే.

కానీ, అనిల్ తండ్రిని గమనించలేదు. మహోత్సాహంతో స్నేహితులతో గప్పాలు కొడుతున్నాడు. అప్పటివరకూ కాలువలో ఈదినట్లుగా జుట్టూ, ఒళ్ళూ తడిగా వున్నాయి.

అనిల్‌ను గుర్తించిన మొదటిక్షణం సారధికి పదిరోజులక్రితం కాలువలో ఈతలు కొడుతూ మునిగిపోయిన ఇద్దరు పిల్లలూ గుర్తుకొచ్చారు.

మైగాడ్... ఎంత ప్రమాదం. అనిల్‌కు ఏమైనా అయితే... అని భయపడ్డాడు. మరుక్షణంలో-

అనిల్ స్కూలు ఎగ్గొట్టి కాలువలో ఈతలు కొడుతున్నాడు అనే నిజం అతనిలో కోపాన్ని రగిలించింది.

అనిల్ స్కూలుకు డుమ్మాకొట్టి కాలువల వెంట, వీధులవెంట తిరుగుతున్నాడు అనే నిజాన్ని అతడు జీర్ణించుకోలేకపోతున్నాడు.

భార్యాభర్తలు ఇలా ఎవరి ఆలోచనల్లో వాళ్ళుండగా అనిల్ బరువైన పుస్తకాల సంచీ మోసుకుంటూ అలసటగా ఇంట్లో కాలు పెట్టాడు.

మరోసారయితే అలసిపోయి వాడినట్లు కనిపిస్తూన్న కొడుకును చూసి మనస్సులో బోలెడు జాలిపడి వీలయినంతగా వుపచారాలు చేసేవాళ్ళు. ఉదయం ఏడుగంటలకు ఇంట్లోంచి వెళ్ళిన కొడుకు అలసిసొలసి ఐదున్నరా, ఆరుగంటలమధ్య ఇల్లు చేరడం వల్ల వాడికి తగినంత విశ్రాంతి లేకపోతోందని జాలితో కరిగిపోయేవారు.

స్నానం, భోజనం కాగానే మళ్ళీ పుస్తకాల ముందు కూర్చునే కొడుకు చదువుమీది శ్రద్ధకు ఆనందం కలిగినా ఏమాత్రం విశ్రాంతిలేని వాడి కార్యక్రమం చూసి ఉసూరుమనిపించేది.

కానీ, ఇప్పుడు మాత్రం సారధికి వాడ్ని చూస్తుంటే హృదయం 'లావా'లా మరిగింది.

లక్ష్మి కళ్ళు విప్పార్చుకుని స్కూలునుండి వచ్చిన అనిల్‌ను చూస్తోంది. వీడేనా...





తన కిన్ని అబద్ధాలు చెప్పాడు. తనను ఎంత అందంగా మోసం చేశాడు. తన నమ్మకాలపై ఎంత తీవ్రమైన దెబ్బ కొట్టగలిగాడు. అన్నట్లు ఆశ్చర్యంగా చూస్తోంది.

అనిల్ బుక్స్ బీరువాలో సర్దేసి సాక్సు - బూట్లూ విప్పుకుంటున్నాడు.

"అనిల్! ఎక్కడ్నించి వస్తున్నావు? " తెచ్చిపెట్టుకున్న శాంతంతో అడిగాడు సారధి.

"స్కూల్ నుండి డాడీ..." అనిల్ నెమ్మదిగా నమ్మకంగా చెప్పాడు.

"ఇవాళ స్కూలు లేదన్నారే ఎవరో..."

అనిల్ నవ్వి, "భలే... ఎవరన్నారు డాడీ... ఇవాళ స్కూలు లేదని. ఇవ్వాళ మా మేడం క్లాసులో క్విజ్ కూడా ఏర్పాటు చేశారు. అందుకే లేటయ్యింది" స్నానానికి వెళ్ళడానికి రెడీ అవుతూ చెప్పాడు.

తల్లిదండ్రులు కళ్ళు విప్పార్చుకుని చూస్తున్నారు, వింటున్నారు. తమకు గర్వకారణమైన తమ ముద్దుల కొడుకును కళ్ళారా చూస్తున్నారు. తమ పెంపకంలోని ఔన్నత్యాన్ని గూర్చి లోలోనే మురిసిపోయే దంపతులు ఫలితాన్ని ఎలా స్వీకరించాలో తెలీనట్లు అయోమయంగా చూస్తున్నారు.

సారధి మనస్సు ఉడికిపోతోంది. ఇక నిగ్రహించుకోలేనట్లు ఒక్క ఉదుటన వెళ్ళి అనిల్ జుట్టు పట్టుకుని ఆ చెంపా ఈ చెంపా వాయించి "నిజం చెప్పు. ఇవ్వాళ స్కూలుకు వెళ్ళావా? " అంటూ గద్దించి అడిగాడు.

అనిల్ తండ్రికోపం చూసి బిత్తరపోయాడు.

చెంపమీద పడ్డ దెబ్బతో వాడికి చుక్కలు కనిపించాయి.

వాడికి ఊహ తెలిశాక తండ్రి అంతకోపంగా వుండటమూ, తనమీద చెయ్యిచేసుకోడమూ అదే మొదటిసారి.

ఏడుస్తూ వుండిపోయాడు.

"చెప్పు... ఎక్కడికి వెళ్ళావ్? "

"స్కూలుకు వెళ్ళాను డాడీ..."

"స్కూలునుండి ఇంకెక్కడికి వెళ్ళావ్? "

"ఎక్కడికీ వెళ్ళలేదు డాడీ..."

"స్కూలునుండి ఇంటికే వస్తున్నావా? "

"అవును, డాడీ! స్కూలునుండి ఇంటికే వస్తున్నాను"

తొణక్కుండా, ఏడుస్తూనే సమాధానాలు చెప్తున్న వాడి ముఖంలోని అమాయకత్వం చెక్కుచెదరలేదు.

సారధి కోపాన్ని నిగ్రహించుకోలేకపోతున్నాడు. బెల్ట్ చేతిలోకి తీసుకుని, "చెప్పు... ఎక్కడినుండి వస్తున్నావు... నిజం చెప్పు" అన్నాడు కోపంగా.

"స్కూలునుండి వస్తున్నాను డాడీ" వెక్కుతూ చెప్పాడు అనిల్.

"నిజం చెప్పు... నిజం చెప్తే నిన్ను ఏమీ అనను"

"నిజమే డాడీ... స్కూలునుండే వస్తున్నాను"

"అబద్ధం చెప్తే చంపేస్తాను. నిజంచెప్పు" అంటూ బెల్ట్‌తో ఒక్కటి వేశాడు సారధి మితిమీరుతోన్న ఆగ్రహంతో.

కెవ్వుమన్న అనిల్ కేకతో లక్ష్మి మమకారం కన్నీరై కురిసింది. అయినా ముఖం ప్రక్కకు తిప్పుకుంది.

"చెప్పు... నిజం చెప్పు... ఎక్కడికెళ్ళావ్...? " సారధి మళ్ళీమళ్ళీ ప్రశ్నిస్తున్నాడు. అనిల్ ఏడుస్తున్నాడే తప్ప మాట్లాడ్డంలేదు.

"అనిల్ నిజం చెప్పు. నిజం చెప్తే డాడీ నిన్ను ఏమీ అనరు" గుడ్లనీరు కుక్కుకుంటూ కొడుకుతో అంది లక్ష్మి.

"నిజం మమ్మీ! నేను స్కూలుకే వెళ్ళాను. అక్కడ్నించే వస్తున్నాను"

నిస్సహాయంగా చూసింది లక్ష్మి.

"నిజం చెప్పు. నాకు నిజంకావాలి. నిన్ను ఏమీ అనను... నిజం చెప్పు" సారధి అడుగుతున్నాడు.

"ని...జ...మే... డా...డీ... స్కూలుకే వె...ళ్ళా..ను..."

అనిల్ వంటిమీద వెంటవెంటనే మరో రెండు దెబ్బలు పడ్డాయి. జానెడులేని పిల్లాడితో నిజం చెప్పించలేక పోతున్నానే అనే ఉక్రోషంతో రెట్టించిన కోపంతో ఊగిపోతున్నాడు సారధి.

ఒకటి తరువాత ఒకటిగా అనిల్ వంటిపై బెల్ట్ దెబ్బలు పడుతున్నాయి. నేను స్కూలుకే వెళ్ళాను డాడీ... అన్న మాట తప్ప మరో మాట ఊడిపడ్డంలేదు అనిల్ నోటివెంట.

ఎప్పుడూ దెబ్బ అనేది ఎరగని వాడి ఒళ్ళు కంది ఎర్రబడి వాతలు తేలింది.

"అమ్మా... అ...మ్మా..." అంటూ ఏడుస్తున్నాడు అనిల్.

ఆ ఏడుపు లక్ష్మి గుండెను కోస్తోంటే, అనిల్‌తోపాటుగా మౌనంగా రోదిస్తోంది లక్ష్మి.

భర్త అనిల్‌ను కొట్టే ప్రతి దెబ్బా తనవంటిమీదే పడ్డట్లుగా విలవిలలాడిపోతోంది. భర్తకు ఇంతకోపం రావడం ఆమె ఎప్పుడూ చూచి ఎరగదు.

అప్పుడే ఇంటికి వచ్చిన శంతన్ గదిలోని దృశ్యాన్ని చూసి స్థంభించిపోయాడు కొన్ని క్షణాలపాటు.

అన్నను ఎన్నడూ అలా చూడని శంతన్ సారధి రౌద్రాకారాన్ని చూసి బిగుసుకుపోయినట్లయ్యాడు.

కానీ, వెంటనే కర్తవ్యం గుర్తుకు వచ్చిన ట్లయి తండ్రీ కొడుకుల మధ్యకు దూసుకు వెళ్ళి, "ఏంజరిగింది? " అంటూ అడిగాడు అన్నను గట్టిగా పట్టుకుని.

"నువ్వు... నువ్వు అడ్డులేవరా... వాడ్ని వాడ్నివేళ చంపేస్తాను" ఒగురుస్తూ అన్నాడు సారధి.

లక్ష్మి ఉలిక్కిపడింది. భర్త కోపానికి నిజంగానే భయపడిపోయింది. అంతే... హఠాత్తుగా ఇద్దరిమధ్యకూ దూసుకువచ్చింది. సారధి చేతిలోని బెల్ట్ ఆమెను తాకింది.. "అమ్మా" అంది లక్ష్మి బాధగా. "నువ్వు అడ్డంలే..." అరిచాడు సారధి.

"వద్దు... వద్దు... వాడ్ని ఇవ్వాళ మీరు చంపేస్తారు" ఏడుస్తూ కొడుకును చుట్టుకుపోయింది లక్ష్మి.

ఇక తాను ఎన్ని దెబ్బలు కొట్టీ వాడిచేత నిజం చెప్పించలేనని గ్రహించిన సారధి విసురుగా చేతిలోని బెల్ట్ నేలమీదికి విసిరేసి, "ఛీ...ఛీ... ఈ వయస్సుకే ఇన్ని అబద్ధాలా? వాడిచేత ఒక్కమాట, ఒక్క మాట నిజం చెప్పించలేకపోయాను" బాధగా తన లోతనే గొణుక్కుంటూ అక్కడే వున్న కుర్చీలో కూలబడి ముఖానికి పేపరు అడ్డుగా పెట్టుకున్నాడు. అతనికి తన కంటి తడి కుటుంబసభ్యులు చూడ్డం ఇష్టంలేదు.

లక్ష్మి అనిల్‌ను మెల్లగా నడిపించుకు వెళ్ళి వంటగదిలో చాపపరచి పడుకోబెట్టింది.

వెక్కిళ్ళు పెడ్తోన్న అనిల్‌ను దగ్గరగా తీసుకుని వాతలు పడ్డ వాడి శరీరానికి కొబ్బరినూనె రాస్తూ మౌనంగా రోదిస్తోంది.

సారధి కళ్ళు పేపరులోని అక్షరాలవంక చూస్తోన్నా ఒక్క అక్షరం కూడా మెదడులోకి ఎక్కడంలేదు.

అనిల్ స్కూలు ఎగ్గొట్టి కాలువల వెంట తిరుగుతున్నందుకు బాధపడాలో, వాడిచేత నిజం చెప్పించలేనందుకు బాధపడాలో, కొడుకుని ఎన్నడూ లేనిది అంతగా శిక్షించినందుకు బాధపడాలో అర్థంకానట్లు అతని ఆలోచనలు సుళ్ళు తిరుగుతున్నాయి.




పిల్లలు... పిల్లలన్న తరువాత తప్పులు చేయకుండా వుంటారా? అసలు తప్పులూ, అల్లరీ పిల్లలు చేయకపోతే పెద్దవాళ్ళు చేస్తారా? ఆ మాటకు వస్తే చిన్నతనంలో ఇంట్లో చెప్పకుండా తనెన్నిసార్లు సినిమాకు వెళ్ళలేదు.

అనిల్ ఫ్రెండ్స్‌తో కలిసి ఈతకు వెళ్ళి వుంటాడు. ఇంత చిన్న తప్పుకే ఇంత కఠినమైన శిక్షా? బెల్ట్‌తో ఎన్ని దెబ్బలు కొట్టాడు. తనెందుకింత మూర్ఖంగా క్రూరంగా ప్రవర్తించాడు? వాడు 'అమ్మా' అంటూ ఏడుస్తోంటే కనీసం తనకు జాలైనా కలగలేదేం...? ఏడుస్తోన్న కొడుకు ముఖం కళ్ళముందు కనిపించి జాలితో కరిగిపోయాడు సారధి.
అనిల్ నిజం చెప్పివుంటే గద్దించికానీ, ఓ చిన్న దెబ్బ వేసికానీ ఒదిలేసి వుండేవాడు.

ఇలా బడి ఎగ్గొట్టి ఈతలకు వెళ్ళొద్దనీ, అంతేకాకుండా కాలువలో ఈదడం ఎంత ప్రమాదకరమో, ఇంతకు వారం క్రితం ఇద్దరు కుర్రాళ్ళు నీళ్ళల్లో మునిగి దారుణంగా ఎలా చనిపోయారో చెప్పి మందలించి వదిలేసి వుండేవాడు.

అనిల్ నిజం చెప్పకపోవడంచేతనే అంతగా శిక్షించాడు. అంతగా శిక్షించి కూడా అనిల్‌తో నిజం చెప్పించలేకపోయాడు.

ఆ రాత్రి-

భార్యాభర్తలిద్దరూ ఎవరికివారు మౌనంగా ఆలోచిస్తూ పడుకున్నారు. దెబ్బలు తిన్న అనిల్ భోజనం చేయకుండానే నిద్రపోవడంతో వాళ్ళకూ భోజనం చేయాలనిపించక మంచంమీద ఒరిగిపోయారు.

ఎవరి ఆలోచనల్లో వాళ్ళున్నా ఇద్దరూ ఆలోచించేది అనిల్ గురించే. అనిల్ ఎందుకు ఇలా తయారవుతున్నాడు? ఇది తమ పెంపకంలోని లోపమా? అని లక్ష్మి ఆలోచిస్తోంటే, అనిల్‌ను అనవసరంగా కొట్టేనేమో... అని సారధి బాధపడుతున్నాడు.

లక్ష్మి మౌనం సారధికి తన తప్పు పదింతలు చేసి చూపినట్లయింది.

"లక్ష్మీ! నేను తప్పు చేశానా? " మెల్లగా అన్నాడు సారధి. లక్ష్మి తల ఎత్తి అతని వంక చూసింది. ఆ చూపు శూన్యంగా, భావరహితంగా, నిర్లిప్తంగా వుండి సారధి గుండెను కోసింది.

"వాడు స్కూలు ఎగ్గొట్టి కాలవలో ఈదుతూండటం కళ్ళారా చూశానేమో... అబద్ధం చెప్తోంటే కోపం ఆపుకోలేకపోయాను" సంజాయిషీ చెప్పుకుంటున్నట్లుగా అన్నాడు సారధి.

"మీ అనిల్ తరుచూ స్కూలుకు ఆబ్సెంట్ అవుతున్నాడు." మేడం మాటలు లక్ష్మి చెవిలో మారుమ్రోగాయి.

లక్ష్మి మౌనం చూసి సారధి మరింతగా బాధపడ్డాడు.

"మాట్లాడు లక్ష్మీ. నేను తప్పుచేశాను కదూ? " జాలిగా అడిగాడు.

లక్ష్మి ఈ లోకంలోకి వచ్చినట్లు తృళ్ళిపడింది.

"లేదు... లేదు... మీరు అనవసరంగా బాధపడకండి. తప్పుచేసిన పిల్లాడ్ని శిక్షించడం అవసరమే"

"పిల్లాడు కదా! ఏదో స్నేహితుల బలవంతంతో ఈతకు వెళ్ళివుంటాడు. అంత చిన్న తప్పుకు ఇంతగా శిక్షించడం... ప్చ్... అంత ఎక్కువగా కొట్టకుండా వుండాల్సింది"

కొడుకును శిక్షించినందుకు సారధి పశ్చాత్తాపపడుతున్నాడు.

"మీరు అనవసరంగా బాధపడకండి. ఈ మాత్రం శిక్ష వాడికి అవసరమే"

తను ఉదయం అనిల్ స్కూలుకు వెళ్ళిన విషయం, అక్కడ అనిల్ లేకపోవడం,

మేడంస్ అనిల్ గురించి చెప్పిన వివరాలు, అనిల్ కొన్ని నెలలుగా తనను అబద్ధాలతో మోసగిస్తోన్న విధం, అనిల్‌కు వచ్చిన మార్కులు... వివరంగా చెప్పింది లక్ష్మి. సారధి ప్రమాన్పడిపోయినట్లు వింటూండిపోయాడు. దంపతులిద్దరికీ అనిల్ ప్రవర్తన ఆశ్చర్యంగా వుంది. వాడు ఇన్ని అబద్ధాలు ఇంత అందంగా, ఇంత ధైర్యంగా చెప్పగలడనే విషయాన్ని వాళ్ళు జీర్ణించుకోలేకపోతున్నారు.

అనిల్ తమ నమ్మకానికి దారుణంగా దెబ్బకొట్టినట్లుగా భావించుకుని తల్లడిల్లిపోతున్నారు.

తమ బిడ్డ అనిల్... తమ పెంపకంలో పెరిగిన అనిల్... ఎంతో క్రమశిక్షణగా మసలుకునే అనిల్.

ఎంతో అమాయకంగా, అణకువగా కనిపించే అనిల్... ఎందుకు ఇలా తయారయ్యాడు...?

ఎందుకిలా జరుగుతోంది...? ఇది తమ పెంపకంలోని లోపమా? తాము వాడికి ఏంతక్కువ చేశారు? తలకు మించిన భారమైనా కేవలం వాడి భవిష్యత్‌కోసమే మంచి స్కూల్లో చేర్పించారు. వాడికోసం... కేవలం వాడికోసమే... తాము ఎన్ని కోరికలు చంపుకుంటున్నారు... అది ఎంత చిన్న కోర్కెకైనాసరే... వాడికి కష్టంగా తోస్తుంది అనిపిస్తే నిర్దాక్షిణ్యంగా చంపుకున్నారే. ఎంతోమంది పిల్లలకన్నా తమ బిడ్డ ఎంతో బుద్ధిమంతుడనీ, తెలివైనవాడనీ పొంగిపోయారు.

తాము ఎంతో క్రమశిక్షణగా పెంచుతున్నామని తల్లిదండ్రులుగా గర్వపడ్డారు. ఎంతోమంది తల్లిదండ్రులకంటే తాము తమ బిడ్డను ఎంతో గొప్పగా ఆదర్శంగా పెంచుతున్నామని పెంచుకున్న గర్వానికి గర్వభంగం జరిగింది. అనిల్ ఇంకా మిడిల్‌స్కూల్ దాటలేదు. ఈపాటి చదువుకే, ఈ కొద్దివయస్సుకే అంతా ఆరితేరిపోయినట్లుగా తమ పెంపకాన్ని గురించి గర్వపడ్డం ఏమిటి?

"వాడెందుకిలా చేస్తున్నాడూ..." తనను తాను ప్రశ్నించుకుంటున్నట్లుగా అన్నాడు సారధి.

"అదే అర్థంకాకుండా వుంది. అసలు వాడు ఇలా చేస్తోన్నట్లు మనకు ఈరోజేగా తెలిసింది. వాడిలా చేస్తున్నాడంటే అసలు నేను నమ్మలేకపోతున్నానండీ..." లక్ష్మి గుండెలోని ఆవేదన కరిగి కన్నీరుగా మారింది.

ఏంచెప్పి, ఎలా చెప్పి లక్ష్మిని ఓదార్చాలో అంతకంటే ముందు తాను ఎలా ఓదార్పు పొందాలో అర్థంకాలేదు సారధికి.

మరునాటి ఉదయం-

అనిల్ లేవలేక లేవలేక నిద్రలేచాడు. రాత్రి భోజనం చెయ్యని కారణంగా నీరసంతో తూలిపోతున్నాడు.

వాడిపోయిన మొక్కలా నీరసపడి, కందిపోయిన ముఖంతో జ్వరపడినవాడిలా వున్న కొడుకును చూసి జాలితో కరిగిపోయింది లక్ష్మి. దగ్గరవుండి ముఖం కడిగించి, వేడినీళ్ళతో స్నానం చేయించి, భోజనం వడ్డించింది.

ఆవురావురన్నట్లుగా తింటోన్న కొడుకును జాలిగా చూస్తూ కూర్చుంది.

"స్కూలుకు వెడతావా?" లక్ష్మి అడిగింది.

వెళ్తానన్నట్లుగా తల ఊపాడు అనిల్.

కొట్టింది తండ్రి అయినా అనిల్‌కు తల్లితోకూడా మాట్లాడాలనిలేదు.

వాళ్ళిద్దరూ ఒకటే... అనే భావం వుంది వాడిలో.

"పోనీ నీల్! ఈ రోజుకు స్కూలు మానేయకూడదూ?" జాలిగా అంది లక్ష్మి.




"ఊహు... వెడతాను"

"నాన్నా! దెబ్బలు బాగా నొప్పిగా వున్నాయా? " మెల్లగా అడిగింది.

"అబ్బే... లేదు. చాలా హాయిగా వున్నాయి. మిమ్మల్ని ఇలా తంతే అప్పుడు మీకు తెలిసేది..." కసిగా అనుకున్నాడు అనిల్. కానీ పైకిమాత్రం "లేవు" అన్నట్లు తల అడ్డంగా తిప్పాడు.

"నాన్నా! అనిల్. నువ్వెందుకిలా చేస్తు న్నావు? "

అనిల్ అన్నం కలుపుతూ మౌనంగా వుండిపోయాడు.

"నీకు చదువు కోవాలని లేదా? "

వుంది... అన్నట్లు తల ఊపాడు.

"అలా తల తిప్పడం కాదు స్పష్టంగా చెప్పు"

"వుంది"

"మరి ఇలా స్కూలు ఎగ్గొట్టడం ఎందుకు? "

అనిల్ మౌనంగా వుండిపోయాడు.

"అనిల్ ఎందుకని అబద్ధాలు చెప్తు న్నావు? ఇదివరకెప్పుడైనా ఇలా చేశావా? అనిల్ చాలా మంచిపిల్లాడు... అనుకుంటు న్నారు మామయ్యా వాళ్ళంతా. నువ్విలా చేస్తున్నావని తెలిస్తే నీ గురించి అందరూ చెడ్డపిల్లాడని అనుకోరూ? అసలు నువ్వు అబద్ధం ఆడతావని నేనెప్పుడూ అనుకో లేదు. తెలుసా? నిన్న నువ్వు నిజం చెప్పి వుంటే నాన్న కొట్టేవారే కాదు." భోజనం వడ్డిస్తున్న లక్ష్మి చెప్తూనే వుంది. అనిల్ మౌనంగా శ్రద్ధగా వింటూనే వున్నాడు.

చివరిగా బాగా చదువుకుంటే ఎంత మంచి భవిష్యత్ వుందో... తామంతా ఎంతగా సంతోషిస్తారో... వివరంగా చెప్పింది.

అబ్బబ్బ... ఈమెగారు ఈ సుత్తి ఆపేలా లేదు. మనస్సులోనే విసుక్కున్నాడు అనిల్.

తలవంచుకుని శ్రద్ధగా వింటోన్న కొడు కును చూస్తూ తన శ్రమ ఫలిస్తోందను కుంది లక్ష్మి.

"నాన్నా అనిల్! ఇంకెప్పుడూ అబద్ధం చెప్పవుగా...? " ఆశగా అడిగింది.

తల్లి ఇహనైనా ఈ సుత్తి ఆపుతుందనే వుద్దేశ్యంతో, "అలాగే మమ్మీ..." అన్నాడు అనిల్ చాలా సిన్సియర్‌గా.

"నిన్న ఎక్కడికి వెళ్లావు...? "

"స్కూలుకి వెళ్ళాను మమ్మీ..."

వాడి ముఖంలో కనిపించే నమ్రత, అమా యకత్వం, సిన్సియారిటీ చూస్తూ హతాశురా లయ్యింది లక్ష్మి.

ఏమాత్రం తొణుకూ, బెణుకూ, కంగారు లేకుండా నిశ్చలంగా నిర్భయంగా అబద్ధం చెప్తోన్న కొడుకును చూస్తూ ఇక జన్మలో వాడెప్పుడైనా నిజం చెప్తాడా? అనుకుంది లక్ష్మి భయంగా.

"నిన్న నేను మీ స్కూలుకు వెళ్ళాను" అంది నెమ్మదిగా, వాడి ముఖం వంక పరి శీలనగా చూస్తూ.

"ఎప్పుడు మమ్మీ! నాకు కనిపించ లేదే...? "

అనిల్ ముఖంలో అదే అమాయ కత్వం... అదే నమ్రత...

"నిన్న నువ్వు స్కూలుకు రాలేదని మీ మేడం చెప్పారు"

లక్ష్మి తనకు కోపం రాకుండా చాలా జాగ్రత్తగా మనస్సును అదుపులో పెట్టుకుం టోంది.

"ఓ... మా మేడం అన్నీ అబద్ధాలే చెప్తుంది మమ్మీ... అందుకే ఆవిడంటే మా క్లాసులో అందరికీ మంట..."

లక్ష్మి విస్తుపోతోన్నట్లుగా కొడుకు ముఖం చూస్తోంది.

తను గమనించలేదుగానీ అనిల్ భాషలో కూడా చాలా మార్పు వచ్చింది... క్లాస్ టీచర్ అంటే మంట అట ఇంత వల్గర్‌గా మాట్లాడ్డం ఎప్పుడు నేర్చుకున్నాడు...?

లక్ష్మి తన ఆశ్చర్యాన్నీ కోపాన్నీ కూడా అదుపులో పెట్టుకుంటూ అడిగింది.

"నిన్న మీ డాడీకి కాలువ దగ్గర కనిపించావటగా?"

"నేనా? కాలువ దగ్గరా? భలే.. డాడీ ఎవర్నో చూసి నేను అనుకుని వుంటారు. అందుకే అనవసరంగా నన్ను కొట్టారు..." అనిల్ ప్లేట్లో చెయ్యి కడుక్కుని, ప్లేట్ సింక్‌లో వేస్తూ చెప్పాడు.

కొడుకుని మాట్లాడిస్తే ఇంకా ఎన్ని అబద్ధాలు వినాల్సివస్తుందో అని భయపడిన లక్ష్మి మౌనంగా వుండిపోయింది.

కానీ, ఆమె తన పన్నెండేళ్ళ కొడుకు వంక విస్తుపోతూచూస్తూనే వుంది. ఇంత కాలం తానెంతో మురిసిపోయిన, గర్వించిన, తన పెంపకంలో తయారయిన తన ముద్దు బిడ్డను విస్మయంగా చూస్తోంది. తొణుకూ, బెణుకూ లేకుండా అబద్ధాలమీద అబద్ధాలు పేర్చిచెప్తూ కూడా ముఖంలో అమాయకత్వాన్ని చెదరనీయకుండా నిలుపుకొన్న వాడి ఆర్ట్‌ను చూసి విస్తుపోతోంది.

తన పన్నెండేళ్ళ కొడుకు పన్నెండేళ్ళ వాడుగా కాక నలభై ఏళ్ళ అనుభవజ్ఞుడిలా తన విశ్వరూపం ప్రదర్శిస్తోంటే వింతగా చూస్తోంది. అసలు వీడెప్పుడు ఇంతలా ఎదిగిపోయాడు అని అబ్బురపడిపోతూ తననుతాను ప్రశ్నించుకొంటోంది.

అన్నింటినీమించి వీడి భవిష్యత్ ఏమిటీ? అని ఆమె హృదయం ఆక్రోశిస్తోంది.



లక్ష్మి చెల్లెలి పెళ్ళి మూడు రోజులుండగా, అనిల్‌ను తీసుకుని పుట్టింటికి వెళ్ళింది.

అప్పటికే దగ్గరి బంధువులంతా వచ్చేశారు.

ఎంతోకాలం తరువాత పుట్టింటికి వచ్చిన లక్ష్మికి ఆత్మీయులందరినుండీ ఆదరపూర్వకమైన స్వాగతం లభించింది.

శుభకార్యం కావడంచేత బంధువులను చూసిన సంతోషంతో, అనురాగపూరితమైన పలకరింపులతో ఉక్కిరి బిక్కిరి అయిపోతోంది లక్ష్మి. "తెల్లవారితే చెల్లిని పెళ్ళికూతుర్ని చేస్తారు... ఇప్పుడా రావడం..." అంటూ తలోమాటగా ప్రేమగా నిష్ఠూరపడ్డారు.

అందరికీ అన్నివిధాలుగా చెప్పి సమాధానపరిచింది లక్ష్మి.

అనిల్ చదువు గురించే లక్ష్మి రాలేకపోయింది అని తెలిసింది లక్ష్మి తమ్ముడికి మాత్రమే.

"అమ్మా! అక్కయ్య రాలా...?" తల్లిని అడిగింది.

"రాకేం... వారం ముందే దిగారు... అరుగో..." అంటూ కొంచెం ఎడంగా వున్న ఓ గదిని చూపించింది నిరసనగా.

అక్కా బావా ఎప్పుడు వచ్చినా ఆ గదిలోనే వుంటారు.

అతనా గది వదిలి బయటికి రాడు... భార్యను రానీయడు. సాధించుకుంటూ, వేధించుకుంటూ ఇద్దరూ ఒకరి ఎదురుగా ఒకరు ఆ గదిలోనే పడి ఏడుస్తుంటారు.

"ఇప్పటికి మూడు రోజులుగా అతగాడు అలిగి మంచం ఎక్కి కూర్చున్నాడు. మొగుడు తినకుండా అది మాత్రం ఎట్లా తింటుంది. అతనికేం బజారుకెళ్ళి అవీఇవీ మెక్కి తిరిగి వచ్చి మంచం ఎక్కుతాడు. ఇది మాత్రం తిండీ నిద్రా లేక అఘోరిస్తోంది..."

"ఎందుకు...?" ఆశ్చర్యంగా అడిగింది




లక్ష్మి.

"ఏముంది...? అంతా మనఖర్మ. దాని రాత. ఇలాంటి త్రాష్టుడితో ఎలా వేగు తోందో బిడ్డ..." లోగొంతుకతో చెప్తూ పెద్ద పిల్ల సంసారాన్ని తలుచుకుని కళ్ళు తుడు చుకుంది తల్లి.

"ఏమైందమ్మా...?" ఆదుర్దాగా అడిగింది లక్ష్మి.

"అప్పుడు ఇరవైవేల కట్నంతో మీ పెద్ద మ్మాయిని నాకు అంటకట్టారు. ఇప్పుడు మీ చిన్నమ్మాయికి లక్ష ఇస్తున్నారు. మిగిలిన ఎనభైవేలు ఇప్పుడు నాకు ఇవ్వాల్సిందే" అని అలిగి కూర్చున్నాడు. మూర్ఖుడు కాకపోతే పదిహేనేళ్ళ క్రితం జరిగిన పెళ్ళికీ, ఈనాడు జరిగే పెళ్ళికీ సాపత్యం ఏమిటి...? ఆమా టకొస్తే మీకిచ్చిందెంత...? యాభై వేలేగా... మిగిలిన యాభై వేలూ ఇప్పుడు ఇస్తారా ఛస్తారా... అని మీ ఆయన అడ గొచ్చుగా?"

"ఆ మాటే చెప్పలేకపోయారా?" సూట్ కే స్‌లో నుండి సోపు, టవలూ, బట్టలూ తీసు కుని స్నానానికి సిద్ధపడుతూ అంది లక్ష్మి.

"చెప్పకేం అందరూ ఆమాటే చెప్తున్నారు. మూర్ఖపు మనిషికి ఎందరు చెప్తే ఏంలాభం...? అదంతా నాకు అనవసరం మిగిలిన బ్యాలెన్సు ఇస్తారా... ఛస్తారా? అని కూర్చున్నాడు."

"ఇవ్వం అని చెప్పకపోయారా. ఏంచే స్తాడో? తెలిసేదిగా?"

"అదే చెప్పాం. ఇప్పటికే ఈ కట్నం డబ్బు పోగుచేసి చిన్నదాని పెళ్ళిచేసేసరికి మా ప్రాణాలు కడబడుతున్నాయి. ఇంకెక్క డ్నించి తెచ్చివ్వగలం?"

వచ్చి ఇంతసేపయినా అక్కను చూడ్డానికి వీలుకాలేదు.

అక్కను చూసి ఎన్ని సంవత్సరాల యింది...?

పొదరింటిలాంటి ఈ చిన్ని ఇంటిలో అక్కా తనూ ఒక్క ప్రాణంలా బ్రతికారు.

పెళ్ళి పేరుతో చెరోచోట.. సంవత్సరాల తరబడి ఒకర్ని ఒకరు చూసుకోకుండా కేవలం జ్ఞాపకాల్లో మాత్రమే బ్రతుకుతూ... ప్చ్... అన్నట్టుగానే ఆ మూర్ఖుడు సాయంత్రం ప్రయాణం పెట్టుకుంటే అక్కతో ఒక్కమాట మాట్లాడేందుకైనా, కంటినిండుగా చూసుకునేందుకైనా వుండదు.

మళ్ళీ ఎప్పుడో... ఎక్కడో...?!

లక్ష్మికి కళ్ళల్లో నీళ్ల చిమ్మాయి.



"ఏరా అనిల్! బాగా చదువుతు న్నావా...?" చంద్రం మేనల్లుడ్ని అడిగాడు.

"బాగా చదువుతున్నాను మామయ్యా..."

"అప్పుడు నేను వచ్చినప్పుడు సిలబస్ కాలేదన్నావు. సిలబస్ పూర్తిచేశారా?"

"ఊహుఁ... లేదు"

"అరే...సంవత్సరం పూర్తికావస్తోంది. సిలబస్ పూర్తిచేయకపోతే ఎలా...?"

"ఏమో... మామయ్యా..."

"మరి అంతా కలిసి మీ హెచ్.యమ్. సిస్టర్‌కు రిపోర్ట్ ఇవ్వలేకపోయారా...?"

అనిల్ సమాధానం చెప్పలేదు.

"ప్రోగ్రెస్ రిపోర్ట్సు ఇవ్వలేదని చెప్పావు. తరువాత ఇచ్చారా...? "

"ఇచ్చారు"

"ఏ రాంకు వచ్చింది...? "

"థర్డ్ రాంక్ వచ్చింది మామయ్యా"

"గుడ్... ఈసారి ఫస్ట్ రాంక్ వచ్చేందుకు కృషిచెయ్యాలి మరి".

"అలాగే"

"నువ్వు ఫస్ట్ క్లాసులో పాసయితే సైకిల్ ప్రజంట్ చేస్తాను. ఓ. కే.? "

"ఓ. కే. మామయ్యా"

ఏదో పనిమీద లోపలికి రాబోయిన లక్ష్మి గుమ్మం బయటే నిలబడి మామా అల్లుళ్ల సంభాషణ వింటోంది.

ఆమె ముఖం మ్లానమైంది.

గుమ్మంలో అక్కను చూసిన చంద్రం 'రా అక్కా' అని పిలిచాడు ప్రేమగా. తల్లి రావడం చూసిన అనిల్ మెల్లగా బయటికి వెళ్ళిపోయాడు.

"ఏంటక్కా అలా వున్నావ్? "

"ఎలా వున్నానురా? " నవ్వుతూ అడిగింది లక్ష్మి.

నలుగురిలో నవ్వుతూ కలిసి తిరుగుతూన్న అక్క ఎందుకో బాధ పడుతోందనీ, ఎప్పటిలా నిశ్చింతగా చలాకీగా లేదనే విషయాన్ని పసిగట్టాడు చంద్రం.

కానీ, కారణం మాత్రం తెలీలేదు.

"చెప్పక్కా ఏమిటలా వున్నావ్...? " మరోసారి అడిగాడు చంద్రం. సంతోషంగా గడపవలసిన ఈ సందర్భంలో తన స్వంత గొడవలు ఏకరువు పెట్టి తమ్ముడి మనస్సు బాధ పెట్టాలనిపించలేదు లక్ష్మికి.

"ఏమీలేదురా... బాగానే వున్నాను" అంటూ తేల్చేసింది.

ఇంతలో లోపలినుండి ఏదో గొడవ వినిపించడంతో తిరిగి చూశారు.

లక్ష్మి బావగారు సూట్‌కేస్ ఓ చేత్తో, పెళ్ళాం చెయ్యి ఓ చేత్తో పుచ్చుకుని నిప్పులు తొక్కిన కోతిలా చిందులు తొక్కుతున్నాడు వెళ్ళిపోతాను అంటూ. అతని చుట్టూ అతని సంతానం అయిన ముగ్గురు ఆడపిల్లలూ...

ఆ ఒక్కరోజుకూ తల్లినీ, పిల్లల్నీ వుండనీయమని ప్రాధేయపడుతున్నారు లక్ష్మి తల్లిదండ్రులు.

భర్తను ఎదిరించలేని లక్ష్మి అక్క కళ్లల్లో జలపాతాలు... 'తను పన్నెత్తి పలికినా పర్యవసానం ఏమిటో ఆమెకు తెలుసు. అతను తను ఎదురు మాట్లాడానంటూ పెద్దరగడ చేస్తాడు. పిల్లలూ, తనూ పుట్టింటికి భారంగా నెలల పర్యంతం పుట్టింట్లో గడపాలి. అదీ జరిగేది.

తను తన పిల్లలూ పుట్టింటికి భారం కావడం ఇష్టంలేని ఆమె పెదవి విప్పలేదు. కళ్ళు మాత్రం అవిశ్రాంతిగా వర్షిస్తున్నాయి.

"ఛీ...ఛీ... నీకు సిగ్గులేదూ. ఇంత అవమానం జరిగిన చోట ఇంకా ఏముఖం పెట్టుకుని వుంటాం. నడువు... నడువు... అంటే నేనంత పనికిమాలిన వాడిననేగా మీ వాళ్ళు ఇరవై వేలతో సరిపెట్టారు...? "

మరో రెండు గంటలు రభసచేసి, అనుకున్నట్లుగానే అప్పటి కప్పుడు భార్యను తీసుకుని వెళ్ళిపోయాడు లక్ష్మి బావగారు.

పెళ్ళి ఇల్లు వెలవెల బోయింది.

★ ★ ★

పెళ్ళి నిర్విఘ్నంగా జరిగిపోయింది.

కానీ తల్లిదండ్రుల తోబుట్టువుల మనస్సులు క్షోభపడే విఘ్నమేదో పెళ్ళికి ముందే జరిగిపోయింది.

పెద్దమ్మాయి వెళ్ళిపోయినప్పటినుండీ ఆత్మీయుల అందరి హృదయాల్లోనూ ఆమె కన్నీటి రూపమే నిండిపోయింది.





కానీ, అందరూ ఉత్సాహంగానే కనిపించారు. నవ్వుతూనే పెళ్ళి పనులు చేశారు. ఆనందంగానే పెళ్ళి జరిపించారు.

సారథి పెళ్ళి రేపనగా వచ్చాడు. పెద్దల్లుడి ప్రవర్తనతో విసిగిపోయి, కలత చెందిన అత్తమామలకు చిన్నల్లుడు దేవుడిలా కనిపించాడు.

ఏ విషయంలో అతనికి లోటు జరుగుతుందో... అన్నట్లు అపురూపంగా చూసుకున్నారు.

ఆ అపురూపంలో ఫార్మాలిటీకన్నా, మర్యాదకన్నా అతీతమైన ప్రేమ, అభిమానం, ఆత్మీయత నిండివుండటం విశేషం. దానికి తగిన విధంగానే సారథి కూడా తన అత్తవారి కుటుంబంతో స్వంతకుటుంబంలా కలిసిపోతుంటాడు.

వారి కష్టసుఖాల్లో పాలు పంచుకుంటుంటాడు. అల్లుడి బెట్టు ఏమాత్రం లేని సారథి అంటే... ఆ ఇంట్లో అందరికీ మక్కువే.

సెలవు లేదంటూ లక్ష్మిని మరో పదిరోజులు వుండి రమ్మని మరునాడే సారథి వెళ్ళిపోయాడు.

అక్కలోని మార్పుకు, ఆమె ముఖంలోని నీలినీడలను గమనిస్తూనే వున్న చంద్రం మరోసారి అడిగాడు.

"చెప్పక్కా అలా డల్‌గా వున్నావేం? " అని. లక్ష్మి తప్పించుకోవాలని చూసినా చంద్రం వదల్లేదు.

లక్ష్మికి ఇక తప్పలేదు. అంతేకాదు, తన హృదయంలోని బాధను ఎవరికైనా చెప్పి తేలికపరచుకొంటే ... అనే ఆలోచన కూడా వుంది.

చంద్రం ఏదైనా సలహా ఇవ్వగలడేమో...

"అనిల్ గురించేరా..." అంది దిగులుగా.

"అదేమిటి? బంగారు తండ్రిలా వాడు చదువుకొంటోంటే... ఈ సారి థర్డ్ రాంక్ వచ్చాడట కదా! ఆ స్కూల్లో థర్డ్ రాంకు రావడం అంటే గొప్ప విషయమే"

"నీకలా చెప్పాడు కదూ? నేనూ విన్నాను" అంటూ కొంతకాలంగా అనిల్ ప్రవర్తనా, తాను స్కూలుకు వెళ్ళి తెలుసుకున్న వివరాలూ, అందుకుగాను సారథీ తనూ ఎంతగా ఆవేదనపడుతున్నారో వివరంగా చెప్పి, అది కాదురా చంద్రం వాడు ఫస్ట్, సెకండ్ రాంకులు తెచ్చుకోకపోయినా ఫరవాలేదు. కానీ, ఈ అబద్ధాలేమిటి? ఎందుకిన్ని అబద్ధాలు చెప్తున్నాడో అర్థం కాదు. ఈమధ్యకాలంలో వాడు ఒక్కమాట నిజం చెప్పిన పాపాన పోలేదు. పిల్లలు ఇంత అపనమ్మకంగా పెరగడం అసహ్యంగా వుండదూ... వాడు ఎంత చక్కగా అబద్ధాలు చెప్తున్నాడంటే, అబద్ధాలు చెప్పడంలో వాడు ప్రొఫెషనల్ అయిపోయాడంటే నమ్ము..."

తనకు థర్డ్ ర్యాంకు వచ్చిన విషయం వాడెంతో సిన్సియర్‌గా చెప్తున్న దృశ్యం గుర్తుకు వచ్చింది చంద్రానికి.

"నెమ్మదిగా చెప్పి చూడాల్సింది..." చంద్రం అన్నాడు.

"బుజ్జగించి చెప్పినా, దండించి చెప్పినా లాభంలేకుండా వుంది. ఏంచెయ్యాలో తోచకుండా వుందిరా..." బాధపడుతూ అంది లక్ష్మి. చంద్రానికి అనిల్ వుంగరం చేత్తో పట్టుకుని మట్టి దులుపుతూ తనను చూసి ఉలిక్కిపడిన సందర్భం గుర్తుకు వచ్చింది.

ఆ సంఘటనలో ఏదో అసహజత్వం వుంది...కానీ అది ఏమిటో చంద్రానికి ఇప్పటికి కూడా అర్థంకాలేదు.

తనకే అర్థంకాని ఆ సంఘటన గురించి ఎలా చెప్పాలో ఏం చెప్పాలో అర్థంకాక మౌనంగా వుండిపోయాడు.

లక్ష్మి అనిల్‌కు సంబంధించిన ఒక్కొక్క సంఘటనే వివరంగా చెప్తోంది.

"చిన్నవాడు కదక్కా! ఇంకా తెలీదు. పెద్ద వాడైతే తప్పకుండా తన తప్పు తెలుసుకుని మారతాడు..." అక్కను ఓదార్చేందుకు చెప్పాడు చంద్రం.

లక్ష్మి మనస్సులో కూడా అదే ఆశ మిను కుమినుకు మంటోంది. ఆ ఆశనే ప్రోది చేసుకుంటూ, "నేనూ అదే ఆశతో వున్నాను" అంది అప్పటికా సంభాషణ ముగిస్తూ.

★ ★ ★

చెల్లెలి పెళ్ళి తరువాత లక్ష్మి ఓ వారం రోజులు పుట్టింట్లో వుంది అందరి బలవం తంమీద.

ఈ వారం రోజులూ అనిల్ ముళ్ళమీద గడిపినట్లు గడిపాడు.

ఈ వారంలోనూ లక్ష్మి చాలా గమనించ గలిగింది. ముఖ్యంగా చంద్రం కార్యకలా పాలూ, అతను చదివే సాహిత్యం అతన్ని కలుసుకునే మనుష్యులూ...

తల్లి కూడా చంద్రం విషయంలో బాగా దిగులు పడుతోన్నట్లు గ్రహించింది లక్ష్మి.

★ ★ ★

రాజు గ్లాసు ఎత్తి నోటివద్ద పెట్టుకు న్నాడు ఆత్రంగా.

"ఆగు"... అరిచాడు ప్రకాష్.

ఉలిక్కిపడ్డట్లుగా ఆగిపోయాడు రాజు.

ఏం జరిగిందో అర్థంకాక అందరూ వింతగా చూస్తున్నారు.

"ఒరేయ్! అప్పుడే త్రాగేయ కూడ దురా..." ప్రకాష్ చెప్పాడు. ఈ ప్రోగ్రాం అంతా కండక్ట్ చేస్తోంది ప్రకాష్... ఆ ధీమా వాడి స్వరంలో వద్దనుకున్నా తొంగి చూస్తోంది.

"ఎందుకు...?" రాజు అడిగాడు అర్థం కాక.

"ముందు ఛీర్స్ చెప్పాలి"

"అంటే?"

"అంటే... అంటే... టీ.విలో చూడ్లా! త్రాగేముందు గ్లాసులన్నీ "టక్"మని తగి లిస్తూ "ఛీర్స్" అంటారు. మనం కూడా అలాగే చేద్దాం"

అందరూ ఒప్పుకున్నారు.

"ఒరేయ్ ప్రకాష్! ఇదేదో ఘాటువాసన వేస్తోందిరా..."

రాజు అమాయకత్వానికి ప్రకాష్ నవ్వి, "మరేమిటనుకున్నావ్? అలాగే వుంటుంది..." అన్నాడు అతిశయంగా. అనిల్ ఒక్క చుక్క రుచి చూసి ముఖం వికారంగా పెట్టాడు.

"ఏమిటి అనిల్? కాస్ట్రాయిల్ ఫేస్ వేశావ్...?

"అబ్బ... చేదుగా వుంది. మంట కూడా" ఇబ్బందిగా అన్నాడు అనిల్.

"మొదట అలాగే వుంటుందటలే..."

ప్రకాష్ గైడెన్స్ ఇస్తున్నాడు.

అంతకుముందే కొని తెచ్చుకున్న పచ్చి మిర్చి బజ్జీలు, పకోడీలూ, జీడిపప్పులూ, మధ్య పెట్టుకుని ఒక్కొక్కటే తింటూ, పెద్ద వాళ్ళను అనుకరిస్తూ అందరూ మందు తాగుతున్నారు.

అందరికీ ఉత్సాహంగా వుందా మందు పార్టీ.

"ఒరేయ్ ప్రకాష్ గొంతు మండుతోం దిరా..."

"మొదటిసారి అలాగే వుంటుంది కానియ్"

రాజు గబగబా నోట్లో పోసుకున్నాడు.

"యూ ఫూల్! అలా వాటర్ తాగినట్లు గడగడా తాగేయకురా కొంచెంకొంచెం సిప్ చేయాలి. ఇదిగో... ఇలా... తెల్సిందా?" ప్రకాష్ తాగి చూపించాడు.

తెలిసిందన్నట్లుగా అందరూ తల ఊపారు.




సుభాష్ తండ్రి మందు త్రాగుతోండగా చాలాసార్లు చూశాడు. త్రాగడం ఎలాగో తెలుసుగానీ, ఎప్పుడూ తాగి మాత్రం చూడ లేదు. తండ్రి తాగుతుండగా చూసినప్పుడు మాత్రం ఒక్కసారి తాగి చూస్తే ఎలా వుంటుందో... అనుకునేవాడు ఆశగా.

కానీ ఎప్పుడూ ధైర్యం మాత్రం చెయ లేదు.

"ప్రకాష్ ఈ బాటిల్ నీకు ఎక్కడిదీ?" అనిల్ అడిగాడు.

"ఇలాంటి బాటిల్స్ మా ఫ్రిజ్‌లో బోల్డు వున్నాయి తెలుసా?"

"ఎక్కడివి...?"

"మానాన్నగారు ఆఫీసరు కదా... పార్టీలు ఇస్తుంటారు"

"పార్టీలు అంటే...?"

ప్రకాష్, రాజు, సుభాష్ నవ్వారు.

ఆ నవ్వుకు అర్థం అనిల్‌కు తెలుసు. "సోది సొరకాయ్" అని. సోది సొరకాయ్ అనే పదం అనిల్‌కు నిక్‌నేమ్ అయిపో యింది. అయినా ఇప్పుడు అనిల్‌కు కోపం రావడంలేదు.

ఫ్రెండ్స్ అంటే తప్పేం వుందీ... అని సరిపెట్టుకుంటున్నాడు.

"అన్నీ మీ డాడీ తాగుతారా?" మండు తున్న గొంతును అరచేత్తో రాసుకుంటూ అడిగాడు అనిల్.

అంతగా మండుతోన్న ఆ ద్రవాన్ని తాగ గలగడం ఓ గొప్ప విషయంగా భావిస్తు న్నాడు అనిల్.

"మా డాడీ కంపెనీ లేకుండా తాగరు"

"కంపెనీ అంటే...?"

"మందు తాగే ఫ్రెండ్స్ అన్నమాట... మనలాగ. మా డాడీ ఫ్రెండ్స్ అంతా తాగుతూ బాయిల్డ్ ఎగ్స్, ఆమ్లెట్స్, క్యాజూ నట్స్, చికెన్, మటన్, మిర్చి... బోలెడు తిండి తింటూ త్రాగుతూ భలే ఎంజాయ్ చేస్తారులే. నన్ను ఆ గదిలోకే రావద్దం టారు. నాకెంత జెలసీగా వుంటుందో తెలుసా...?"

"నిజమేరా... ఈ పెద్దవాళ్ళు ఎంతో సెల్ఫిష్... వాళ్ళకు ఇష్టమైనవి తింటారు, త్రాగుతారు. ఇష్టమైన సినిమాలు చూస్తారు. కానీ మనకు మాత్రం అది వద్దు... ఇది తప్పు అంటూ సుత్తి కొడుతుం టారు" కోపంగా అన్నాడు రాజు.

ప్రతి విషయానికీ ఆంక్షలు పెడుతుంటా రని వాడికి తన మమ్మీ- డాడీలంటే కోపం.

"ఈ డ్రింక్ పేరేమిటి?"

"దీన్ని... దీన్ని రమ్ అంటారు. జిన్ వేరేలా వుంటుంది. బీర్ లేదూ అది ఆడ వాళ్ళ డ్రింక్..." ప్రకాష్ కోసేస్తున్నాడు.

"ఏంకాదు... బీర్ కూడా అందరూ తాగు తారు" సుభాష్ చెప్పాడు.

"తాగుతారు. అయినా ఆడవాళ్ళే ఎక్కువ తాగుతారట..." ప్రకాష్ సర్దుకున్నాడు.

సహజంగా సుభాష్‌తో వాదంపెట్టుకునేం దుకు మిత్రబృందంలో ఎవరూ సిద్ధపడరు. అలా వాదం పెట్టుకున్న వాడికి ఆ గ్రూపులో స్థానం వుండదు.

అందరికీ మందు కొంచెం కొంచెంగా తల కెక్కి, కళ్ళు ఎర్రబడి శరీరం స్వాధీనం తప్పు తోంది.

ప్రకాష్ ఈ మందు పార్టీకి హోస్ట్‌గా ప్రతి క్షణం తన ఆధిక్యతను గుర్తుకు తెచ్చేందుకు ప్రయత్నిస్తున్నాడు.

"అసలు పెద్దబాటిలే తెద్దామనుకున్నాను. చిక్కలేదు" ప్రకాష్ ఆధిక్యత ఇక ఎంతోసేపు సహించలేకపోయాడు సుభాష్.

"ఒరేయ్ రాజూ! ఇలాంటి బాటిల్స్ మా ఫ్రిజ్‌లోనూ బోల్డు వున్నాయి రేపు నేను తెస్తాగా" అన్నాడు.

"రియల్లీ...? "

"రియల్లీ...? "

"గాడ్ ప్రామిస్..."

"గాడ్ ప్రామిస్"

మరునాడు కూడా తమకు మందు పార్టీ చేసుకునేందుకు అవకాశం కలిగినందుకు అందరూ సంతోషించారు.

"మనం మొదటిసారిగా మందు పార్టీ చేసుకొంటోన్న ఈ శుభ సందర్భంలో అందరం కలిసి ఓ ప్రతిజ్ఞ చేసుకుందాంరా" స్వాధీనం తప్పుతోన్న స్వరంతో ముద్దముద్దగా అన్నాడు సుభాష్. సుభాష్ ప్రతి పాదనను అందరూ ఆశ్చర్యంగా విన్నారు.

"ప్రతిజ్ఞా...? "

"యస్"

"ఏం ప్రతిజ్ఞ...? "

"మనందరం ఎప్పటికీ ఇలా ఫ్రెండ్స్‌గానే వుండాలని. మీకు ఇష్టమేనా? "

"ఓ... నాకు ఇష్టమే" రాజు అన్నాడు.

"ఐ అగ్రీడ్" ప్రకాష్.

"ఐ టూ..." అనిల్.

అందరూ ఆనందంగా సుభాష్ ప్రతిపాదనను అంగీకరించారు.

"అయితే అందరూ నేను చెప్పినట్లు చెప్పండి..." సుభాష్ చెప్పాడు.

"ఓ. కే. యార్..."

"మేం నలుగురం ఎప్పటికీ కలిసే వుంటాం..." సుభాష్ చెప్పాడు.

"మేం నలుగురం ఎప్పటికీ కలిసే వుంటాం" ముగ్గురూ కోరస్‌గా అన్నారు.

"ఎప్పటికీ ఫ్రెండ్స్‌గానే వుంటాం..."

"ఎప్పటికీ ఫ్రెండ్స్‌గానే వుంటాం..."

"ఎప్పటికీ విడిపోము..."

"ఎప్పటికీ విడిపోము..."

సుభాష్ చెప్పినట్లుగానే అందరూ ఒకరిచేతులమీద మరొకరి చేతులు వుంచి 'ప్రతిజ్ఞ' తీసుకున్నారు.

★ ★ ★

ఆవేళ ఫస్ట్ పిరియడ్‌లో రాజు తను మోసుకొచ్చిన రహస్యాన్ని స్నేహితులకు చెప్పడానికి తెగయాతన పడుతున్నాడు.

కానీ చెప్పడానికి అవకాశమే కుదరి చావడంలేదు.

తనకు రైట్ సైడ్‌న కూర్చున్న అనిల్‌కు చెబ్దామనుకున్నాడు మొదట. కానీ వెంటనే ఆ ప్రయత్నాన్ని విరమించుకున్నాడు.

వాడు అసలే సోది సొరకాయ్. ఏ విషయమూ త్వరగా అర్థం కాదు. పోగా అదేమిటీ... ఇదేమిటీ అంటూ ప్రశ్నలతో చంపుకుతింటాడు. అదీగాక బోలెడు ఆశ్చర్యాలూ, భయాలూ ఎక్స్‌ట్రా.. ఎక్స్‌ట్రాలు.

ఇంతా జరిగేసరికి క్లాస్ డిస్టర్బ్ అయ్యి, టీచర్ చూశారంటే పాఠం వినకుండా ఏంమాట్లాడుతున్నారంటూ తంతారు.

వద్దు... అసలు అనిల్‌గాడికి చెప్పనే వద్దు. నిర్ణయించుకున్నాడు రాజు. తనకు ఎడం పక్క కూర్చున్న ప్రకాష్ వంక చూశాడు.

వాడు పాఠం శ్రద్ధగా వింటున్నట్లు నటిస్తూ పుస్తకం మీద తన పేరుకు నగిషీలు చెక్కుతున్నాడు.

సుభాష్ అయితే విషయం త్వరగా క్యాచ్ చేస్తాడు.

కానీ, బ్యాడ్ లక్... వాడు అనిల్ పక్కన కూర్చున్నాడు. సుభాష్‌కు చెప్పాలంటే అనిల్ మీదనుండి వంగి చెప్పాల్సివుంటుంది. అది మొదటికే ప్రమాదం.

ఇన్ని కారణాల దృష్ట్యా రాజు తన రహస్యాన్ని సుభాష్‌కు చెప్పకుండా తన పక్కనే కూర్చుని శ్రద్ధగా పాఠం వింటోన్నట్లు నటిస్తోన్న ప్రకాన్‌కు చెప్పడానికి ప్రయత్నించాడు.





చెప్పకుండా క్షణం కూడా వాడు ఆగలేక పోతున్నాడు.

"ప్రకాష్..." రహస్యంగా పిలిచాడు రాజు.

"ఊc..." అంతే మెల్లగా పలికాడు ప్రకాష్.

"నా బ్యాగ్‌లో ఏముందో తెలుసా...?"

"ఏముంది...?"

రాజు గుసగుసగా చెప్పాడు.

"క్యా... ఏమిట్రా...?" గుసగుసగా అడిగాడు ప్రకాష్. ఆమాత్రం డిస్టబెన్సుకే చెప్తోన్న పాఠాన్ని ఓ క్షణం ఆపి ప్రకాష్ వంక చూశారు టీచరు.

రాజు, ప్రకాష్ సైలెంట్ అయిపోయారు.

టీచర్ తిరిగి లెసన్ ప్రారంభించారు.

రాజు తన స్కూలు బ్యాగ్‌లోని పాకెట్ కొంచెంగా బయటికి లాగి ప్రకాష్‌కు సైగ చేశాడు.

ప్రకాష్‌కు రాజు చూపినదేమిటో అర్థం కాక, "ఏమిటి?" అన్నట్లు కళ్ళతోనే ప్రశ్నించాడు.

రాజు గుసగుసగా ఏదో చెప్పడానికి ప్రయత్నించాడు.

తిరిగి అప్పుడే అక్కడే శబ్దం కావడంతో ప్రకాష్‌వైపు కోపంగా చూశారు మేడం.

"వాట్ హేపెండ్...?" అంటూ గద్దిస్తూ అడిగారు.

అంతే... ప్రకాష్, రాజులు సైలెంట్ అయిపోయారు.

ఈసారిగానీ టీచర్ దృష్టి తనమీద పడితే తన్నులు తప్పవని తెలిసిన ప్రకాష్ మరో సారి రాజు వంక చూసేందుకు ధైర్యం చెయ్యలేదు.

ఆ పిరియడ్ అలా గడిచిపోయి బెల్ మ్రోగి టీచర్ బయటికి వెళ్ళడంతోనే రాజు తన రహస్యం సుభాష్‌కు చెప్పేశాడు. విషయం క్యాచ్ చెయ్యగలిగిన సుభాష్ ఆశ్చర్యం నుండి తేరుకోకుండానే సెకండ్ పిరియడ్ మేడం వచ్చేశారు హడావిడిగా ఏదో ఆరిపోతున్నట్లు. విషయం పూర్తిగా అడిగి తెలుసుకునే అవకాశం లేనందుకు సుభాష్ మనస్సు గింజుకుపోతోంది.

సెకండ్ పిరియడ్ అంతా రాజు, సుభాష్ అనిల్ మీదికి వంగి కళ్ళతోనూ, చేతుల హావభావాలతోనూ మాట్లాడ్డానికి ప్రయత్ని స్తూనే వున్నారు.

అనిల్‌కు విషయం అర్థంకాలేదు. ఇబ్బందిగా అటూ ఇటూ కదులుతూనే వున్నాడు.

డిస్టబెన్స్‌కు కారణం తనే అనుకుని టీచర్ తనను తంతుందేమో... అని అనిల్ ఆ పిరియడ్ అంతా భయపడుతూనే గడిపాడు.

ఇంటర్వెల్ అయ్యింది. సుభాష్ తన ఫ్రండ్స్‌తో ఎప్పటిలా ఐస్‌క్రీం బండీవైపు కాకుండా చెట్లకిందికి చేరాడు.

వెంటనే రాజు సుభాష్ చెవిలో గుసగుసగా చెప్పాడు వివరంగా.

"రియల్లీ...?"

"రియల్లీ"

"గాడ్ ప్రామిస్...?!"

"గాడ్ ప్రామిస్"

"ఏమిట్రా అది...?" ఆగలేని ప్రకాష్ అడిగాడు.

సుభాష్ ప్రకాష్ చెవిలో చెప్పాడు.

ప్రకాష్ ముఖం ఆనందంతో ఆశ్చర్యంతో వెలిగిపోయింది.

"ఏదీ...?" అన్నాడు ఎగ్జైట్ అయిపోతూ.

"ఇదిగో..." అంటూ రాజు తన స్కూలు బ్యాగ్ చూపాడు.

"బయటికి తియ్యి..."



"అమ్మో... ఎవరైనా చూస్తారు"

అనిల్‌కు అంతా అయోమయంగానూ, ఆసక్తిగానూ వుంది. ప్రశ్నించకుండానే అదేమిటో తెలుసుకునేందుకు ప్రయత్నిస్తున్నాడు.

"అయితే అది మనం చూడ్డం ఎలారా...?" ప్రకాష్ అడిగాడు.

ముగ్గురూ కొన్ని క్షణాలు తీవ్రంగా ఆలోచించారు.

"రాజూ! ఐడియారా..." సుభాష్ అరిచాడు.

"ఏమిటి..." రాజు, ప్రకాష్ ఆతృతగా అడిగారు.

"ఇప్పుడీ స్కూలుకు దుమ్మా కొట్టేద్దాం. ఎంచక్కా మా ఇంట్లో చూడవచ్చు మా మమ్మీ-డాడీ వుండరుగా..."

సరే... అంటే... సరే... అనుకున్నారు.

"అనిల్! నువ్వు కూడా రా. భలే మజా వస్తుంది"

అనిల్‌కు ఇంకా విషయం అర్థంకాలేదు. అయినా వాళ్ళతోపాటు వెళ్ళడానికి ఉత్సాహపడ్డాడు.

నలుగురూ ఆఘమేఘాలమీద సుభాష్ ఇంటికి చేరుకుని కామన్ హాల్లో సెటిల్ అయిపోయారు.

ఇదీ అని చెప్పలేని ఉత్సుకతతో ఆతృత పడిపోతున్నారు.

రాజు బ్యాగ్‌లోని పాకెట్ తీసి సుభాష్‌కి ఇచ్చాడు. సుభాష్ పాకెట్ విప్పి చూసి "ఇదేమిటిరా... భూకైలాస్ అని వుంది...?"

"అంతేరా బ్లూ ఫిలింస్ అంతేనట. ఎవరికీ అనుమానం రాకుండా పాత చిత్రాల పేర్లున్న కేసెట్‌లమీద రికార్డ్ చేస్తారు" బ్లూఫిలింస్ గురించి తనకు బోల్డు తెలిసినట్లు చెప్పాడు రాజు. సుభాష్ వి.సి.పి.లో క్యాసెట్ అమరుస్తున్నాడు చకచకా. ఎందుకైనా మంచిదని ముందుజాగ్రత్తగా రాజు కిటికీలూ, తలుపులూ మూస్తున్నాడు.

అనిల్ అందరినీ అయోమయంగా గమనిస్తున్నాడు.

"రాజూ! ఇది నీకు ఎలా దొరికిందిరా...?"

"రాత్రి మా అక్కా... బావా గదిలో ప్లే చేస్తుంటే చూశాను."

"చూశావా...?" ఆశ్చర్యంగా అడిగాడు ప్రకాష్.

"ఓ..." గర్వంగా చెప్పాడు రాజు.

"ఎలా వుందిరా...?" కుతూహలంగా అడిగాడు ప్రకాష్.

"అబ్బా... ఎంత బూతో... అయినా భలే రంజుగా వుందిరా..."

"నువ్వు చూస్తుంటే మీ అక్కా-బావా ఊరుకున్నారా...?"

"వాళ్ళకు తెలీకుండా కిటికీ కింద నక్కి రహస్యంగా చూశాను. నేను చూస్తున్నట్లు వాళ్ళకు తెలీదు"

"ఎట్లా తెచ్చావురా...?"

"వాళ్ళేమో క్యాసెట్ బీరువాలో పెట్టారు. పేక్‌చేసి బ్యాగ్‌లో దాచిపెట్టి తెచ్చాను"

"క్యాసెట్ కోసం వెదుక్కుని నువ్వు తెచ్చావని తెలిస్తే తన్నరూ?"

"వాళ్ళు స్నేహితుల ఇంటికి వెళ్ళారా... రాత్రికి గానీ రారు. ఈ లోపు మనం చూసి తిరిగి సాయంత్రం ఎప్పటిచోట పెట్టేస్తే సరి"

అద్భుతమైన వాడి తెలివిని ప్రకాష్ మెచ్చుకున్నాడు.

ఈలోపు సుభాష్ కేసెట్ అరేంజ్ చేసి టి.వి. ఆన్ చేశాడు. మ్యూజిక్‌తోపాటు టైటిల్. తారాగణం పేరు... ఆ పైన సినిమా ప్రారంభం అయ్యింది. నలుగురూ





తహతహలాడుతూ చూస్తున్నారు. పదినిమిషాల సినిమా నడిచింది.

"రాజూ! ఇదేమిటిరా భూకైలాస్ వస్తోంది..."

"వస్తుందిరా..."

సినిమా నడుస్తోంది. రావణాసురుడిగా ఎన్.టి.ఆర్. అద్భుతమైన రూపంగానీ, నటనగానీ వాళ్ళను ఆకర్షించడంలేదు. అయినా చూస్తున్నారు. ఇంకా తాము ఆశించిందేమిటో వస్తుందని.

"ఏదిరా రాజూ..." ప్రకాష్ ఆగలేక అడిగాడు.

"ఆగరా... తరువాత వస్తుందేమో..." రాజు అన్నాడు.

నారదుడుగా అక్కినేని అద్భుతమైన నటనాచాతుర్యం కానీ, మండోదరి, పార్వతిల అపూర్వమైన సౌందర్యం కానీ, అద్భుతమైన సెట్టింగులు కానీ వాళ్ళను ఆకర్షించడం లేదు.

అయినా ఓపికగా చూస్తున్నారు.

సినిమా సగంకంటే ఎక్కువగా అయిపోయింది. సుభాష్‌లో క్రమంగా సహనం చచ్చిపోయింది.

"ఏదిరా... రాజూ..." అన్నాడు కోపంగా.

"చివరిలో వుందేమోరా..." బిక్కమొహం వేసి చెప్పాడు రాజు.

"పోనీలేరా సుభాష్. చివరిలో వుందేమో చూద్దాం" ప్రకాష్ సర్దిచెప్పాడు.

సినిమా పూర్తి అవడంతో క్యాసెట్ అయిపోయింది. అందరి ముఖాలూ కోపంగానూ అసంతృప్తిగానూ వున్నాయి.

"ఏరా రాజూ! మమ్మల్ని ఫూల్స్ చేద్దామనుకుంటున్నావా...?"

"లేదురా, గాడ్ ప్రామిస్"

"రాత్రి నిజంగా చూశావా...?"

"గాడ్ ప్రామిస్‌రా... చూశాను"

"మరి ఏమైంది...?"

"ఏమోరా... నాకేం అర్థం కావడంలేదు"

"కేసెట్ మారిపోయి వుంటుందిరా..." ప్రకాష్ అన్నాడు.

"నిజమే" సుభాష్ ఒప్పుకున్నాడు.

కేసెట్ ఎలా మారిందో రాజుకు చచ్చినా అర్థం కావడంలేదు.

నిజానికి జరిగింది ఏమంటే...

రాజు అక్కా బావా బ్లూఫిలిం కేసెట్ తమతోపాటు తీసుకువెళ్తూ, భూకైలాస్ నిజం కాసెట్ అక్కడ పెట్టివెళ్లారు. రాజు కంగారులో అక్కడ వున్న కేసెట్ దొంగతనంగా తెచ్చాడు.

తమ బ్లూ ఫిలిం ప్రోగ్రాం అలా అంతమయినందుకు అందరూ డిసప్పాయింట్ అయ్యారు.

ఆ తరువాత ప్రకాష్ రాజును రాత్రి ఏం చూశాడో అడగడం ప్రారంభించాడు.

అనిల్, సుభాష్ కుతూహలంగా వింటూండగా రాజు రాత్రి తాను చూసిన బ్లూఫిలిం ముచ్చట్లు రెచ్చిపోయి చెప్పడం ప్రారంభించాడు.

ఛీ... ఛీ... ఛీ... అంటూనే ఆసక్తిగా అడిగి మరీ వింటున్నారు శ్రోతలు.

తను చేసిన తప్పిదాన్ని అప్పటికి అలా కవర్ చేసుకున్నాడు రాజు.

* * *

నవీన్ హత్య కేసు చాలాకాలం కోర్టులో నడిచింది. ఇరుపక్షాల వారూ దిట్టమైనవారే కావడంచేత కేసు చాలా కాంపిటీటివ్‌గా నడిచింది.

ఎంతోమంది హంతకులను, దోషులను తన వాదనా పటిమతో, వాక్చాతుర్యంతో, సమయస్ఫూర్తితో నిరపరాధులుగా, నిర్దోషులుగా నిరూపించి తన బ్యాంక్ 'బ్యాలన్స్'ను

పెంచుకున్న రామనాథంగారు తన కొడుకు హత్య గావింపబడకుండా రక్షించుకోలేకపోయారు.

పట్టణ ప్రజలంతా ఆ హత్య విషయం పూర్తిగా మరిచిపోయాక కోర్టు తీర్పు వెలువడింది.

న్యాయం లభించని ఎంతోమంది నిరపరాధులు తనను శపించి వుంటారు... వారి శాప ఫలితమే తన కుమారుని మరణం.

"లాయర్ రామనాథం! నీ కొడుకును హత్య చేసిన ఆ కుర్రాడి తండ్రి వద్దనుండి కావలసినంత డబ్బు తీసుకొని ఆ కుర్రాడు నిరపరాధి అని వాదించి నీ బ్యాంక్ బ్యాలన్స్ పెంచుకో. నీ వృత్తే అది కదా! మంచి అవకాశం... నీవు పేరుకు న్యాయవాదివి. కానీ నీకు కావలసింది న్యాయం కాదు.. కేవలం డబ్బు... ఆ డబ్బు ఎలా వస్తేనేం...? ఆ డబ్బు సంపాదించేందుకు నీ కొడుకు కూడా నీకు అవకాశం ఇచ్చాడు..." అంటూ లాయరుగారి అంతరాత్మ అతన్ని రంపపు కోతకు గురిచేసింది.

లాయరుగారు కొడుకు మరణంతో కుంగిపోయారు.

వేణు తండ్రి ఎంత రాజకీయ నాయకుడైనప్పటికీ, ఎంత పలుకుబడిని ఉపయోగించీ, ఎంత డబ్బును వెదజల్లీ, ఎంత మంచి లాయర్‌ను పెట్టినా కూడా కొడుకు నేరం చెయ్యలేదని నిరూపించుకోలేకపోయాడు.

అయితే ముద్దాయి మైనారిటీ తీరని కుర్రాడు అవడంచేత 'బోర్డన్' స్కూలుకు పంపించారు.

వేణు తండ్రి రాజకీయంగా తన సర్వశక్తులను, పలుకుబడినీ, ధనాన్నీ వెచ్చించి కూడా కొడుకును 'బోర్డన్' స్కూలుకు పంపకుండా ఆపలేకపోయాడు.

ఆవిధంగా నవీన్ హత్య కేసు ముగిసిపోయింది. కన్నవారి హృదయాలలో ఆరని కార్చిచ్చు మిగిల్చి కాలం సాగిపోతోంది.

సుభాష్ మిత్రబృందంలో ఇద్దరు తగ్గిపోయారు. పిల్లలు కాలక్రమేణా నవీన్, వేణులు లేని లోటును మరిచిపోయి తమ దైనందిన కార్యక్రమాల్లో తలమునకలైపోతున్నారు.



సావిరహే... తవదీనా... రాధా...

"సా...వి...ర...హే... తవ దీనా... రాధా..."

ఆరేళ్ల చిన్నారి పాప రాధ విరహాన్ని అద్భుతంగా పోషిస్తోంది.

వార్షికోత్సవానికి స్కూలు ఆడిటోరియం రంగురంగుల కాగితాలతో, పువ్వులతో అందంగా అలంకరించబడి వుంది.

విశాలమైన ఆ ఆడిటోరియంలో ఆహూతులూ, అనాహుతులూ, విద్యార్థులూ కూర్చుని ఉత్సాహంగా ప్రోగ్రాంస్ చూస్తున్నారు.

ఓచోట కుదురుగా కూర్చోలేని సుభాష్ అటూ, ఇటూ దృష్టి సారిస్తూ అందర్నీ గమనిస్తున్నాడు.

క్రికెట్ మ్యాచ్‌లనూ, 'ఏ' సినిమాలనూ, సెక్స్ పుస్తకాలనూ చూడటానికి అలవాటు పడినవాడికి ఆ డాన్సులు బోర్ కొడుతు

న్నాయి.

సుభాష్ దృష్టి అకస్మాత్తుగా కిటికీలో నుండి దూరంగా ప్రసరించింది.

బయట అంతా చీకటి... ఆ చీకటిలోనే ఏదో కదలిక... నీడల జాడలు... సుభాష్ కళ్ళు తీక్షణంగా గమనించాయి.

అస్పష్టంగా కనిపిస్తోన్న ఆ రెండు ఆకారాలూ పరిచితమైనవిగా తోచి మరింత కుతూహలంగా చూస్తున్నాడు.

చెట్లకింద క్రీనీడలలో ఆ రెండు ఆకారాలూ దగ్గరగా... చాలా దగ్గరగా సుభాష్ పక్కనే వున్న రాజును మోచేత్తో పొడిచాడు.

"ఏమిట్రా...?" అంటూ రాజు సుభాష్ వంక చూశాడు.

సుభాష్ బయటికి చూడమంటూ సైగ చేశాడు.

ఆ రెండు ఆకారాలూ ఒకరినొకరు గాఢంగా హత్తుకుంటూ... రాజు పక్కనే వున్న ప్రకాష్‌ను నెమ్మదిగా గిల్లి తాము చూస్తోన్న దృశ్యం చూపించాడు.

ప్రకాష్ తన పక్కనే కూర్చున్న అనిల్ చేతిని గుంజి రహస్యం చెప్పడానికి ప్రయత్నించాడు.

"ఏమిటి ప్రకాష్...?"

"ష్! అటు చూడు..."

ప్రకాష్ లోగొంతుకతో మెల్లగా అన్నాడు.

"ఏమిటి...?" అడిగాడు అనిల్ బయటికి చూస్తూ.

అదిగో... ఆ చెట్లకింద చూడు..."

"నాకేమీ కనిపించడంలేదు ప్రకాష్..."

ప్రకాష్ అస్పష్టంగా ఏదో గొణిగాడు. ఆ గొణుగుడుకు అర్థం అనిల్‌కు తెలుసు. "సోది సొరకాయ్" అని.

"జాగ్రత్తగా చూడు... ఏం కనిపిస్తోందో" అనిల్ ఈసారి చీకటిని చీల్చుకుంటూ చాలా జాగ్రత్తగా చూశాడు. అవును ఎవరో ఇద్దరు దగ్గరగా... చాలా దగ్గరగా.

"ప్రకాష్... వాళ్ళు..." అర్థోక్తిలో ఆగిపోయాడు అనిల్.

అనిల్ వాళ్లను పోల్చుకోగలుగుతున్నాడు. కానీ, నమ్మలేకపోతున్నాడు. "ప్రకాష్! వాళ్ళేం చేస్తున్నారు?" అప్రయత్నంగా అడిగేశాడు అనిల్. ప్రకాష్ నవ్వి, ఆ జోక్ రాజుతోనూ, రాజు సుభాష్‌తోనూ చెప్పుకుని ముగ్గురూ కలిసి నవ్వారు.

"సోది సొరకాయ్" అన్నట్లుగా ఎగతాళిగా నవ్వారు.

వాళ్ళెందుకు నవ్వుతున్నారో అర్థం కాలేదు అనిల్ కు.

ఇంతలో స్టేజిమీది "రాధా మాధవం" నృత్యనాటిక పూర్తయింది.

"డాన్సు బాగుందికదూ?" అన్నాడు అనిల్.

"మైగాడ్... ఆ డాన్సు బాగుందా? నాకెంత బోర్ కొట్టిందో..." విసుగ్గా అన్నాడు సుభాష్ చిన్న ఆవలింత వదులుతూ.

"ఛీ... ఛీ... ఏం బాగుంది?" అన్నాడు ప్రకాష్.

"వట్టి చెత్త... బ్రేక్ డ్యాన్సు అయితే ఎంత బాగుండేదో..."

"నాకు ప్రభుదేవా డాన్సంటే ఇష్టం" సుభాష్ అన్నాడు.

"నాక్కూడా..." ప్రకాష్.

"నాక్కూడా..." రాజు.

"నాకూ ఇష్టమే..." చివరిగా అన్నాడు అనిల్.

ఆ తరువాత ఏదో నాటిక వేస్తున్నారు పిల్లలు.

ఓ గయ్యాళి లావుపాటి బామ్మగారితో




# ఆమెకు అదే గొప్ప ఆస్తి!

ఈ ఫొటో చూసీచూడగానే ఈమధ్యనే చనిపోయిన బ్రిటిష్ యువరాణి డయానా అని వెంటనే గుర్తిస్తారుగదూ!

కాదు, బ్రిటిష్ టివి సీరియల్‌లో డయానా పాత్ర ధరించిన 35 సంవత్సరాల క్రిస్టినాహేన్స్ ఫొటో ఇది. అచ్చం డయానాలా ఉండే ఈమె ఆ రూపం పుణ్యమా అని ఏటా 36 లక్షల రూపాయలు సంపాదిస్తోంది . టివి సీరియల్, వ్యాపార ప్రకటనల్తో పాటు, కొన్ని కార్యక్రమాలకు, పార్టీలకు హాజరవటం ద్వారా కూడా ఈ ఆదాయం వస్తోందీమెకు.

ఇంటికి కన్నం వేసిన దొంగపడే పాట్లు...

నాటిక చాలా సరదాగా వుండి ప్రేక్షకులంతా పగలబడి నవ్వుతున్నారు. సుభాష్‌కు ఆ నాటిక కూడా పరమచెత్తగా అనిపించింది. అసలు ఆ పరిసరాల్లో కూర్చోబుద్ధి కావడంలేదు.

కట్టేసినట్లు ఒక కట్టుబాటులో ఒద్దికగా కూర్చోడం సుభాష్ ప్రకృతికే విరుద్ధం... క్లాసులో కూర్చోవలసి వచ్చినంతసేపూ ముళ్ళమీద వున్నట్లే వుంటుంది వాడి ప్రాణం.

కాలికొద్దీ తిరగడం వాడి సహజ ప్రకృతి. ఓచోట కుదురుగా కూర్చుని ఎంజాయ్ చెయ్యలేడు.

"ఒరేయ్ రాజూ! మనం కాసేపు బయట తిరిగివద్దామా...? బోర్ కొడ్తోంది..."

"సరే... ప్రకాష్ నువ్వూ వస్తావా...?"

ప్రకాష్ కూడా ఒప్పుకోవడంతో ముగ్గురూ లేచారు.

"అనిల్ వస్తాడేమో అడగరా...?" సుభాష్ అన్నాడు.

అనిల్‌కు ఆ ప్రోగ్రాంస్ చాలా ఇంటరెస్టింగా వుండి అక్కడ్నించి కదలాలని లేదు. అనిల్ ఆ నాటికను పూర్తిగా ఎంజాయ్ చేస్తున్నాడు.

కానీ, ఫ్రండ్స్ అంతా బోర్ కొడ్తోందంటూ బయటికి వెళ్ళిపోతోంటే, తను మాత్రం ముసలమ్మలా ప్రోగ్రాంస్ చూస్తూ కూర్చోడానికి నామోషీ అనిపించింది. అందుకే వెనక్కు వెనక్కు తిరిగి ఆ నాటికను చూస్తూ స్నేహితుల్ని అనుసరించాడు.

బయట గుడ్డివెన్నెల కాస్తోంది... చిరుగాలికి తోడుగా...

★ ★ ★

లక్ష్మి, సారధి ప్రిన్సిపాల్ ర్యూంలోకి అడుగుపెట్టేసరికి, ఆవిడ జేవురించిన ముఖంతో ఏదో ఫైల్ చెక్ చేసుకొంటోంది.

"గుడ్‌మాణింగ్ మేడం..." సారధి విష్ చేశాడు. లక్ష్మికైతే ఆవిడ్ని చూస్తోంటే నోరు ఎండిపోయినట్లయింది.

ప్రిన్సిపల్ ఒక్కసారి తల ఎత్తి చూసి ప్రతి నమస్కారం చేస్తున్నట్లు ఓసారి తల కదిపి తిరిగి తన పనిలో మునిగిపోయింది.

ఆవిడ ముఖం చూస్తోంటే, మూడు రోజులుగా ఆహారం ఇవ్వకుండా బోనులో వుంచిన చిరుతపులి ముఖం గుర్తుకు వచ్చింది లక్ష్మికి. ప్రిన్సిపల్ ఏమీ మాట్లాడకుండా తిరిగి తన పనిలో మునిగిపోవడంతో ఏం చేయాలో అర్థం కాలేదు లక్ష్మి-సారధిలకు.

ఆమె కూర్చోండని చెప్పలేదు. కూర్చోమనకుండా కూర్చోవడం ఏం మర్యాద? అసలు ఎదుటివారిని కూర్చోమని చెప్పకపోవడం ఏం మర్యాద? చెట్టంత మనుష్యులు ఎదురుగా వుంటే, పిలిపించిన పని చెప్పకుండా తనపని తాను చూసుకోవడంలో వున్న ఔచిత్యం ఏమిటో... సారధి-లక్ష్మిలు ఇవన్నీ ఆమెను అడగలేదు.

ఆ రకమైన భావాలు తమ ముఖంలో ప్రతిఫలించకుండా చాలా జాగ్రత్త పడ్డారు ఇద్దరికిద్దరూ.

మాయలపకీరు ప్రాణం చిలకలో వున్నట్లు తమ పంచప్రాణాలూ ఆమె అరచేతిలో వున్నాయి అనిల్ రూపంలో.

ఆమె దయాదాక్షిణ్యాలమీదే అనిల్ భవిష్యత్ ఆధారపడివుందని ఆ తల్లిదండ్రుల విశ్వాసం.

కొన్ని నిముషాల అనంతరం ప్రిన్సిపల్ తమ ముందున్న బెల్ ఓసారి నొక్కింది. ఓ అటెండర్ ప్రత్యక్షమయ్యింది.

"వీళ్లను తీసుకువెళ్ళి కామన్ హాల్లో కూర్చోబెట్టు..." మేడంగారి స్వరంలోని నిర్లక్ష్యం పసిగట్టింది అటెండర్.

ఆమెకూ తన అమ్మగారిలాగే మధ్యతర గతి తల్లిదండ్రులంటే చిన్నచూపు.

లక్ష్మి-సారధులు ఆమె వెంట కామన్ హాలువైపు నడిచారు.

కామన్‌హాలు చూపించిన అటెండరు తన పని అయిపోయినట్లు వెళ్ళిపోయింది. ఆ చూపించడంలోనూ, వెళ్ళిపోవడంలోనూ కూడా ఎంతో నిరసన.

కామన్‌హాల్లో ఎవరూ లేరు. కుర్చీలు మాత్రం వున్నాయి. కామన్‌హాల్ విశాలంగా, చల్లగా, హాయిగా వుంది.

అద్దంలా పరిశుభ్రంగా వుంది. రిచ్‌గా వుంది.

గోడలకు జీసస్ క్రైస్ట్, మేరీ మాతల విగ్రహాలూ, తైలవర్ణ చిత్రాలూ అందంగా అలంకరించబడి ఆర్ట్‌గాలరీని తలపింపచేస్తున్నాయి.

ఈ బిల్డింగ్స్‌కొరకూ, మెయింటెనెన్స్ కొరకూ తమ మతవ్యాప్తి దృష్ట్యా విదేశీ క్రిష్టియన్ గవర్నమెంట్స్ డబ్బు పంపుతాయట. అదెంతవరకు నిజమోగానీ, ప్రతి సంవత్సరమూ విధిగా ప్రతి విద్యార్థినుండీ డొనేషన్ రూపంలో చాలా వసూళ్లుంటాయి. ప్రతి సంవత్సరమూ ఆ స్కూల్లో ఏదో ఒకరకమైన నూతన కట్టడం నిర్మించబడుతూనే వుంటుంది.

కామన్ హాల్ పరిశీలనగా చూస్తూ, లక్ష్మి-సారధి ఆలోచిస్తున్నారు.

ప్రిన్సిపల్ ఎందుకు పిలిపించారో వాళ్ళకు తెలీదు.

అయితే లక్ష్మి కొద్దిగా ఊహించుకుంటోంది.

అనిల్‌కు మార్కులు సరిగ్గా రావడం లేదు. పైగా స్కూలుకు కూడా సరిగ్గా అటెండ్ అవుతున్నాడో లేదో... అందుకే తమను మందలించేందుకు పిలిపించి వుంటుంది.

అవును... అంతే... ఇంకేముంటుంది...?

విషయం ఇదీ అని తెలిసినట్లు అనిపించినా, ఆమె మనస్సు భయపడుతూనే వుంది, ఆవిడ ఎంతగా కేకలు వేస్తుందోనని.

భర్త పక్కనే వుండటంతో కాస్త ధైర్యం తెచ్చుకోడానికి ప్రయత్నించింది. భార్యాభర్తలిద్దరూ ఇలా ఎవరి ఆలోచనల్లో వాళ్ళుండగానే డాక్టర్ మూర్తి, డాక్టర్ ప్రేమలతలను అటెండర్ వినయంగా తీసుకువచ్చి శుభ్రంగా వున్న చైర్స్‌నే మరోసారి శుభ్రంగా తుడిచి, "కూర్చోండి అమ్మగారూ! కూర్చోండి... అయ్యగారూ... ప్రిన్సిపల్ అమ్మగారు పది నిముషాల్లో వచ్చేస్తారు..." అని చెప్పి వాళ్ళు కూర్చునేవరకూ వుండి బయటికి వెళ్ళిపోయింది.

డాక్టర్ ప్రేమలత ఒక్కసారి లక్ష్మిని ఎగాదిగా చూసి చూపు తిప్పుకుంది. లక్ష్మి ఆమెను అనుసరించింది.

డాక్టర్ మూర్తి హలో అంటూ సారధి వంక చూసి స్నేహపూర్వకంగా నవ్వాడు.

"హలో..." అంటూ సారధి కూడా నవ్వాడు.

"అయితే మాలాగే మీరూ ప్రిన్సిపల్‌గారు పిలిపించగా వచ్చినవారన్నమాట"

"అవును సర్"

"వాట్స్ ద మేటర్...? మీకేమయినా తెలుసా...?"

"నో సర్... ఐడియా లేదు. మేమూ అదే ఆలోచిస్తూ కూర్చున్నాం"

"మీరు...?" డాక్టర్ మూర్తి అర్థోక్తిలో ఆగారు.

"నా పేరు సారధి స్టేట్‌బ్యాంక్‌లో పనిచేస్తున్నాను. ఈమె నా మిసెస్. మా

అబ్బాయి అనిల్ ఈ స్కూల్లోనే చదువుతు న్నాడు" సారధి తన పరిచయం ఇచ్చాడు.

"నేను..." డాక్టర్ మూర్తి చెప్పబోయే లోపల, సారధి అందుకుని, "మీరు తెలుసు..." అన్నాడు నవ్వుతూ.

డాక్టర్ మూర్తి మనసారా నవ్వాడు.

మగవాళ్ళిద్దరూ తమ తమ పరిచయాలు చేసుకుంటోంటే, ఆడవాళ్ళిద్దరూ రహస్యంగా ఒకరినొకరు పరిశీలించుకుంటున్నారు.

'ఈమె ఇంకొంచెం రంగుంటే బాగుండేది' అనుకుంది డాక్టర్ ప్రేమలత లక్ష్మిని గురించి.

'ఈవిడ మరికొంచెం ఎత్తుగా వుంటే ఇంకా బాగుండేది...' అనుకుంది లక్ష్మి ప్రేమలతను గురించి.

డాక్టర్ మూర్తి, సారధుల సంభాషణ పిల్లల నుండి వచ్చే సమస్యలనుండి సమాజం మీదికీ, రాష్ట్ర రాజకీయాలనుండి కేంద్ర రాజకీయాలూ, అంతర్జాతీయ రాజకీయాల మీదకూ... అలా... అలా...కప్పగంతులు వేస్తుండగా, ఆడవాళ్ళు ఒకరినొకరు పరిశీలించుకునే కార్యక్రమం పూర్తిచేసుకుని ముఖాలు తిప్పుకుని కూర్చున్నారు.

ఇంతలో మరో రెండు జంటలు హాల్లోకి ప్రవేశించాయి. వచ్చిన రెండు జంటలూ ఖరీదయినవే. లయన్స్, లయనెస్‌లూ పరస్పరం గ్రీట్ చేసుకున్న తరువాత మూడు జంటల స్వరం ఏకస్వరంగా మారిపోయింది.

అవి ఒకే జాతి పక్షులు...

అందుకే తేలిగ్గా కలిసిపోగలిగారు.

మరో పదినిమిషాలకు ప్రిన్సిపాల్‌గారు తమ సీనియర్ అసిస్టెంట్స్ ఇద్దరితో కామన్ హాల్లోకి ప్రవేశించారు.

అందరూ గౌరవ పురస్కరంగా లేచి నిలబడ్డారు.

"గుడ్ మాణింగ్ టు ఎవ్రిబడీ..." అంటూ హుందాగా కూర్చున్నారు.

"మిమ్మల్ని ఎందుకు పిలిపించానో మీకు తెలుసనుకుంటాను" అన్నారు గంభీరంగా.

"తెలీదు మేడం..." ఎనిమిది మందీ ఒకేసారి అన్నారు, క్లాస్ రూంలో పిల్లల్లా.

"ఓకే... దెన్.. ఐవిల్ టెల్‌యూ... రాత్రి స్కూల్లో జరిగిన ఫంక్షన్‌కు మీరు అటెండ్ అయ్యారా...?"

"లేదు మేడం..." డాక్టర్ మూర్తి చెప్పారు.

ఎందుకు అన్నట్లు చూశారామె.

"అర్జెంట్ కేసులు వుండటం చేత అటెండ్ కాలేకపోయాము..."

"ఇట్స్ ఆల్‌రైట్... వాటెబౌట్ యూ..." అంది మరో జంట వంక చూస్తూ.

"ఆ రాత్రి మా ఇంటికి గెస్ట్స్ వచ్చారు మేడం... అందుకే అటెండ్ కాలేకపోయాము" ఆపద్ధర్మంగా అబద్ధం చెప్పిందా జంట.

"వాటెబౌట్ యూ..." మరో జంటను ప్రశ్నించిందావిడ.

"హెల్త్ బాగుండలేక రాలేకపోయాం మేడం..."

అందరూ తలో అబద్ధం చెప్పారు స్కూలు పిల్లల్లా.

"మీ సంగతి ఏమిటి...?"

లక్ష్మి-సారధిలవైపు చూస్తూ అడిగారు ప్రిన్సిపల్‌గారు.

"ఫంక్షన్ జరుగుతున్నట్లు మాకు తెలీదు మేడం..."

"అంటే, మీ పిల్లలపట్ల మీకెంత బాధ్యత వుందో, వాళ్ళ గురించి మీకెంత తెలుసో అర్థం అవుతోంది."

ఎనిమిదిమందీ మౌనంగా వుండిపోయారు.

ప్రిన్సిపల్ గారు తిరిగి కొనసాగించారు.

"మొన్న రాత్రి స్కూల్లో కల్చరల్ ప్రోగ్రాం యాక్టివిటీస్ జరిగే సమయంలోనే బయట నలుగురు పిల్లలు ఓ పాపను రేప్ చేశారు."

ఆ గదిలోని ఎనిమిదిమందీ ఒకేసారి ఉలిక్కిపడ్డారు.

"రేప్...?!" అందులో ఒకావిడ మితిమీరిన ఆశ్చర్యంతో అసంకల్పితంగా అంది.

"యస్. షాక్ తిన్న ఆ పాప ఫెయింట్ అయ్యింది. ప్రస్తుతం హాస్పిటల్లో ట్రీట్మెంట్ తీసుకొంటోంది."

గదిలో కొన్ని క్షణాలవరకూ భయంకరమైన నిశ్శబ్దం చోటుచేసుకుంది.

కొంపతీసి తమ పిల్లలు కాదుకదా! కాకపోతే తమనే ప్రత్యేకంగా ఎందుకు పిలిపిస్తారు...? సంగతి అర్థమయిపోయింది.

అయినా రేప్ చెయ్యడానికి వాళ్ళెంత...? వాళ్ళ వయస్సెంత?

ఇదెలా సంభవం...? ఇదంతా కాలవైపరీత్యమా...?

వాళ్ళకు వెంటవెంటనే మెచ్యూర్ కాకుండానే తొమ్మిదేళ్ళ పాప తల్లి అయిన చోద్యం...

ఐదేళ్ళ పాపను తల్లిని చేసిన తొమ్మిదేళ్ళ కుర్రాడి వైనం...

ఇలా పేపర్లో చదివిన అనేకానేక వింతలూ, విడ్డూరాలూ గుర్తుకు వచ్చాయి.

పాలిపోయిన ముఖాలతో ఒకరి ముఖాలు ఒకరు చూసుకున్నారు.

ఆపైన ఎవరికీ ముఖం చూపించలేనట్లు తలలు దించుకున్నారు.

సారధికి కోపంతో పిడికిళ్లు బిగుసుకున్నాయి.

అనిల్ను చంపిపారేయాలన్నంత కోపం వచ్చింది అతనికా క్షణంలో.

భగవంతుడా! ఈ వయస్సుకే వీడికిదేం పాడుబుద్ధి తండ్రీ... అంటూ ఆక్రోశించింది లక్ష్మి హృదయం.

సుభాష్కు పదమూడో సంవత్సరం. పదమూడేళ్ళకే కుర్రాళ్లలో స్పెర్మ్ఫాం అవుతుందా...? రేప్ చేయడానికి ఆ వయస్సు కుర్రాళ్లు ఎంతవరకు సమర్థులు...? మూర్తిలోని డాక్టర్ ఆలోచిస్తున్నాడు.

తన మొదటి అనుభవం ఏ వయస్సులో జరిగిందీ...?

ఎలా జరిగింది...?

స్త్రీ శరీరంతో పరిచయం తనకు తన పదహారో ఏట జరిగింది.

అయితే... ఇలా రేప్... కాదు.

తన క్లాస్మేట్ సుశీల తనను కవ్వించి రంగంలోకి దించింది.

ఇలాగే స్కూల్లో ఫంక్షన్ జరుగుతుండగా తామిద్దరూ ఖాళీగా వున్న ఓ క్లాస్రూంలో కలుసుకున్నారు.

అక్కడ ఏం జరిగిందీ... ఎలా జరిగిందీ... ఇప్పటికీ తనకు స్పష్టంగా గుర్తుంది.

అంతే... అప్పటివరకూ ఎంతో కొంతగా వున్న తన చదువు పూర్తిగా కొండెక్కింది.

ఈ లెక్కన సుభాష్ తనకంటే మరీ ఫాస్ట్...

రాజు తండ్రి బిజినెస్మాన్-

ఈ కేసునుండి బయటపడేందుకు తను ఎంత ఖర్చు పెట్టాల్సివుంటుందీ... అనే విషయం గురించి తీవ్రంగా ఆలోచిస్తున్నాడతను.

ఒకే మతస్థులు కాబట్టి తనకేమయినా కన్సెషన్ దొరుకుతుందేమో... అని ఆశపడుతున్నాడు ప్రకాష్ తండ్రి.

ప్రిన్సిపల్ కంఠం తిరిగి ఖంగున మోగింది.




"ఆ నలుగురు పిల్లలూ ఎవరి పిల్లలో మీకీపాటికి తెలిసేవుంటుంది. ఇలాంటిది మా స్కూల్లో జరగడం ఇదే మొదటిసారి. మీ పిల్లలవల్ల ఈ ఇనిస్టిట్యూట్‌కు చాలా చెడ్డపేరు వస్తోంది.

ఈ విషయం ముందుగా మీకు తెలియ పరచి ఆపైన మీ పిల్లల టి.సి.లు ఇచ్చి పంపేయాలనుకుంటున్నాం..."

ప్రిన్సిపల్ మేడం ఒక్కక్షణం ఆగి వాళ్ల ఫీలింగ్స్‌ను స్టడీ చేసింది.

"మీ పిల్లల్ని పిలిపిస్తాను. నిజం తెలుసు కుందురుగాని..." అంటూ అటెండర్‌ను పిలిచి పిల్లల పేర్లు చెప్పి పిలుచుకుర మ్మంది.

నలుగుర్ని ఒకేసారి పిలవడంతో పిల్లలు భయపడ్డారు. అప్పటివరకూ ఫంక్షన్‌రోజు రాత్రి జరిగిన సంఘటన విషయమై మనస్సు లోపలి పొరల్లో ఏదో భయం పీకు తున్నా, రెండు రోజులుగా అంతా మామూ లుగా ఉండటంతో ధైర్యాన్ని కూడగట్టుకుం టున్నారు. ఆ రాత్రి జరిగింది ఎవరికీ తెలీ లేదనీ, అయినా ఎలా తెలుస్తుందిలే... అనీ ధైర్యాన్ని పెంచుకుంటున్నారు.

అదే సమయంలో ఈ పిలుపు.

పిల్లల గుండెలు దడదడలాడాయి. పాలి పోతోన్న ముఖాలతో ఒకరి వంక ఒకరు చూసుకున్నారు.

"నీ మూలాన్నే... అంటే నీ మూలాన్నే..." అనుకున్నారు కళ్లతోనే.

నలుగురూ వధ్యస్థలానికి తోలుకువెళ్తోన్న మేకపిల్లల్లా కామన్ హాలుకు తీసుకురాబ డ్డారు.

అంతే... అక్కడ వరుసగా కూర్చున్న తమ పేరెంట్స్‌ను చూసి అదిరిపడ్డారు.

సారథికి కొడుకును చూడగానే అప్పటిక ప్పుడు నరికి ముక్కలు చేయాలన్నంతగా కలిగిన కోపాన్ని ఎంతో కష్టంమీద నిగ్రహిం చుకున్నాడు. తానెంతో గర్వించిన తన పెంపకం ఇదీ... ఈ ఆలోచనతో అతని లోని ఆవేశం చల్లారిపోయి ఆవేదనతో కళ్లు చెమ్మగిల్లాయి. ప్రిన్సిపల్‌గారు విడివిడి గానూ, జాయింట్‌గానూ పిల్లల్ని ప్రశ్నిస్తు న్నారు.

పిల్లలు నలుగురూ కూడబలుక్కున్నట్లు మౌనాన్నే ఆశ్రయించారు. మూకుమ్మడిగా ప్రశ్నిస్తే జవాబు రావడం అసంభవం అనే విషయాన్ని గ్రహించారు హెచ్.యమ్. సిస్టర్.

అందువల్ల ఒక్కొక్కరినే వంటరిగా బెది రించి, భయపెట్టి, ఏమీ అనమని బుజ్జగించి ఎంతో ప్రయత్నంమీద వాళ్ళనుండి కొంత సమాచారం సేకరించగలిగారు.

బాత్‌రూంకు వెళ్తోన్న ఆ పాపను భయ పెట్టే ఉద్దేశంతో నలుగురూ మెల్లగా ఆ అమ్మాయి వెనకే నడిచారు.

దూరంగా గుబురుగా వున్న చెట్లమధ్య చీకటిలో, ఆ పాప నోరు గట్టిగా మూసి చాటుకు లాక్కుపోయారు.

"ఆ పాప మంజుల మీకు ఇంతకు ముందు తెలుసా...?"

తెలుసు అన్నట్లు తల ఊపారు.

"ఎలా తెలుసు...?"

"థర్డ్ క్లాస్‌లో చూశాను"

"ఎప్పుడైనా మాట్లాడావా?"

"లేదు"

"ఇలా చేయాలని మీరు ముందుగానే ప్లాన్ వేసుకున్నారా...?"

"లేదు"

"ఆ పాపను ఏం చేయాలని వెంటప డ్డారు?"

"భయపెట్టాలని"

భయపెట్టారా...?"



"ఆc..."

"ఎలా భయపెట్టారు...?"

"నెమ్మదిగా ఆ పాప వెనకే వెళ్ళి గట్టిగా అరిచాం"

"ఆ పాప భయపడిందా...?"

"భయపడింది"

"భయపడి ఏం చేసింది...?"

"గట్టిగా అరిచింది"

"అప్పుడు మీరేం చేశారు...?"

"గట్టిగా నోరు మూశాం"

"మూసి...?"

"............"

"ఏం చేశారు...?"

హెచ్. యమ్. మేడం ప్రశ్నకు వాళ్ళు మళ్ళీ మళ్ళీ కూడా మౌనంగానే వుండిపోయారు.

"ఎవరైనా చూస్తారనే భయం వెయ్య లేదా...?"

"అందరూ ఆడిటోరియంలోనే వున్నారు. బయట ఎవరూ లేరు. ఎవరైనా వస్తే చిన్నగా విజిల్ వేయమని అనిల్‌ను చెట్టు చాటున నిలబెట్టాం..."

"చీకటిలోకి లాక్కుపోయి ఆ అమ్మాయిని ఏం ఏంచేశారు?"

"............................"

"ఇలా ఎందుకు చేశారు..."

"............................"

"ముగ్గురూ కలిసి ఆ అమ్మాయిని ఏం చేశారు...?"

"............................"

ఇంక ఎలా అడగాలో, ఏం అడగాలో ఆవిడగారికి తెలీలేదు. అయితే ఈ ఇన్ఫర్మేషన్‌లో ఎక్కువ భాగం సుభాష్‌నుండే రావడంచేత ఈ మిస్చీఫ్‌కు అంతా ముఖ్య కారకుడు సుభాష్‌గా గ్రహించారు హెచ్. యమ్. మేడం.

కానీ, పైకి ఏమీ తొణకలేదు.

డాక్టర్ మూర్తి దంపతులు ఇంతకు ముందు ఎన్నోసార్లు స్కూలుకు భూరి విరాళాలు ఇచ్చి వున్నవారు. పట్టణంలో మంచి పొజిషన్‌లో వున్న డాక్టర్స్... మంచి ఆర్థిక స్థోమతా... పలుకుబడీ వున్నవారు.

హెచ్. యమ్. మేడం పిల్లల్ని తమ తరగతి గదిలోకి పంపించివేశారు. తమను ఎవరూ చూడలేదని సంతృప్తి పడ్డ పిల్లలకు ఈ విషయం హెచ్. యమ్. మేడంకు ఎలా తెలిసిందో అర్థం కాలేదు.

ప్రియుడికి కిస్సిచ్చి చీకటిలో నడుస్తూ ఆడిటోరియంవైపు వస్తోన్న యువతి నలుగురు పిల్లలూ ఆడిటోరియం విడిచి ఒకేసారి చెట్లవైపు వెళ్ళడం చూసింది కానీ, అప్పుడే అందుకున్న ముద్దు తాలూకు మైకంలో పట్టించుకోలేదు.

ఆ తరువాత గొడవ గొడవగాకాక పబ్లిక్ సీక్రెట్‌లా అందరికీ తెలిశాక ఆ గొడవకు కారకులు ఈ నలుగురు పిల్లలే, అని అర్థం చేసుకుంది. కానీ బయట పెడ్తే నువ్వెలా చూశావు...? నీకెలా తెల్సు... అసలు అప్పుడు నువ్వెందుకు అక్కడికి వెళ్ళావు...? వంటి అనేకానేక ప్రశ్నలు ఎదురైై తన గుట్టు ఎక్కడ బైటపడ్తుందోనని మౌనంగా వుండిపోయింది.

కానీ, ప్రోగ్రాంస్ మధ్యలో సుభాష్ ఫ్రండ్స్‌తో బయటికి వెళ్ళడం అతని క్లాస్ మేట్స్ గమనించడంవల్ల ఆ విషయం బయటపడిపోయింది.

అంతే... హెచ్. యమ్. మేడం విషయం అంది పుచ్చుకుంది.

పిల్లలు వెళ్ళాక కామన్ హాల్లో కొంత నిశ్శబ్దం తరువాత, "పిల్లల్ని కనగానే సరిపోదు... వాళ్ళ భవిష్యత్తును తీర్చిదిద్దగలిగిన బాధ్యతను సక్రమంగా నిర్వర్తించగలిగినవాళ్ళే నిజమైన తల్లిదండ్రులు... అలా కాని పక్షంలో సమాజానికి భారమయ్యే

సంతానాన్ని కన్నందుకు వాళ్లు దేశద్రోహులే... తల్లిదండ్రులయ్యేందుకు తెలివితేటలు వుండక్కర్లేదు. కానీ నిజమైన తల్లిదండ్రులుగా జీవించేందుకు మాత్రం తెలివితేటలు కావాలి" అనే అంశంమీద క్లాస్ తీసుకుంది హెచ్. యమ్. మేడం.

అయితే నిజానికి ఆమె పిల్లలను కననూ లేదు. పెంచనూ లేదు... కాబట్టి ఆ విషయంలో ఎదురయ్యే ఇబ్బందులు, కష్టనష్టాలు ఇవేవీ ప్రాక్టికల్‌గా ఆమెకు తెలీవు. ఆమె క్రీస్తు సేవకురాలైన సన్యాసిని... "నన్"ఆ కారణంగానే ఆమె పిల్లలను కనడం, పెంచడం విషయమై నిరాఘాటంగా ఓ గంటసేపు నిర్విఘ్నంగా, ఉపన్యసించగలిగింది.

ఆపైన "మీ పిల్లల కాండక్టు సరిగా లేదని వ్రాసి డిబార్ చెయ్యవచ్చు. కానీ అది నాకు ఇష్టంలేదు. అయితే ఇలాంటి పిల్లలవల్ల మా ఇనిస్టిట్యూట్‌కు చెడ్డ పేరు వస్తుంది. అందుకే టి.సి. ఇచ్చి పంపించేస్తాను. వేరే ఎక్కడయినా చదివించుకోండి..." అంటూ ముగించింది.

సారధి-లక్ష్మిలకు ఏం మాట్లాడాలో, ఎలా మాట్లాడాలో తెలీక నోరు పెగల్లేదు.

మిగిలిన మూడు జంటలూ అనేక రకాలుగా కన్విన్స్ చేసి మరోసారి ఇలాంటి పొరపాట్లు జరగనివ్వమని (ఇప్పుడు వాళ్లే జరగనిచ్చినట్లు) పదికి పదిసార్లు హామీ ఇచ్చాక ఆవిడ శాంతించారు.

ఆ తరువాత మరోగంట స్కూలు అభివృద్ధి కార్యక్రమాలు వివరిస్తూ, ఆ సంవత్సరం ఓ పెద్ద లైబ్రరీహాలు కన్‌స్ట్రక్ట్ చేయాలని కమిటీ నిశ్చయించిందనీ, పేరెంట్స్ ప్రోత్సాహమే స్కూలు అభివృద్ధికి స్ఫూర్తి అనీ... అదనీ... ఇదనీ... చాలా చెప్పింది. డాక్టర్ మూర్తి దంపతులు తమ వంతు విరాళంగా ఇరవైవేలు ప్రకటించారు... మిగిలిన రెండు జంటలూ వారిని అనుసరించారు. సారధికి పచ్చి వెలక్కాయ గొంతులో పడ్డట్లయింది.

ఏమీ ఇవ్వకపోతే బాగుండదు... తనకు ఎక్కువ ఇచ్చే స్తోమత లేదు. చివరికి తన వంతు విరాళంగా రెండువేలు ప్రకటించి,

"సారీ, మేడం... ఇంతకంటే ఎక్కువ ఇవ్వలేను..." అన్నాడు మెల్లని స్వరంతో.

ఇదే తన శక్తికి మించిందనీ తాము ఎన్నోనెలలు ఎంతో కష్టపడితే తప్ప తన బడ్జెట్‌ను పూరించుకోలేడనీ అతను వివరించలేదు.

"ఇట్స్ ఆల్‌రైట్" హెచ్. యమ్. మేడం చిరునవ్వుతో హుందాగా అంగీకరించారు.

తమ పిల్లలు చేసిన వెధవపనికి తల్లిదండ్రులు తలవాచేలా చీవాట్లు తిని పెనాల్టీ చెల్లించుకుని అప్పటికి ఎంతో గండం గడిచినట్లుగా రిలీఫ్ ఫీలవుతూ సెలవు తీసుకున్నారు అందరూ, సారధి దంపతులు తప్ప.

వారలాగే స్థాణువులై కుర్చీలకు అంటుకుపోయున్నారు. హెడ్‌మిస్ట్రెస్ మేడం, మిగతా మూడు జంటలూ ఉత్సాహంగా ఆ హాలులోంచి నిష్క్రమించిన సంగతే వారు గమనించలేదు.

ఎవరికివారే...

ఆదర్శ దంపతులం అనుకుంటున్న ఆ ఇద్దరు మధ్యతరగతి జీవులూ...

అందని అందలం లాంటి ఈ ఖరీదైన స్కూల్లో తమ ముద్దు బిడ్డడి భవిష్యత్‌ని ఘనంగా ఊహించుకుని ఉన్న ఆ అమాయకులిద్దరూ...

కలవారి బిడ్డల దురలవాట్ల ప్రభావానికి బలయిన తమ అమాయక బిడ్డని తలచుకుంటూ...

కన్నీరు కూడా కార్చేశక్తి లేక అలా ఉండిపోయారు.

స్కూల్ బెల్ మోగింది.

కలకలం మొదలయింది.





# సచిత్ర విచిత్రం





# ఫైవ్ ఓకే - ఎయిట్ ఏక్సిడెంట్

కాలిఫోర్నియాలోని సాన్ బెర్నార్డినోకి చెందిన 31 ఏళ్ల ఎడ్వర్డ్ మిరాండాకి అయిదుగురు పిల్లలు. అందులో ఇద్దరు కవలలు. ఎడ్వర్డ్ వేసక్టమీ ఆపరేషన్ చేయించుకున్నాడు. అది జరిగిన మూడేళ్ల తరువాత భార్య టీనా మళ్లీ గర్భవతి అవడంతో తెల్లబోయారు భార్యాభర్తలు. పైగా గర్భంలో వున్నది నలుగురు బిడ్డలని చెప్పారు డాక్టర్లు. అయితే దురదృష్టవశాత్తు అబార్షన్ అయి ఓ పిండం బయటకు వచ్చేసింది. మిగతావి మాత్రం గట్టిపిండాలుగానే నిరూపించుకున్నాయి. ముగ్గుర్నీ ఆపరేషన్‌చేసి సురక్షితంగా బయటకు తీశారు డాక్టర్లు. 'నా భర్త నన్ను అనుమానించకపోవటం నా అదృష్టం' అంది టీనా. ఎడ్వర్డ్ మళ్లీ ఆపరేషన్ చేయించుకున్నాడు. ఇప్పుడు వారికి 8 మంది సంతానం.

# 'ఎదురింటి అమ్మాయి' పై సమీక్షలు

సెప్టెంబర్ 'చతుర'లో ప్రచురితమైన అద్దేపల్లి సుచిత్రాదేవి నవల 'ఎదురింటి అమ్మాయి'పై మాకందిన ఉత్తమ సమీక్షలు

## తొలకరి చినుకు

(ప్రథమ బహుమతి రూ. 100/- పొందిన సమీక్ష)

'ఎదురింటి అమ్మాయి' లో రచయిత్రి ఎంచుకున్న ఇతివృత్తం కొత్తదేమీ కాదుగానీ పాత్ర చిత్రణలో, కథనంలో సహజత్వం ఉంది.

నాయికకు నాయకుడు బోధించే గురువు. మన భారతీయ సంస్కృతి ప్రకారం గురు-శిష్యుల సంబంధం తండ్రీబిడ్డల సంబంధమే. కాబట్టి నాయికా నాయకుల సంబంధం కూడా తండ్రీ బిడ్డల సంబంధమే. అయితే ఈ నవలలోనేకాక చాలావరకు ఇతర కథలు, సినిమాలూ కూడా ఇలాగే ఉంటున్నాయి. మనకు కచ-దేవయానిల కథ పరిచితమే. కచుడు దేవయానిని వివాహం చేసుకోకపోవడానికి కారణం ఆమె గురు పుత్రిక అంటే సోదరి అవ్వడమే. అందుకని నాయికా నాయకులు గురుశిష్యులు కాకపోతే బావుండేది.

సింధూర మనస్తత్వం మధ్యతరగతి ఆడపిల్ల మనస్తత్వమే గనుక పెళ్లికి ముందు ఆమె నాయకుడిని దూరంగానే ఉంచుతుంది. అలాగే పెద్దల నెదిరించే నేటి యువతకు భిన్నంగా సింధూర, అరవింద్‌లు పెద్దల్నొప్పించి వివాహం చేసుకుంటామనుకోవడం హర్షణీయం.

పాశ్చాత్య సంస్కృతీ ప్రవాహంలో కొట్టుకుపోతున్న యువతకు ఆదర్శప్రాయంగా నిలచే పాత్ర సంజయ్‌ది. మూగతనం శరీరానికే కాని మనసుకు కాదని నిరూపిస్తుంది దీపిక పాత్ర. ఏమయినా కానీ శృతిమించని శృంగారం అలరించినా పిచ్చివాడు కాలేజీలో కొచ్చి కత్తి విసిరే సంఘటన అసహజంగానే ఉంది. మొత్తానికి అశ్లీల సాహిత్యం ఎక్కువగా వస్తున్న ఈ రోజుల్లో ఈ నవల హాయినిచ్చే తొలకరి చినుకు.

-ఎమ్. పి. వందనాదేవి
హబ్సిగూడ-500007

## ఒడిదుడుకుల రిఫరెన్స్

(ద్వితీయ బహుమతి రూ. 75/- పొందిన సమీక్ష)

అమ్మాయి ఎదురింటిదే అయినా ఎన్ని అవాంతరాలు, ఎన్ని అడ్డంకులు, ఎన్ని ఎదురీతలు?

నవలని పొడిగించడం కోసమో లేక మలుపులు తిప్పే లావణ్యాన్ని ప్రదర్శించడం కోసమో ఇన్ని అవాంతరాలు సృష్టించారు రచయిత్రి అని ఎవరన్నా అంటే వాళ్లకి జీవితంలో ఏ అనుభవమూ లేదనే చెప్పుకోవాలి.

ఎక్కడికక్కడ అవరోధాలు సృష్టిస్తూ, వాటిని అధిగమించే ఉపాయాలను చూపుతూ జీవితమంటే ఇదే అని ప్రస్ఫుటంగా చూపించగలిగారు రచయిత్రి. ఏదీ అసమంజసంగానూ, అతిశయోక్తిగానూ, అభూత కల్పనగానూ చూపించలేదు.

అలాంటి ఆనందరావులూ, వాళ్లకి తగ్గ జోడీగా అరుంధతులూ ఇలాంటి వజ్రమ్మలూ, వాళ్ల మొండితనాలూ, నమ్మకాలూ వీటిమధ్య నలిగిపోయే విందూ, సింధూలు వీధికొకళ్లైనా ఉంటారు అన్నది యదార్థం.

దీపిక పాత్ర అపూర్వం. సంజయ్ ప్రవర్తనలో మార్పు తీసుకు రావడంతో 'సాహిత్యంద్వారా సమాజకృషి' అన్న మాటకు న్యాయం చేకూర్చారు రచయిత్రి.

జీవితపు ఒడుదుడుకుల్లో రిఫరెన్స్‌గా ఉప యోగించుకోవచ్చు ఈ నవలని పదిలంగా దాచుకొని.

-మంగళంపల్లి వెంకట సీతారామయ్య
దుండిగల్-500043

## మధ్యతరగతి ముచ్చట్లు

*(మూడవ బహుమతి రూ. 50/- పొందిన సమీక్ష)*

**ఆ**ధునిక సంస్కృతి మోజులోపడి తమ బాధ్యతల్ని మరచి చెడు మార్గాల వెంట పరిగెడుతున్న యువతకు ప్రేమ అంటే కేవలం సరదాల కోసం పరిచయాలను పెంచుకునే నేటి యువతరానికి మంచి మార్గం చూపే ప్రయత్నంలా ఉందీ నవల. సంజయ్ పాత్ర యువతరానికి ఆదర్శంగా ఉంది. ఆధ్యాత్మికతకు వయసుతో సంబంధంలేదనీ, బాధ్యతల్ని మర్చిపోకుండా ఆధ్యాత్మికతను పెంపొందించుకోవచ్చుననీ సంజయ్ చక్కగా నిరూపించాడు.

పగ, ద్వేషం అన్నీ ప్రేమ, మానవత్వం ముందు కరిగిపోక తప్పవు అని వజ్రమ్మను కాపాడడంద్వారా సంజయ్, అరవింద్ ప్రాణాలను కాపాడటంలో చొరవ చూపిన సింధూర పాత్రలద్వారా రచయిత్రి సూచించారు.

అరవింద్, సింధూర ప్రేమకథ వాస్తవంగానూ, స్వచ్ఛంగానూ ఉంది. ప్రేమ పవిత్రమైనదైతే తప్పక విజయం సాధిస్తుందని ఆ జంట నిరూపించింది. పెద్దలకు వ్యతిరేకంగా కాకుండా వారి ఇష్టాలతోనే వివాహం జరగాలి అనే వారి కోరిక ప్రశంసించదగ్గది. ప్రేమిస్తే సరిపోదు దాన్ని నిలబెట్టుకోవాలని ఈనాటి యువత గుర్తించటం చాలా అవసరం.

ప్రేమ సఫలమయితే ఏ బాధా ఉండదు, కానీ విఫలమయితే నరకమే. అది తెలుసుకుని అరవింద్ మీద అభిమానాన్ని, ఆశల్ని పెంచుకోకుండా జరుగుతున్నదంతా ఎంతో ఓర్పుగా గమనిస్తూ అసూయకు మారుపేరు ఆడపిల్ల అనే మాటను అబద్ధంగా నిరూపించింది దీపిక.

మధ్యతరగతి కుటుంబంలోని అమ్మ పాత్రకు సజీవ చిత్రణ అరుంధతి. భర్తమీద హృదయంనిండా ప్రేమ ఉన్నా బాధ్యతల నడుమ దాన్ని బంధించివేసింది. ఆ విషయం భర్త అర్థం చేసుకోక పోవడం ఆమె దురదృష్టం. తమ పిల్లల భవిష్యత్తు మీద అమ్మకి ఎంత ఆరాటమో ఆమెవలన తెలుస్తుంది.

కళని గౌరవించడం మంచిదే కానీ అర్హత, అనుభవం ఏమీ లేకుండా ఏదో చేసెయ్యాలి అంటే సాధ్యమా? ఏ వయసులో అవి చెయ్యక తప్పవు, బాధ్యతల్ని బరువులుగా భావించేవారికి ఆనందరావు పాత్ర కనువిప్పులా ఉంది. మొత్తంమీద రచయిత్రి అన్ని పాత్రలకు న్యాయం చేకూర్చగలిగారు.

-సి. హెచ్.రాగిణి
గుంటూరు-5

## ధీర సింధూర

*(నాలుగవ బహుమతి రూ. 50/- పొందిన సమీక్ష)*

ప్రేమ త్యాగాన్ని కోరుతుందని, తను ప్రేమించిన మనిషి కోసం ప్రాణాలైనా అర్పించడానికి సిద్ధపడుతుందని సింధూర నిరూపించింది. రచయిత్రి కథ నడిపించిన తీరు అద్భుతం. నిర్మలమైన స్వచ్ఛమైన సింధూర, అరవింద్‌ల ప్రేమ అందరూ ఊహించినట్లుగానే సుఖాంతమైంది. కళాసేవ అంటూ బాధ్యతలు మరిచి దేశాలు పట్టుకు తిరిగే ఆనందరావులు సమాజంలో చాలా చోట్ల తగులుతూనే వుంటారు. రిటైరైన తండ్రి నాటకాలపిచ్చితో ఇల్లు వదిలి వెళ్లిపోతే అనారోగ్యానికి గురైన తల్లికి సంరక్షణ చేస్తూ అదే సమయంలో అరవింద్ నానమ్మ వజ్రమ్మతో భేదాభిప్రాయాలు వచ్చినా బేలగా బెంబేలు పడకుండా మనోనిబ్బరంతో ముందుకు సాగి సమస్యలను ధైర్యంగా



ఎదుర్కొన్న సింధూరని నేటి ఆధునిక యువతికి ప్రతీకగా చెప్పవచ్చును.

ఈ 'ఎదురింటి అమ్మాయి' నవలలో మరో ముఖ్యపాత్ర దీపిక. మాట మూగదైనా మనసూ, మానవత మూగకాదని నిరూపించిన మహోన్నత మూర్తి. తను వివాహం చేసుకుందామనుకొన్న అరవింద్ హృదయంలో సింధూర స్థిరంగా వుందని గ్రహించిన నాడే ఈ వివాహానికి గుడ్‌బై చెప్పమని పెద్దలకు తెలిపిన త్యాగమూర్తి. తను కోరుకొన్న స్థానాన్ని దక్కించుకొన్న సింధూర ఆసుపత్రి పాలైతే విశాల హృదయంతో ఆమెకు సపర్యలు చేసి మామూలు మనిషిని చేసిన మానవతావాది దీపిక.

సాటి మనుషుల్లోనే పరమాత్మ వున్నాడని గ్రహించి, రాంగ్‌ట్రాక్ వైపు మరలుతున్న తన జీవితాన్ని సక్రమమార్గంలోకి మళ్లించి, కన్న కొడుకుగా బాధ్యతనెరిగి ఇల్లువదిలిన తండ్రిని వెదికి తెచ్చి, తల్లి ప్రాణం కాపాడిన సంజయ్ యువతకు స్ఫూర్తిగా నిలుస్తాడు.

రచయిత్రి పాత్రలను నడిపించిన తీరు, లలితంగా సాగిన శైలి విశేషంగా ఆకట్టుకున్నాయి. సింధూర ఎదురింటి అమ్మాయిలా కాకుండా మనమ్మాయే అలా వుండాలని మధ్యతరగతి గృహస్థులూ గృహిణిలూ కోరుకునే విధంగా రచనను సాగించడంలో సఫలీకృతులయ్యారు రచయిత్రి. వారికి నా హార్థిక శుభాకాంక్షలు.

-ఎం.ఆర్.వి.సత్యనారాయణమూర్తి
పెనుగొండ-534320

## ప్రేమ పాఠాలు

*(అయిదవ బహుమతి రూ. 50/- పొందిన సమీక్ష)*

నవల చదువుతున్నంతసేపూ ఎక్కడా విసుగు అన్పించలేదు. సంజయ్ పాత్ర కొద్దిగా వెరైటీ అన్పించింది. ఈ రోజుల్లో లేరనికాదు కానీ సంజయ్‌ను తిరిగి మార్చే వైనం చాలా చక్కగా అల్లారు రచయిత్రి.

ఆనందరావుగారు ఓ సాదాసీదా భావాలు గల వ్యక్తి. ఆయనకు నాటకరంగంలో అనుభవం ఏమాత్రం లేకపోయినా, దాన్ని గురించి ఇల్లు వదలి ప్రమద్వర వెంట తిరగడం వింత అన్పించింది.

మొత్తానికి అరవింద్ సింధూరల ప్రేమ పాఠాలు బాగున్నాయి. ఇరువైపులా కూడా పెద్దలకు భయపడేవారు అనేదానికన్నా పెద్దలకు ఇచ్చే గౌరవం బాగుంది. వీళ్ల పార్కులో ఆనందరావు ప్రమద్వరలను గమనించడం, అరవింద్, సింధూరను సంజయ్ గమించడంలాంటి సన్నివేశాలు ఎంతో బాగున్నాయి. ఎదురెదురుగా ఉన్నా ఎక్కడా ఎప్పుడూ వారు తొందరపడడం జరగదు. కాబట్టి కథ బాగా ఎస్టాబ్లిష్ అయింది. వారి ప్రేమ చిగురించింది. మధ్యలో అరుంధతీ, వజ్రమ్మల పట్టుదలలవల్ల కొద్దిగా మాలాంటి పాఠకులకు ఆందోళన కలిగిందనడం వాస్తవం. జ్యోతిషం నిజమైనా, జరగబోయే దానిని ఆపలేమన్నా కొన్ని సమయాలలో దానిని మరుగుపర్చాలన్న వజ్రమ్మ వాదన సరియైనదే. జ్యోతిష్యుని వాదన కూడా ఆయనకున్న శాస్త్రపరిజ్ఞానానికి మచ్చుతునక.

చక్కని డైలాగులతో (ఎగతాళి దిగతాళి) ఆద్యంతం ఆహ్లాదకరమైంది. అరవింద్ సింధూర, సంజయ్ దీపికల వివాహం, అరుంధతి, ఆనందరావు, వజ్రమ్మల కలయిక ముగింపు బాగుంది.

-పట్నాల బాలసుబ్రహ్మణ్యం
నిజామాబాద్-503212

Edited, Printed and Published by Ramoji Rao for Vasundhara Publications, Printed at Colorama Printers Pvt. Ltd. Hyderabad Tel: 290328 Office Address: CHATURA Monthly, Eenadu Compound, Somajiguda. Tel. Hyderabad: 3318181, 3398787; Madras: 8270434, 8251044; Vijayawada: 476685; Visakhapatnam: 552211; Tirupati: 75291; Anantapur: 33777; Rajahmundry: 79170; Karimnagar: 83216; Suryapet: 21146; Guntur: 353942; Nellore: 331080



కేదార్‌నాధ్

